హాసం
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

68



**ముఖచిత్రం**
సౌందర్య
... క్షమించాలి ...
'శ్రీ ఆంజనేయం' లో
ఛార్మి



## హాస్యం — సంగీతం





'సెంటగ్ స్ప్రెడ్' లో



సినిమా పాటల ప్రత్యేకం




పాత పాటల ప్రత్యేకం
71. 72. 73 పేజీల్లో




'హాసం' 1-15 జులై పేజి 47లో "ప్రొఫెషన్ ఉన్నంత వరకే రిలేషన్"అన్న కీరవాణి గారి మాటలు అక్షర సత్యాలు. చక్రవర్తిగారిని గురించి గురుభక్తి, లోకంలో విలువల లోపం, స్వరూప సరళిని తెలియజేస్తాయి.

**-కాకుటూరు సుజాత నాగరాజరావు,కావలి.**

'హాసం'లో తరచు 'శ్రుతి'కి బదులు 'శృతి' అని అచ్చవుతోంది. ఈ దోషాన్ని పరిగణించి పరిహరించరా? 'శృతి' అనే మాటకు సంగీతపరమైన అర్థం లేదు.

**-కె.వీ. రామారావు, ఒరిస్సా**

**(ఇటువంటి సలహాలను శిరోధార్యంగా స్వీకరించ బుద్ధవుతుంది. అమూల్యమైన మీ సలహాను ఈ సంచిక నుంచే అమలు చేస్తున్నాం -ఎడిటర్.)**

1-15 జులై నాటి 'హాసం' పత్రికలో మణిశర్మ, కీరవాణిల గురించిన వ్యాసాలు బాగున్నాయి. ఈ వ్యాసాల ద్వారా వారికి సంబందించిన విశేషాలను తెలుసుకున్నాను. ప్రొఫెషన్ ఉన్నంత వరకే రిలేషన్ అని కీరవాణి గారు అన్న మాట వాస్తవం. నేటి సమాజంలో ఉన్న పరిస్థితి కూడా అదే? కీరవాణి గారికి పుట్టిన రోజు శుభాకాంక్షలను మా 'హాసం' పత్రిక ద్వారా తెలియజేసుకుంటున్నాను. వ్యాసాల నిడివిని కాస్త పెంచగలరు. ఇలా ఎప్పటికప్పుడు కొత్త విషయాలను తెలియజేస్తున్న 'హాసం'కు నా కృతజ్ఞతలు.

**-ఎ. శశికిరణ్, కరీంనగర్.**

'జంధ్యామారుతం' శీర్షికన ముద్దమందారం గురించి ప్రచురించిన కథనం మమ్మల్నెంతగానో ఆకట్టుకుంది. మీకు మా కృతజ్ఞతలు. తెలుగు సినిమా వరకు సంబంధించి హాస్యానికి రెండే రెండు చిరునామాలు. ఒకటి - విజయా వారి సినిమాలు. రెండు - జంధ్యాల గారి సినిమాలు. నేటి సినిమాల్లో హాస్యం వంకర పోయింది. రచయితలు ఒక్కసారి జంధ్యాల గారి సినిమాలు చూస్తే ఈ వంకరను సవరించుకునే వీలు ఉంటుంది. బూతులను - ఒకే మాట మూడు సార్లు పలకడాన్ని - 'కామెడి' అనుకోవాల్సిన దౌర్భాగ్యం ప్రేక్షకులకు తప్పుతుంది. సామాన్యమైన మాటల నుండి అసామాన్యమైన డైలాగుల సృష్టి చేయడం జంధ్యాల గారి ప్రత్యేకత. హాస్యానికి కాదేదీ అనర్హం అని నిరూపించిన వ్యక్తి జంధ్యాల. ఆయన ఏ సబ్జక్టు పైన హాస్యం సృష్టించినా అది హద్దు దాటేది కాదు. అందువల్లే ఆయన సినిమాల్లో 'పింజారి' వంటి పదాలు, అగ్రహారాల్లోని తిట్లు ఎవరినీ క్షోభకు గురి చేయలేదు. ఈ శీర్షికన మేము జంధ్యాల గారికి సంబంధించి అనేక విషయాలు తెలుసుకో గోరుతున్నాం.

**-సి. కళ్యాణ్ కుమార్,హైదరాబాదు.**

మీరు పంపిన ఆడియో సి.డి. అందినది. కృతజ్ఞతలు. 'హాసం' సిన్సియారిటీకి నా ప్రత్యేక అభినందనలు. అనేక పత్రికలు కథలు, కవితలను ప్రచురించి కూడా పారితోషికాలను ఎగ్గొట్టేస్తాన్న తరుణంలో'జోక్స్'కి బహుమతిగా సి.డి.లను పంపడం ప్రశంసనీయం. సోహన్ మ్యూజిక్ వారికి కూడా నా కృతజ్ఞతలను తెలియపరచగలరు. 'హాసం'తో జోక్స్ ద్వారా జరిగిన ఈ "కరచాలనం" మరిన్ని రచనల ద్వారా పటిష్టం కావాలని కోరుకుంటూ....

**-గరిమెళ్ళ నాగేశ్వరరావు,విశాఖపట్నం.**

'హాసం' ప్రారంభ సంచిక నుండి క్రమం తప్పక చదువుతున్నాను. కొన్ని పత్రికలు 'కాలపరీక్ష'కు నిలబడవు. రోజులు గడిస్తే అందులోని వ్యాసాలు ఏ రకంగానూ ఉపయోగపడవు. అందుకు 'హాసం' మినహాయింపు. అందుకే చాలామందిలానే నేను 'హాసం'ను జాగ్రత్త చేస్తున్నాను.

ఇకపోతే 1-15 జులై 2004 సంచిక సంపాదకీయంలో ఎమర్జెన్సీ చీకటి రోజుల్లోనూ కళాకారులు కొందరు తమ వ్యక్తిత్వాన్ని కోల్పోడానికి ఇష్టపడని అంశాన్ని ప్రస్తావించడం ఆనందాన్ని కల్గించింది. ధనం..కీర్తి... పోగు చేసుకోవటంలో మునిగిపోయిన కళాకారులు తమ ముందు జరుగుతున్న అన్యాయాన్ని ఎదురించటం మాట అటుంచి తమలోని అసంతృప్తిని కూడా వెళ్ళగక్కలేని స్థితిలో వుండటం బాధాకరం. ప్రభుత్వ ఆంక్షలు లేని ఈ రోజుల్లోనూ వీరు మౌనాన్ని ఆశ్రయించటం పట్ల మీరు చేసిన సుతి మెత్తని విమర్శ ఎంతో సమంజసంగా అనిపించింది.

ఎమర్జెన్సీ కాలంలో మా బాబాయ్ డా॥వడ్డి విజయ సారథి యేడాదికి పైగా జైలు జీవితాన్ని గడిపారు. మా నాన్నగారు వడ్డి చంద్రశేఖర్ రావు-ఎమర్జెన్సీ కాలంలో స్నేహలతా రెడ్డి జైలులో అనుభవించిన చిత్రహింసల్ని, అనంతరం ఆమె జీవితమే పరిసమాప్త మవ్వడానికి దారి తీసిన పరిస్థితుల్ని మాతో చెప్పి బాధపడుతుండేవారు. దాదాపు మూడు దశాబ్దాల నాటి ఎమర్జెన్సీ రోజుల్ని ప్రస్తావిస్తూ ఈ తరం కళాకారులకు మీరో చక్కటి మార్గదర్శనం చేశారు. సంతోషం.

సరిగ్గా ఇదే సంచికలో కీరవాణిగారు ఓ సంగీత దర్శకుడిగా, గాయకుడిగా తన 'సెలక్టివ్ నేచర్'ను సుస్పష్టంగా పేర్కొనడం బాగుంది. కీరవాణిగారికి 'హ్యాట్సాఫ్'. పులగం చిన్నారాయణ 'జంధ్యా మారుతం' -ఝుంఝా మారుతంలా సాగాలని కోరుకుంటూ.

**-ఓం ప్రకాష్ నారాయణ్, ఫిలిం జర్నలిస్ట్, హైదరాబాద్.**

'హాసం' ప్రతి సంచికను చదువుతాను. హాసం అంటే నాకెంతో ఇష్టం. నాకూ 'హాసం'లోని ఏదైన ఒక శీర్షికలో పాల్గొనాలన్పించి హ్యూమర్ బాక్స్‌కి.. కొన్ని జోక్స్ రాసిపంపించాను. అవి.... ఇంత తొందరగా 1-15 జూన్ 'హాసం' సంచికలోనే వెలుగు చూడడం నాకెంతో సంతోషాన్ని ఇచ్చింది. నా జోకులు...హ్యూమర్ బాక్స్‌లో చూస్తుంటే ఎంత సంతోషంగా వుందో మాటలో చెప్పలేను. నాకింత సంతోషాన్ని కలిగించిన 'హాసం'కు కృతజ్ఞతలు. ఈ జోకులకు బహుమతిగా..మీరు పంపిన అడవిరాముడు సి.డి.ని అందుకున్నాను.

**-వేంద్ర బాల స్వప్న, హైదరాబాద్.**

మీరు పంపిన పి.బి.శ్రీనివాస్‌గారి 'సిడి'లు అందినవి. చాలాకృతజ్ఞురాలిని. మంచి సాహిత్యానికి ఆరోగ్యకరమైన హాస్యానికి,హాసం ఎల్లప్పుడు చిరునామాగా ఉండాలని ఆశిస్తున్నాము.

**-యస్. రామలక్ష్మి, ఆకివీడు.**

'హాసం' ఇటీవలే నా మిత్రుడు చదువుతుండగా తీసుకొని చదివాను. ఇన్నిరోజులు ఎంతో మిస్ అయ్యాను అనిపిస్తుంది. ఇంతకాలం దాని పేరు చూసి అది ఒక్క జోక్స్ పత్రికేమో అనుకునేవాణ్ణి. కాని జోక్స్‌తో పాటు మాలాంటి ఔత్సాహిక సంగీత కళాకారులకు, గాయనీ గాయకుల ఓల్డ్, గోల్డ్ లాంటి పాటల విశేషాలు, విషయాలు తప్పులు లేకుండా చూసి ఆశ్చర్యం చెందాను. అప్పటి నుండి 'హాసం' అభిమానిగా మారి క్రమం తప్పకుండా కొని చదువుతున్నాను. నిజంగా 'హాసం' చేస్తున్న కృషి అభినందనీయం. ప్రతి పత్రికలో ఒక ఓల్డ్ సినిమా, ఒక కొత్త సినిమా పాటల సంపుటి ఇవ్వడం పత్రిక గొప్పదనం.

**-ఎ. శ్రీనివాస్,మహబూబ్‌నగర్.**

'హాసం'పత్రికలో జంధ్యామారుతం శీర్షికలో ప్రచురించిన 'ముద్దమందారం' చిత్ర విశేషాలు చాలా బాగున్నాయి. జంధ్యాల గారి 'అహ నా పెళ్ళంట' చిత్ర విషయాలు తెలియజేస్తారని ఆశిస్తున్నాను. హిందుస్తానీ సంగీతంలో తనికెళ్ళ భరణిగారి వ్యాసాలు ఎంతగానో ఆకట్టు కుంటున్నాయి.

**-వరదా సాయికుమార్, పర్లాకిమిడి**

మీరు అందిస్తున్న 'హాసం' లోని అన్ని శీర్షికలు మమ్మల్ని అలరిస్తున్నాయి. ముఖ్యంగా 'ఆ పాత మధురం', పాత పాటల ప్రత్యేకం, నేనూ-నా పాటలు, అర్థం చేసుకుందాం-ఆస్వాదిద్దాం, కొమ్మా కొమ్మా కోకిలమ్మ శీర్షికలు ఒక దానితో మరొకటి పోటీ పడుతున్నాయి. ఆనందింప జేస్తున్నాయి.

**-ఏ.జయలక్ష్మి, అశోక్‌కుమార్‌రావు గుర్రంపోడ్(నల్గొండ జిల్లా)**

సంపుటి: 3 సంచిక20

**16-31 జులై 2004**

**పేజీలు: 76**

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా: రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా: రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 400

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
**డా॥ కె.వి.రావు**
**జె.మధుసూదన శర్మ**

మేనేజర్
**పి.గిరి**
చీఫ్ లే-అవుట్ డిజైనర్
**జి.రాజేష్**

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82



The one and only Magazine devoted to Humour & Music




# హాసం

## హాస్య-సంగీత పత్రిక


68


కొన్ని కొన్ని ఆనవాయితీలు వాటంతట అవే ఏర్పడతాయి కాబోలు. ఫలానాది ఫలానా విధంగా ఉండాలి అని ఎక్కడా వ్రాసి లేకపోయినా, మన మనసులో ఎక్కడో నాటుకుపోతుంది. కొత్త తరహాగా ఆలోచించి చూసినా, ప్రయత్నించి చూసినా ఎబ్బెట్టుగా తోస్తుంది. మనకు మనమే ఒక గాటకు కట్టేసుకునే పరిస్థితి వస్తుంది. కొన్ని సందర్భాలలో 'ఇలా ఎందుకు చేస్తున్నావ్?' అని అడిగేవరకూ మనం దానిపై దృష్టి సారించం. "ఏదో ఇలా అలవాటు అయిపోయిందండి" అనేసి ఓ నవ్వు నవ్వేస్తాం.

ప్రతి పద్ధతికీ తొలిదశలో ఏదో ఒక తర్కం ఉండి తీరుతుంది. క్రమేణా ఆ తర్కం మర్చిపోయి రొటీన్‌గా ఆలోచించుకుంటూ, అలవాటు పడిన దారిన పడిపోతూ వుంటాం. కొంతకాలం గడిచేసరికి ఆ తర్కం పొసగని సందర్భాలు రావచ్చు. అయినా మన ఆలోచనావిధానం మారదు. ఈ విషయాన్ని గుర్తించే అనేక సంస్థల్లో మధ్యస్థాయి పరిపాలనా వ్యవస్థలో కొత్తవారిని, యువతరం వారిని ప్రవేశపెడతారు. వారికి అనేక సందేహాలు వస్తాయి-'ఇది ఇలాగే ఎందుకు చేయాలి? మరోలా ఎందుకు చేయకూడదు?' అని . తర్కం గురించి పట్టించుకోకుండా దశాబ్దాలుగా ఒకే పద్ధతికి కట్టుబడి వున్నవారు వారికి సమాధానం చెప్పడానికి తబ్బిబ్బు పడతారు. ఏదో కుంటిసాకు చెప్పబోతారు. దానికి కొత్తవారు సమాధానపడక, మరోమార్గంలో ఆలోచించి ఒక్కొక్కప్పుడు సులభమైన దారులు కూడా కనుక్కోగలుగుతారు. తద్వారా సంస్థకు మేలు చేకూర్చగలుగుతారు.

అన్నిటా కొత్తవ్యక్తులు కొంగ్రొత్తగా ప్రవేశించే సౌలభ్యం లేదు కాబట్టి మనమే అప్పుడప్పుడు కొన్ని ఆచారాల పట్ల, ఆనవాయితీల పట్ల సింహావలోకనం చేసుకుని చూడాలి. ఉదాహరణకి, ఉత్తమ గాయనీ గాయకులకు కొన్ని ప్రైవేటు సంస్థలు ఇచ్చే అవార్డుల సంగతే తీసుకోండి. గాయకుడు గానీ, గాయని గానీ ఒక్కరే పాడిన సోలో పాటలను మాత్రం అవార్డుల ప్రదానానికి పరిగణనలోకి తీసుకోవడం జరుగుతోంది. ఆ విధంగా యుగళగీతాలు ఎవరి ఖాతాలోకీ రావటం లేదు. ఫలానా డ్యూయెట్‌లో గాయకుడు బాగా పాడాడు కదా అంటే 'ఏముంది సార్, ఫిఫ్టీ పర్సంటే కదా !' అనేస్తారు.

గతంలో సినిమాకి సగటున ఏడెనిమిది పాటలుండేవి. ఇప్పుడు ఐదారు మాత్రమే! విభిన్న తరహాల పాటలుండేవి, ఇపుడు దాదాపు అన్నీ ప్రేమగీతాలే! అప్పట్లో నేపథ్యగీతమో, విషాదగీతమో, హాస్యగీతమో, మరోటో- ఒక్కరూ పాడేపాటలు గణనీయంగానే ఉండేవి. ఒకే పాటకు రెండేసి వెర్షన్లు హేపీ/శాడ్, మగ/ఆడ- వుంటుండేవి. గాయకుడి లేదా గాయకురాలి ప్రతిభ అంచనా వేయడానికి కావలసినన్ని శాంపుల్స్ అందుబాటులో ఉండేవి. కాలక్రమేణా వచ్చిన మార్పుల వల్ల మిగిలిన తరహాల పాటలన్నీ వినమరుగైపోయి, యుగళగీతాలు మాత్రమే మిగిలాయి. మరి వీటి నుండే ఏరుకుని గాయనీ గాయకుల సత్తా బేరీజు వేయవలసివస్తుంది!

కనీసం మూడు నిమిషాలపాటు, ఒక్కడూ పాడితే తప్ప గాయకుడిని విలువ కట్టలేమని అనడం సమంజసం కాదనిపిస్తుంది. పాట మూడు నిమిషాలపాటు ఉండమనే ఆచారం గ్రామఫోన్ రికార్డుల పరిమితి బట్టి వచ్చిందేమో! ఎలక్ట్రానిక్ యుగంలోకి వచ్చేశాం కాబట్టి. అర్కెస్ట్రయిజేషన్‌కు ప్రాధాన్యం పెరిగింది కాబట్టి పాటలిప్పుడు అయిదారు నిమిషాలుంటున్నాయి. వాద్యాలు ఎన్ని వున్నా, ఒక్కోప్పుడు డామినేట్ చేశాయనిపిస్తున్నా అప్పుడప్పుడు గాయనీ గాయకుల కంఠస్వరాలను మనం ఆస్వాదించ గలుగుతున్నాం, ప్రశంసించగలుగుతున్నాం.

కొన్ని సందర్భాలలో పల్లవి,రెండు చరణాలు ఒకరుపాడగా, చివరిలో మరొకరు అందుకుని పల్లవి రిపీట్ చేయడమో ('పాడవేల రాధికా'లో ఘంటసాలలా),లేదా వెనక్కాల అలాపిస్తూ వచ్చి మధ్య మధ్యలో గొంతు కలపడమో ('ధీరసమీరే'లో సుశీలలా)జరిగినపుడు ఘంటసాల/సుశీల గానపటిమను మనం గుర్తించలేకపోతున్నామా? ఒక ఎత్తుగడ, ఒక విరుపు, ఒక మలుపు..ఏ ఒక్కటైనా చాలు, గాయకుడు లేదా గాయని ఏ పాటివారో తెలుసుకోవడానికి!

సినిమా ఒక సమిష్టి కృషి అయినా వ్యక్తిగత ప్రతిభను ప్రేక్షకులు, శ్రోతలు గుర్తిస్తూనే ఉన్నారు. ఏవేవో నిబంధనలు విధించుకుని గుర్తింపు నిరాకరిస్తే అది సినీ సంగీత రంగానికి మేలు కలిగించదు.



అందరినీ ఈ విషయంపై గట్టిగా ఆలోచించమని 'హాసం' కోరుతోంది.



ప్రముఖ దర్శకుడు
**శ్రీ సింగీతం శ్రీనివాసరావు**
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

## కరాజు కథలు 17

# కుడి ఎడమైతే



సింగరాయపురం రాజు శివరాజు, కరాజుకు చాలా దగ్గర బంధువు. అతని ఏకైక కుమారుడూ, యువరాజైన కుమార రాజుకు పెళ్ళి నిశ్చయమయింది. శివరాజు, కరాజును సాదర పూర్వకంగా పెళ్ళికి ఆహ్వానించాడు. వాళ్ళ వంశాచారం ప్రకారం పెళ్ళికొడుకు ఊళ్ళోనే పెళ్ళి జరిగేట్టు ఒప్పందం అయింది. అందుకని కరాజు మంత్రితో సహా పెళ్ళికి ముందు రోజే సింగరాయపురం చేరుకున్నాడు.

కానీ కరాజు అడుగుపెట్టగానే మగపెళ్ళి వారిచ్చిన స్వాగతం తీరు కరాజును, మంత్రిని దిగ్భ్రాంతిలో ముంచేసింది. చక్కగా అలకరించుకున్న ఒక స్త్రీ కరాజుకు ఎడమ చేత్తో బొట్టు పెట్టింది. మరొక స్త్రీ ఎడమచేత్తో హారతి ఇచ్చి, ఎడమ చేత్తోనే ఆహ్వానిస్తూ అతిథి గృహానికి తీసుకెళ్ళింది. రాత్రి భోజనం వడ్డించిన వారు కూడా ఎడమచేత్తోనే వడ్డించారు. మంత్రి ఇదేం అర్థంకాక తను ఎడమ చేత్తో తినాలా,కుడిచేత్తో తినాలా అనే సందిగ్ధంలో పడి చివరకు కుడి చేత్తోనే తిన్నాడు. అసలు ఇక్కడ ఈ ఎడమ సాంప్రదాయం ఎక్కణ్ణుంచి వచ్చింది, ఎందుకొచ్చిందీ అని ఒక నౌకరును పిలిచి అడిగాడు కరాజు. నౌకరు దీని వెనకున్న కథను సవిస్తరంగా చెప్పాడు.

యువరాజు వాళ్ళ తల్లిదండ్రులకు గారాబు బిడ్డ. అతనెంత చెప్తే అంతే. దీనికి తోడు అతని బామ్మ ఎనభై ఏళ్ళ రాజమాత వసుంధరాదేవికి

అతనంటే ప్రాణం. దాంతో అక్కడి వారంతా రాజుగారి మాటైనా కాదంటారేమో గాని యువరాజు మాటను కాదనే సాహసం వాళ్ళకెవ్వరికీ లేదు. ఈ సమయంలో యువరాజుకు అనంగవర్మ అనే కుర్రాడితో పరిచయ మయింది. అది గాఢమయిన స్నేహంగా ముదిరింది. అనంగవర్మ ఏం చెప్పినా యువరాజు వింటాడు. తోటి బాలురను ఆటకు పిలిచి వాళ్ళను ముళ్ళ కంపల్లోకీ,నీళ్ళల్లోకీ తోయించడం వాళ్ళ సరదా. ఈ చేష్టలు చుట్టున్న వారు చూస్తూ ఊరుకోవలసిందే. ఏమీ చెయ్యలేరు. సృష్టిలో తీయనిది స్నేహం అంటే వాళ్ళు అసలు ఒప్పుకోరు.

ఒకసారి అనంగవర్మ అత్యాచారాలు గురించి విన్న రాజుగారు ఆగ్రహించి అనంగవర్మను రాజభవనంలోకి అడుగుపెట్టొద్దని ఆజ్ఞాపించాడు. దాంతో యువరాజు అలిగి రాజమాతకు ఫిర్యాదు చేసుకుంటే, ఆమె ఉగ్రరూపం దాల్చి అంతా దద్దరిల్లేట్లు కొడుకుతో సహా అందర్నీ చీవాట్లు పెట్టింది. చేసేది లేక రాజుగారు అనంగవర్మను మళ్ళీ పిలిపించాడు.




యువరాజుకు యుక్తవయస్సు వచ్చింది. దాంతో ఎన్నెన్నో కోరికలూ వచ్చాయి. వాటిని తీర్చే నేర్పరితనం అనంగవర్మకు సహజంగా అబ్బిన విద్య. ఒకరి అవసరం మరొకరికి ఆదాయం. రోగులుంటేనే వైద్యునికి సంపాదన. ఊళ్ళో వాళ్ళంతా సన్యాసులై క్షవరం చేసుకోము అంటే క్షురకులంతా నిరుద్యోగులే!

ఈ అద్భుత వ్యాపార దృక్పథాన్ని అనంగవర్మ అవలీలగా అవగాహన చేస్కున్నాడు. తన విద్యను ఉపయోగించుకోడానికి యువరాజు ఇప్పుడు అనువుగా దొరికాడు. ఇదే సమయంలో రాజుగారికి కాస్త జబ్బుచేసి రాజకార్యాల్ని సొంతంగా చూసుకునే ఓపిక తగ్గింది. కొంతకాలం వరకు రాజ్యవ్యవహారాల్ని కొడుకునే చూసుకొనమని చెప్పి తను భవనంలో వైద్యం చేయించుకుంటూ ఉండిపోయాడు.

ఈ తలనొప్పి రాచకార్యాల్ని నెత్తిన వేస్కోడం యువరాజుకు ఏ మాత్రం ఇష్టంలేదు. కానీ తప్పదు. మరెలా? ఒక మెరుపు లాంటి ఆలోచన తట్టింది. "సలహాదారుడు" అనే ఒక ఉద్యోగాన్ని సృష్టించి, అనంగవర్మను తన ముఖ్య సలహాదారునిగా నియమించుకున్నాడు. ప్రపంచంలో అందరికీ కావాల్సింది,అందరూ అడిగేది, అందరూ ఇచ్చేది, ఎవ్వరూ తీసుకోనిదీ ఒక్కటే-సలహా.

కానీ యువరాజు ఇందుకు విరుద్ధం. తనేం చేసినా అనంగవర్మ సలహాను బట్టే. ఇక అనంగవర్మ ఇచ్చే సలహాలు తన ప్రత్యేక ప్రతిభకు తార్కాణాలుగా నిలిచేవి. ఈ క్రమంలో అతని మొదటి సలహా తూర్పువీధిలోని అందాల భామ చింతామణితో పరిచయం చేస్కోమని చెప్పడం. యువరాజు దీనిని వెంటనే పాటించడమే కాక, ఈ సలహా ఇచ్చినందుకు పారితోషికంగా కొన్ని ఎకరాల భూమిని, ఒక భవనాన్ని అనంగవర్మకు రాసిచ్చాడు.

చింతామణి భాగ్యాన్ని గురించి విన్న మంజీర, రత్నాంగి, మేనకలాంటి సౌందర్యవతులు అనంగవర్మను చుట్టుముట్టి, కానుకలర్పించుకొని తమకు కూడా ఈ భాగ్యం అందచేయలసిందిగా ప్రాధేయపడ్డారు. దాంతో నెలకొకర్ని యువరాజుకు పరిచయం చేస్తూ అనంగవర్మ సామాన్యుల కతీతమైన ఆస్తి పాస్తులను సంపాదించాడు.

ఒకరోజు కోశాధికారి యువరాజు దగ్గరకు వచ్చి "యువరాజా! ఖజానాలో డబ్బులు ఇంచుమించు లేవు. ఇక రాజ్యాన్ని నడపడం కష్టం" అని విన్నవించాడు.

"ఇంచుమించు లేవా? అదెలా?" అన్నాడు ప్రక్కనే ఉన్న అనంగవర్మ.

"ఒకచోట పెరిగితే మరొకచోట తగ్గాల్సిందే కదండీ" అన్నాడు కోశాధికారి వ్యంగ్యంగా.

కంగారుపడ్డ యువరాజు అనంగ వర్మను పక్కకు పిలిచి ఈ సమస్యలోంచి బయటపడటానికి వెంటనే ఒక సలహా ఇవ్వమని అడిగాడు. అనంగవర్మ క్షణంలో ఒక అద్భుతమయిన ఉపాయం చెప్పాడు.

విశేష ధనవంతుడుగా పేరుగాంచిన కాంచనకోట రాజుగారి ఏకైక కుమార్తె పద్మావతిని యువరాజు పెళ్ళి చేసుకుంటే అన్ని సమస్యలూ తీరుతాయి అన్నాడు.

"ఆమె అంత అందంగా ఉండదట. నల్లగా ఉంటుందట కదా" అన్నాడు యువరాజు.

"ఆమె వేన్నుక్కన్న బంగారం కాంతివంతంగా ఉంటుంది కదా" అన్నాడు అనంగవర్మ.

"ఆమె లలిత కళల్లో ఉత్తీర్ణురాలట" అన్నాడు యువరాజు.

"అది మనకెందుకు? వాళ్ళకున్నంత ధనం ఈ చుట్టూవున్న రాజులకు ఎవ్వరికీ లేదు. మీకిచ్చుకునే కట్నంతో కొన్ని దశాబ్దాలు నిశ్చింతగా జీవించవచ్చు. పైగా ఆయన పోయిం తర్వాత ఆ రాజ్యానికి కూడా తమరే రాజు" అన్నాడు అనంగవర్మ.

యువరాజు ఈ విషయం తండ్రికి చెప్తే, ఆయన మహదానందంతో ఈ శుభకార్య నిర్వహణకు పూనుకున్నాడు. పెళ్ళిచూపులు కానిచ్చారు. ఇరు పక్షాల వారూ సరేనన్నారు. వంశాచారమే కాక మంచం నుంచి లేవలేని రాజమాత రాజేశ్వరీ దేవిగారి కోసం కూడా పెళ్ళి అబ్బాయి ఊళ్ళోనే జరగాలని కోరారు. దానికి కూడా ఆడపెళ్ళివారు ఒప్పుకున్నారు. అంతా



కుదిరింది కదా అనుకున్న సమయంలో రాజమాత మరొక షరతు పెట్టింది.

తాను పెళ్ళి చూపులకు రాలేని స్థితిలో ఉంది గనక, పెళ్ళి కూతుర్ని ఒకసారి తమ ఇంటికి పిలుచు రావాల్సిందిగా కోరింది. కానీ కాంచనకోట రాజవంశంలో పెళ్ళి నిశ్చయం అయింతర్వాత, పెళ్ళికి ముందు పెళ్ళికూతురు అబ్బాయి ఇంటికి వెళ్ళడం కుదరదు. రాజమాత తన మంకుపట్టు విడువదు. అందుకని, ఒక పరిష్కార మార్గంగా పద్మావతీ దేవి చిత్రపటాన్ని ఒకటి గీయించి పంపమని కోరారు.

మూడువారాల్లో రాకుమారి చిత్రపటం సింగరాయపురం చేరుకుంది. అందులో పద్మావతి భుజం మీద పట్టుశాలువ కప్పుకొని చిత్ర లేఖనం చేస్తున్నది. కాకపోతే అందరికీ కాస్త వింతగా కనిపించింది ఆమె బొమ్మను ఎడమ చేత్తో గీస్తున్న తీరు. ఇది చూసిన యువరాజుకు ఒక రకమైన అసంతృప్తి ఆవరించింది. ఎడమచేత్తో పనులు చేసే ఆడవాళ్ళకు గయ్యాళి లక్షణాలుంటాయని చిన్నప్పుడెవరో చెప్పారు. ఇప్పుడీ నెపంతో ఊళ్ళో జనమంతా తన వెనకనుంచి అసభ్యకరమైన ఛలోక్తులతో నవ్వుకుంటారని యువరాజు భయం. "ఇందులో ఏ దోషమూ లేదు. ఎవరి అలవాటు వారిది" అన్నారు తెలిసిన కొందరు పెద్దలు. కాని యువరాజుకీ మాటలు తృప్తి కలిగించలేదు. వెంటనే అనంగవర్మను పిలిపించాడు.

"మిత్రమా! ఏమిటి ఇలాంటి సంబంధం చేస్కోమని సలహా ఇచ్చావ్?" అన్నాడు ఎప్పుడూ లేని అసహనంతో. అనంగవర్మ కాస్త కంగు తిన్నట్టు చూశాడు. కాని వెంటనే తెప్పరిల్లుకొని "మిత్రమా! ఇది నేను తెలిసే చేశా"నన్నాడు ధీమాగా. యువరాజు ఎదుట ఎలా బొంకాలో అతనికి బాగా తెలుసు .

"తెలిసే చేశావా?"

"అవును యువరాజా! ఆ రాజ్యం డబ్బు వాళ్ళు ఎడం చేత్తో ఇచ్చినా అది డబ్బే. మీరు కుడి చేత్తో పుచ్చుకున్నా అది డబ్బే. అది మారదు. మనం ఈ సంబంధం చేస్తున్నదే దాని కోసం. కాకపోతే పెళ్ళికి ముందే రాజ్యంలో ఎడమచేతి సంస్కారం చాలా ఉత్తమమైనది అనే భావనను ప్రజల్లో కలిగేలా చేద్దాం. దీనికి కావలసిన ప్రచారం చేద్దాం. అప్పుడు పెళ్ళి రోజున అందరూ ఎగతాళి చెయ్యడం బదులు మీ మీద ప్రశంసా వర్షాలని కురిపిస్తారు."

ఈ సలహాకు నిరుత్తరుడయ్యాడు యువరాజు. అనంగవర్మనే దీనిని కార్య రూపంలో పెట్టమని కోరాడు. మరుసటి రోజే ప్రభుత్వ కార్యాలయాల్లోంచి ఉత్తర్వులు జారీ అయ్యాయి. అందులోని సారాంశం-వైవిధ్యంగా పనులు చేసే వాళ్ళను ప్రభుత్వం ప్రోత్సహించాలనుకుందని, ముఖ్యంగా ఎడమచేత్తో పన్లు చేసేవాళ్ళు ఎక్కువ ప్రతిభావంతులనే




నిర్ణయానికి ప్రభుత్వం వచ్చిన కారణంగా అలాంటివాళ్ళకు జీతాలు హెచ్చింపు చెయ్యడమే కాక తగురీతిన సన్మానాలు కూడా చేస్తారని. ఈ ఉత్తర్వు చూడగానే ఎవరికి వారు తమ పనులను ఎడమచేత్తో చెయ్యడానికి అలవాటు చేస్కోడం మొదలెట్టారు. ఇప్పుడు ఎడమచేతివాడంటే సమాజంలో ఒక గౌరవం. ఇంట్లో వంటలు చేసే ఆడవాళ్ళు మొదలుకొని పొలాల్లో పనిచేసే వారు, సైనికశిక్షణ పొందేవారు ఇంకా ఎందరో కుడివారంతా ఎడమవారయ్యారు. చివరకు గుడిలో హారతులిచ్చే పూజారి కూడా ఎడమచేత్తోనే హారతిస్తున్నాడు. ఈ దెబ్బతో దేవుడు కూడా ఎడమచేత్తోనే అభయ హస్తం చూపిస్తాడా అనే అనుమానం అందరికీ వచ్చింది. యువరాజు పరమానంద భరితుడయ్యాడు.

ఇప్పుడు తనకు కాబోయే భార్య ఎడమసంస్కారం గలదని అందరికీ తెలియగానే ఆమెను ప్రతిష్ఠాత్మకంగా చూస్తారనడంలో సందేహం లేదు. ఇటువంటి సలహాలనిచ్చిన సలహాదారుడు దొరకడం తన పూర్వజన్మ సుకృతం అనుకున్నాడు. ఈ వాతావరణంలోనే పెళ్ళిరోజు దగ్గరికి రావడం, కరాజు మంత్రితో సహా అతిథిగా విచ్చేయడం,వాళ్ళకందరూ ఎడమచేత్తో స్వాగతం పలకడం జరిగాయి.

కాని పెళ్ళికూతురి పక్షం వారికి మాత్రం ఈ ఊరి వారి ఎడమచేతి పద్ధతి విడ్డూరంగా తోచింది. ఎందుకిలా చేస్తున్నారని ఆ ఊరి మంత్రిగారు రహస్యంగా ఆరా తీస్తే, అక్కడున్న ఒకతను ఈ ఊరినీళ్ళు అలాంటివనీ, కొన్నాళ్ళు తాగితే కుడిచెయ్యి పడిపోతుందనీ, ఇక తప్పనిసరి అన్ని పనులూ ఎడమచేత్తోనే చెయ్యాల్సి వస్తుందని చెప్పాడు. నిజం చెప్తే ఏం కొంపమునుగుతుందోనని ఇలా తనకు తోచింది సర్దిచెప్పాడు.

ఈ వార్తవిన్న కాంచనకోట రాజుకు ఎక్కడలేని భయం పుట్టుకొచ్చింది. ఇటువంటి విషపు నీళ్ళున్న రాజ్యంతో సంబంధం చేస్కోడం దుస్సాధ్యం అని నిర్ణయించుకున్నాడు. పెళ్ళిరోజు ఉదయాన్నే తామీ పెళ్ళిని నిరాకరిస్తున్నట్టు ప్రకటించారు. సింగరాయపురం భూపతికి పిడుగు పడ్డట్టయింది. కోపం వచ్చింది. ఇరువర్గాల వారు వేడిగా వాదులాడుకున్నారు. చివరకు పెళ్ళి కొడుకైన యువరాజు కూడా రంగంలోకి దిగాడు.

''మమ్మల్ని ఎడమచేతి వాళ్ళంటారేంటి? అసలు మీ అమ్మాయే ఎడమచేతిది. చూడండి!" అంటూ పెళ్ళి కూతురు ఎడమచేత్తో గీస్తున్నట్లున్న చిత్రపటాన్ని చూపించాడు యువరాజు.

"నిజనిజాలు తెలుసుకోకుండా ఇలా నిర్ణయాలు తీసుకునే మీతో అస్సలు సంబంధు వద్దు" అన్నాడు కాంచనకోట రాజు.

కోపంతో పెళ్ళివారంతా ఊరు విడిచి వెళ్ళి పోయారు. ఆ తర్వాత తెల్సింది అసలు నిజం. కాంచనకోట రాజుల వంశంలో పెళ్ళీడున్న అమ్మాయి ఎదురుగా కూర్చొని చిత్రపటాల్ని గీయడం ఒప్పుకోరు. అది నిషేధం. అందుకని అమ్మాయిని తెరవెనుక ఒక అద్దం ముందు కూర్చోపెట్టారు. అమ్మాయిని నేరుగా చూడలేని చిత్రకారుడు ఆమె ప్రతిబింబాన్ని అద్దంలో చూసి చిత్రీకరిస్తాడు. ఈ రీతిలో తను చూసిందే గీసే చిత్రకారుడు గనుక ఆమె ఎడం చేత్తో బొమ్మను గీసినట్టు చిత్రీకరించాడు. భుజం మీద శాలువ కప్పుకొనుండడంవల్ల పైట ఎటువైపు వేసిందో తెలియలేదు.

ఈ సంగతంతా మొత్తం జనానికి తెల్సిపోయింది. యువరాజు పేరు చెప్తే చాలు అందరూ హేళన చేసేవారే. ఇది విన్న యువరాజుకు అనంగవర్మ మీద కోపం అగ్నిజ్వాలలలా లేచింది. వెంటనే అతన్ని పిలిపించి కఠినంగా శిక్షించాలనుకున్నాడు. కాని అనంగవర్మ ఉదయాన్నే తన ఆస్తిపాస్తులను వచ్చిన ధర కమ్మేసి ఒక బండెక్కి ఊరు విడిచి వెళ్ళి పోయాడనే వార్త రాగానే చేసేది లేక తన్ను తాను నిందించుకుంటూ కూలబడి పోయాడు.

తిరుగు ప్రయాణం సాగిస్తున్న కరాజు మంత్రిని చూసి ''చూశారా మంత్రీ! ఏ రాజ్యంలోనైనా మనవాడు కదా అని ఎవర్నైనా సలహాదారుడిగా చేస్తే ఇక రాజ్యం గతి ఇంతే. మొత్తం తారుమారౌతుంది" అన్నాడు.

"అవును మహారాజా! ఇలా కుడి ఎడమైతే సరిదిద్దలేని పొరపాటౌతుంది" అన్నాడు మంత్రి కరాజును సమర్థిస్తూ.




(క్రితం సంచిక తరువాయి)

నాగయ్య జీవితంలో ఓ ప్రధాన ఘట్టం- 'త్యాగయ్య' సినిమా వ్రాసి , తన దర్శకత్వంలోనే నిర్మించడం. నిజానికి త్యాగయ్య మరణించి రమారమి 250 సంవత్సరాలు మాత్రమే అయింది. అప్పటికే విదేశీయులు మన గడ్డపై కాలుమోపడం, మన చరిత్ర గ్రంథస్తం కావడం జరిగింది. అందువల్ల చారిత్రాత్మక చిత్రంలా తీయాలి కానీ మరీ జానపదగాథలా మాయలు, మంత్రాలు, అద్భుతాలు పెట్టేస్తే అతకదు. అలా అని మామూలు కథలా తీస్తే నాటకీయత లోపిస్తుంది. కచ్చేరీలో పాడితే గంటసేపు సాగే కీర్తనలను సినిమా తెర కనుగుణంగా మలచడం ఎలా? పండిత పామరులను మెప్పించడం ఎలా? ఆ ఫీటు ఎలా చేశారో నాగయ్య వివరించిన విధం -

"వాహినీ వారి 'పోతన' సినిమా హిట్ అయాక పూర్ణా పిక్చర్స్ అధిపతి జి.కె.మంగరాజుగారు 'మీరు త్యాగరాజు చరిత్ర చిత్రంగా తియ్యకూడదా? చిత్రం డిస్ట్రిబ్యూషన్ కూడా నేను తీసుకుంటాను." అని ప్రోత్సహించారు. ఆ ఉత్సాహంతో త్యాగరాజు తంజావూరు లైబ్రరీలో దొరికేవాటితో సహా జీవితచరిత్రలన్నీ చదివాను. వాటిల్లో చిత్రానికి కావలసిన కథ లేదు. రసవత్తర ఘట్టాలు ఏమీ కనిపించలేదు. కథారూపం లేకుండా తీస్తే డాక్యుమెంటరీలా ఉంటుంది. పాత్రలు విశిష్టంగా కనిపించవు. చిత్రంలో ఉత్సాహం ఉండదు. అందువల్ల మూలకథకు భంగం రాకుండా, లేని ఘట్టాలు కల్పించకుండా ఉన్నవాటినే తీసుకుని వాటికి ప్రాణం పోసి కథను అల్లాలని 'త్యాగయ్య' చిత్రనిర్మాణానికి ఉద్యమించాను.


పే - 144 వెల రూ. 150/-
ప్రతులకు ఆర్కేబుక్స్, హైదరాబాదు
040-23830137

త్యాగరాజు నివసించిన తిరువయ్యార్ వెళ్లి ప్రాతఃకాలమే లేచి కావేరీ నదిలో స్నానం చేసి శుచిగా ఆయన సమాధి దగ్గిర కూర్చుని ఉపవాసాలు కూడా చేస్తూ కథ రాయడం మొదలెట్టాను. కొన్నాళ్లకు కథకు ఒక రూపం వచ్చింది. నాకూ కొంత ధైర్యం వచ్చింది. ఆ కథారూపాన్ని తీసుకుని పెద్ద పెద్ద విద్వాంసులకు, త్యాగరాజు జీవితం గురించి బాగా విన్నవారికి చూపించాను. అందరూ సంతృప్తి చెందారు. మద్రాసు వనస్తానే సముద్రాల గారికి వినిపించాను. రసవత్తరంగా ఉందని అని వారు అభినందించారు. అక్కణ్ణుంచి నేను, సముద్రాల, లింగమూర్తి కూర్చుని దానిమీద తర్జనభర్జనలు చేనస్తూ స్క్రీన్‌ప్లే తయారుచేశాము. అప్పుడప్పుడు బి.ఎన్.ను ఆహ్వానిస్తూ వారి సలహాలు తీసుకుంటేవాడిని. కథా, కమామిషు సిద్ధమయినాయి.


అష్టకష్టాలు పెట్టిన 'రామదాసు'

నేను త్యాగరాజు పాత్ర ధరించాలి. త్యాగయ్యలా పాడాలి. కీర్తనలు పాడడంలో ఎక్కడా తేడా రాకూడదు. ఔచిత్యానికి భంగం వాటిల్లకూడదు. మహామహా సంగీతవిద్వాంసులు చిత్రం చూస్తారు. ఎక్కడ ఏ లోపం వచ్చినా క్షమించరు. అధి దృష్టిలో వుంచుకుని పెద్ద పెద్ద సంగీత విద్వాంసులను ఆహ్వానించసాగాను. వారిచేత త్యాగరాజ కీర్తనలు పాడించుకుంటూ వింటూ, వారి సలహాలు తీసుకుంటూ నేను పాడుతూ ఉండేవాడిని. అప్పుడు మా రేణుకా ఆఫీసు పెద్ద సంగీతసభలాగ వుండేది. ఎందరో గాయనీ గాయకులు వచ్చి నిత్యం పాడుతూ వుండేవారు. అయిదుగురు వంటవాళ్లను పెట్టి అందరికీ భోజనవసతి కల్పించాం. దాదాపు రెండుసంవత్సరాలపాటు అలా సాగింది.

దర్శకత్వం వద్దకు వచ్చేసరికి బియన్, కెవి వాహినీ చిత్రాలలో బిజీగా ఉన్నారు. సంగీతంతో కనీస పరిచయమైనా వున్నవారిచే డైరెక్టు చేయించాలని అనుకుంటూండగా నాకు సహాయపడుతున్న చెంగయ్య నన్నే దర్శకత్వం వహించమని ప్రోత్సహించాడు. మొదటినుంచి కథపై నేనే కృషి చేశాను కాబట్టి దాన్ని చిత్రంగా చెప్పే విధానంమీద పలుకుబడి వున్నది. అప్పుడే ఎడిటింగ్ కూడా బాగా నేర్చుకున్నాను. చెంగయ్యతో బాటు రామకృష్ణ (భరణీ) నాకు సహాయకులుగా పనిచేశారు. డి.యల్.నిర్మాణ వ్యవహర్త".

త్యాగయ్య సినిమా అద్భుతమైన ఖ్యాతినీ కాసునీ సంపాదించింది. ఊరూరా నాగయ్యకు ఘనసన్మానాలు జరిగాయి. చక్రపాణి గారి 'ఆంధ్రజ్యోతి' 'త్యాగయ్య' ప్రత్యేక సంచికను వెలువరించింది. సినిమా బెంగుళూరులో రజతోత్సవం జరుపుకుంది. మైసూరు మహారాజా వెండిపళ్లెంలో 101 బంగారు కాసులు పోసి బహూకరించారు. తమిళనాడు, కేరళ రాష్ట్రాలలోనూ అద్భుతంగా నడిచింది. తిరువాన్కూరు మహారాజు గద్దె దిగి వచ్చి, వేదోక్తంగా పాదపూజ చేసి 'అభినవ త్యాగరాజు' బిరుదు ప్రదానం చేశారు. ఒక సినిమానటుడికి జరిగిన ఇటువంటి అరుదైన అనుభవాలను నాగయ్య ఈ పుస్తకంలో సవిస్తరంగా తెలిపారు. మరొక వాగ్గేయకారుడయిన రామదాసు పై తీసిన సినిమా ఈ అదృష్టానికి నోచుకోలేదు. రామదాసు లాగానే నాగయ్యా అవస్తలు పడ్డారు. సినిమా ప్రారంభం మంచి అట్టహాసంతో జరిగింది. నాగయ్య మాటల్లోనే - "రజాకార్ ఉద్యమం ప్రారంభమైన రోజుల్లో హిందూ ముస్లింలకు ఐక్యత కావాలని, దానికై 'రామదాసు' సినిమా తీయించాలని ప్రఖ్యాత పత్రికారచయిత ఈశ్వర్‌దత్ నైజాంను ప్రోత్సహించారు. నేనే దర్శకత్వం వహించాలని, నిర్మాణానికి సారథ్యం వహించాలనీ కోరారు. అప్పటి అల్లర్లదృష్ట్యా ప్రధానమంత్రి లయాఖాలీ ఈశ్వరుదత్తుని మద్రాసు పంపి సకల మర్యాదలతో నన్ను హైదరాబాదు రప్పించుకున్నారు.... "

"గోల్కొండ, భద్రాచలం, నల్లగొండ, నిజామాబాదు యిత్యాది ప్రాంతాలన్నీ తిరిగి, కథావస్తువుకు కావలసిన విషయాలన్నీ సేకరించుకుని బూర్గుల రామకృష్ణారావుగారు, ఈశ్వరదత్తుగార్ల సహకారంతో కథను రూపొందించాను. 'రామదాసు' చిత్రనిర్మాణానికి కావలసిన సొమ్మంతా నైజాం ప్రభుత్వమే భరిస్తుందని లయాఖాలీగారన్నారు. వెయ్యిమంది పురప్రముఖుల సమక్షంలో విందునిచ్చి ప్రిన్స్ ఆఫ్ బీరారుచేత ప్రభుత్వపక్షాన గొప్ప కాశ్మీరశాలువాను బహూకరించారు.. ఆ రాత్రి నైజాం ప్రభువు గారి సన్నిధిలో పదినిమిషాలు గడిపాను. హిందూ ముస్లిం సఖ్యతపై తాను ఉర్దూలో రచించిన గేయాన్ని చదివి వినిపించారాయన! "

ఇంత ఘనంగా ప్రారంభమయిన 'రామదాసు' నిర్మాణం తర్వాతికాలంలో ఘోరంగా దెబ్బతింది. నాగయ్య మద్రాసు తిరిగి వచ్చిన తర్వాత సముద్రాలచే సంభాషణలు వ్రాయిస్తున్న టైములో పోలీస్‌యాక్షన్ జరిగి నిజాం పదవీచ్యుతుడయ్యాడు. అక్కడితో ఆ ప్రయత్నం మూలపడేసినా బాగుండేది.

ఇది జరిగిన పదేళ్లకు, కథ ఎలాగూ రెడీ అయింది కదాని నాగయ్య 'రామదాసు' నిర్మాణం ప్రారంభించారు. సినిమా తీనస్తూండగా ముఖ్యపాత్రధారులందరూ - కన్నాంబ, గౌరీనాథశాస్త్రి, సియస్ఆర్, గోవిందరాజుల సుబ్బారావు - పోయారు. ఒకరు పోగానే మళ్లీ మొదటినుంచీ మొదలుపెట్టడం, ఈలోగా ఇంకోళ్లు పోవడం. ఇలా సినిమా తీయడానికి అయిదేళ్లు పట్టింది. సినిమా చివరికి వచ్చేసరికి అగ్రనటులందరూ ఉచితంగా నటించి సహకరించారు. మహమ్మద్ రఫీ కబీరు పాటలు ఉచితంగా పాడారు. 1964లో రిలీజయిన ఈ సినిమా బాగా ఆడి, ధనం సంపాదించినా నాగయ్యగారి చేతికి ఏమీ అందలేదట!

ఇలా అనేక నాటకీయ ఘట్టాలున్న ఈ పుస్తకం నటయోగి నాగయ్యగారి అభిమానులు సేకరించి దాచుకోవలసిన పుస్తకం!

**- ఎమ్బీయస్ ప్రసాద్**

50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటీ జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

9

# నేనూ నా పాటలు



- శ్రీమతి జమునా రమణారావు

'హమ్‌రాహీ' సూపర్ హిట్ అయ్యింది. 25 వారాలు ఆడింది. ఇక్కడ ఓ చేదు సంఘటన ఏమిటంటే - నేను చాలా బాగా హిందీ మాట్లాడడం వల్ల అందరూ అమ్మాయికి డబ్బింగ్ కూడా అవసరం లేదు అని అంటుండేవారు. సరే ప్రివ్యూకి పిలిచారు. వెళ్లాం. కూర్చున్నాం. ప్రెస్ అందరూ వచ్చారు. తీరా చూసే సరికి నా గొంతు లేదు అక్కడ. కంప్లీట్‌గా ఎవరో అమ్మాయితో డబ్బింగ్ చెప్పించేసి పెట్టేరు. పైగా ఆ డబ్బింగ్ ఎంత హారిబుల్ అంటే 'క్ష' పలకదు. 'క్షమాకరో' అంటానికి 'షమాకరో' అంది. నేను చాలా షాక్ అయిపోయాను. తర్వాత ప్రసాద్ గారిని 'సార్... ఇదేమిటి.. మీరు కూడా అన్నారు. అంతా బాగుందని. తప్పులు లేకుండా హిందీ బాగా మాట్లాడుతున్నానని అందరూ ఒప్పుకుని, డబ్బింగ్ కూడా అవసరం లేదన్నారు. ఇప్పుడు వేరే ఎవరిచేతనో డబ్బింగ్ చెప్పించారేంటి సార్' అని అడిగితే డిస్ట్రిబ్యూటర్ 'ఆఁ...సౌత్ ఇండియన్ లగ్ రహే హై యే' అని అన్నాడని తీసేశారని చెప్పేరు. నెక్స్ట్ డే పేపర్‌లో 'జమున వాయిస్ అసలు ఏమీ బాగా లేదు. 'క్ష' కూడా పలకటం లేదు' అని రాశారు. మళ్లా నన్ను పిలిపించి మొత్తం అంతా నా చేత డబ్బింగ్ చెప్పించి మళ్లా నా వాయిస్‌తో రిలీజ్ చేశారు. అదొక చేదు అనుభవం.

ఇంకో సంఘటన ఏమిటంటే జర్నలిస్టులు... నిజంగా మనవాళ్లు హేట్సాఫ్ అండి... అక్కడ మాత్రం బిజినెస్... ప్రీవ్యూ జరిగిన నెక్స్ట్ డే మార్నింగ్ మా హోటల్ కొచ్చి...మా నాన్నగారితో "సార్ మీ అమ్మాయి పైకి రావాలంటే... బొంబై మార్కెట్ క్యాప్చర్ చేయాలంటే 10 లైన్లు రాస్తే 10 వేల రూపాయలు... 20 లైన్లు రాసి ఫోటోలు వేస్తే 50 వేల రూపాయలు అవుతుంది. మీరు గనక ఇచ్చేటట్లయితే ఈ పిక్చర్‌తో మీ అమ్మాయికి టాప్ ర్యాంక్ స్టార్‌ను చేస్తాం" అన్నారు. మా నాన్నగారు "అలాంటి పబ్లిసిటీ మాకు అవసరం లేదు, నమ్మకం కూడా లేదు. మా అమ్మాయి టాలెంట్ పబ్లిక్‌కి నచ్చితే పైకి వస్తుంది. అంతేకానీ ఈ డబ్బులు ఇచ్చి రాయించుకోవటం అనేది మా సౌత్ ఇండియాలో మాకు అసలు అలవాటు లేదు" అని పంపించేశారు.

'హమ్‌రాహీ'లో పాటలు చాలా హిట్.

చిత్రం : హమ్‌రాహీ
సంగీతం : శంకర్ జైకిషన్
రచన : శైలేంద్ర
గానం : లతా మంగేష్కర్

మన్‌రే... తూ హి బతా క్యా గాఁవూ
తూ హి బతా క్యా గాఁవూ
కెహదూ అప్ నే దిల్ కే దుఃఖ్ మే
యా ఆఁసూ పీ జాఁవూ ॥మన్‌రే॥
జిస్ నే పర్ బస్ బాంధ్ లియా హై
ఇస్ పింజ్‌రే మే ఖైద్ కియా హై ॥జిస్‌నే॥
కబ్ తక్ మై ఉస్ పత్థర్ దిల్ కా
జీ బెహ లాతీ గాఁవూ ॥మన్‌రే॥
నీంద్ మే జబ్ యే జగ్ సోతా హై
మై రోతీ హూ దిన్ రోతా హై ॥నీంద్॥
ముఖ్ పే ఝూటీ ముస్కాఁనో కీ
కబ్ తక్ రంగ్ చఢాఁవూ ॥మన్‌రే॥









# నేనూ నా పాటలు







చిత్రం : హమ్‌రాహీ
గానం : రఫీ, ముబారక్‌బేగం

రచన : హస్రత్ జైపురి
సంగీతం: శంకర్ -జైకిషన్

ఆ : ముజీకో అప్‌నే గలే లగా లో, యే మేరే హమ్‌రాహీ ॥2॥
తుమ్‌కో క్యా బత్‌లావూఁ మైఁ
కే తుమ్‌సే కిత్‌నా ప్యార్ హై
అ: ముజీకో అప్‌నే గలే లగా లో, యే మేరే హమ్‌రాహీ
తుమ్‌కో క్యా బత్‌లావూఁ మైఁ
కే తుమ్‌సే కిత్‌నా ప్యార్ హై
ముజీకో అప్‌నే గలే లగా లో.......
ఆ: జబ్ తుమ్ ముజీసే దూర్ రెహ్‌తే హో
జియా మేరా ఘబ్‌రాతా హై
నీంద్ ఆంఖోం సే ఉడ్ జాతీ హై
చాంద్ అగన్ బరసాతా హై
దోనోం పహలూఁ జల్ జాతే హై
ఆగ్ మేఁ ఆగ్ లగాతా హై
జైసే తడ్‌పే బిన్ జల్ మఛిలీ
ప్యార్ ముఝే తడ్‌పాతా హై, ప్యార్ ముఝే తడ్‌పాతా హై
ఇస్ ఉల్‌ఝున్ సే ముజీకో బచాలో, ఏ మేరే హమ్‌రాహీ
తుమ్‌కో క్యా బత్‌లావూఁ మైఁ...కే తుమ్‌సే కిత్‌నా ప్యార్ హై
అ: ॥ముజీకోఅప్‌నే॥
జిన్ రాహోం పర్ హాస్ కే చలో తుమ్
ఫూల్ వహఁ ఖిల్ జాతే హై
దమ్ లేనే కో జహఁ రుకో తుమ్
మధుశాలే బన్ జాతే హై
తుమ్‌కో ఛూకర్ పవన్ ఝుకోరే
ఖుష్‌బూ లేకర్ జాతే హై
లేకిన్ హామ్ తో దేఖ్ కే సూరత్
దిల్ థామే రహ్ జాతే హై, దిల్ థామే రహ్ జాతే హై
దిల్ సే దిల్ కే తార్ మిలా లో, యే మేరే హమ్‌రాహీ
తుమ్‌కో క్యా బత్‌లావూఁ మైఁ...కే తుమ్‌సే కిత్‌నా ప్యార్ హై
ఆ : ॥ముజీకో అప్‌నే ॥
జబ్ తక్ తుమ్ కో మై నా దేఖూ జానే ముజే ఘబ్‌రాతా హై
వో క్యోం మై తేరీ మన్ కా పంఛీ దూర్ కహీ ఖో జాతా హై
అ: జబ్ తుమ్ ముజీ కో మిల్ జాతీ హో
దర్ద్ దవా బన్ జాతా హై
వర్‌నా తుమ్ బిన్ సారా జీవన్ సూనా బన్ కెహ్ లాతా హై
సూనా బన్ కెహ్ లాతా...హై
హార్ మంజిల్ పర్ ముజీకో సమాలో యే మేరే హమ్‌రాహీ
తుమ్‌కో క్యా బత్‌లావూఁ మైఁ
కే తుమ్‌సే కిత్‌నా ప్యార్ హై
ఇ: ముజీకో అప్‌నే గలే లగా లో, యే మేరే హమ్‌రాహీ
తుమ్‌కో క్యా బత్‌లావూఁ మైఁ
కే తుమ్‌సే కిత్‌నా ప్యార్ హై
ముజీకో అప్‌నే గలే లగా లో.......





శంకర్-జైకిషన్ చాలా చక్కటి సంగీతం ఇచ్చారు. నాకు ఇష్టమైన పాటల్లో 'ముజ్‌కో అప్‌నే గలే లగాలో...' రాజేంద్ర కుమార్‌తో... బెంగుళూరులో అవుట్‌డోర్‌లో... (భార్యభర్తలు లోని 'నిలువగ లేని వలపుల రాణీ నీ కొరకే తపించునులే' పాటకి హిందీ వెర్షన్) తరువాత 'మన్ రే తుహీ బతా...'("ఏమని పాడెదనో ఈ వేళా' పాటకి హిందీ వెర్షన్) అని సితార వాయిస్తూ పెళ్లైన కొత్తలో ఏడుస్తూ పాడుతుంది. అది కూడా సాహిత్యం, ట్యూన్ చాలా బావుంటుంది. సాహిత్యపరంగా, ట్యూన్ పరంగా "ఏ ఆఁసూ మేరీ దిల్‌కీ జుబాన్ హై' చాలా మంచి పాట. పిక్చరైజేషన్ కూడా చాలా బాగుంటుంది. రాజేంద్రకుమార్ మంచి ట్రాజెడీ హీరో కదా. ఆయన కోసమే ప్రత్యేకంగా ఈ పాట పెట్టారు. తెలుగులో ఆ సీన్ లేదు. లాన్‌లో కూర్చుని 'ఆంఖ్ సే ఠపకీ జో చింగారీ, హర్ ఆఁసూ మేఁ ఛబీ తుమ్హారీ' అని పాడుతూంటాడు. ఏడుస్తున్నప్పుడు కళ్లలోంచి డ్రాప్స్ గ్లాస్ టేబుల్ మీద పడతాయి. అందులో నా ఫేస్ కనబడుతుంది. టెక్నికల్‌గా కూడా బాగా తీశారు.

కాకపోతే 'హమ్‌రాహీ' దేశమంతా సిల్వర్ జూబ్లీ ఆడినా వాళ్లేమీ పెద్దగా ఫంక్షన్ చేయలేదు.

నా ఫస్ట్ పిక్చర్ 'నయాఆద్మీ' తరువాత 5,6 ఏళ్ల గ్యాప్‌లో 'మిస్ మేరీ' చేశాను. ఆ తర్వాత "ఏక్‌రాజ్', 'హమ్‌రాహీ', 'బేటీ బేటే', 'మిలన్'.

'మిస్‌మేరీ' ఏ.వి.యం.వాళ్లు తీశారు. నేను చిన్నపిల్లగా ఉన్నప్పుడు 50లలో మిస్సమ్మ, మిస్సియమ్మ తెలుగు, తమిళంలో చేసాను. అదే సినిమాని ఆ తరువాత నేను టాప్ ర్యాంక్ హీరోయిన్ అయిన తరువాత హిందీలో చేశానన్నమాట. 'మిస్ మేరీ' మీనాకుమారితో చేశాను. ఆవిడ నన్ను ఎంత లైక్ చేసేదో. రియల్‌గా నన్ను 'జమునా బహెన్' అని పిలిచేది.

ఎంత మంచి ఆవిడ అంటే ఆవిడ మంచితనం మాటల్లో వర్ణించలేం. వెరీ డిగ్నిఫైడ్ అండ్ సాఫ్ట్ గోయింగ్ లేడీ. ఇక షూటింగ్ సమయాలలో అయితే ఆవిడ పక్కన నన్ను కూర్చోపెట్టుకుని... తను రాసిన షాయరీలు నాకు వినిపించేది. వినిపించి 'ఇన్‌కా మతలబ్ మాలూమ్ హై క్యా?' అని అడిగేది. తెలుసు అని నేను అంటే తెలియని వాటికి వివరించి చెప్పేవారు. చాలా హ్యాపీ ఎట్మాస్ఫియర్‌లో ఆ షూటింగ్ కూడా జరిగింది. చాలా అందంగా ఉండేవారు ఆవిడ. తెల్లగాను, పిండిబొమ్మలా ఎర్రటి జుట్టు, మంచి బిహేవియర్...ఐ లైక్ హర్ వెరీ మచ్.

ఆమె చేయి చూస్తే ఎంతో ముద్దుగా ఉండేది... ఆమె ఎప్పుడూ తన ఎడంచేయి కవర్ చేస్తూ ఉండేది. ఎందుకబ్బా ఇలా చేస్తుందని ...అడగలేదు.. అప్పుడప్పుడు తొలిగినప్పుడు చూస్తే చిటికిన వేలు బాగా వొంగిపోయినట్టు ఉండేది. మిగిలిన రెండు వేళ్లు బాగా చిట్లిపోయినట్లు

నేనూ



నా పాటలు

చిత్రం : హమ్‌రాహీ
గానం : రఫీ
రచన : హస్రత్ జయ్‌పురి
సంగీతం : శంకర్ - జైకిషన్



యే అసూ....యే అసూ....
యే అసూ మేరే దిల్ కి జబాన్ హైఁ ॥2॥
మైఁ రోవూఁ తో రో దేఁ అసూ
మైఁ హఁస్ దూఁ తో హస్ దేఁ అసూ
యే అసూ మేరే దిల్ కి జబాన్ హైఁ ॥2॥
ఆంఖ్ సే రపకే జో చింగారీ, హర్ అసూ మేఁ ఛబీ తుమ్హారీ ॥2॥
చీర్ కే మేరే దిల్ కో దేఖో, బహతే లహూ మేఁ ప్రీత్ తుమ్హారీ
యే జీవన్ జైసే సులగా తూఫాన్ హైఁ
యే అసూ మేరే దిల్ కి జబాన్ హైఁ
మైఁ రోవూఁ తో రో దేఁ అసూ
మైఁ హఁస్ దూఁ తో హస్ దేఁ అసూ
యే అసూ మేరే దిల్ కి జబాన్ హైఁ ॥2॥
జీవన్‌పథ్ పర్ జీవన్ సాథీ, సాత్ చలే హో ముఁహ న మోడో ॥2॥
దర్ద్- ఏ-గమ్ కే దోరాహే పర్, ముజీకో తడ్‌పతా యూఁ న ఛోడో
యే నగ్‌మా మేరే గమ్ కా బయాన్ హై
యే అసూ మేరే దిల్ కి జబాన్ హైఁ
మైఁ రోవూఁ తో రో దేఁ అసూ
మైఁ హఁస్ దూఁ తో హస్ దేఁ అసూ
యే అసూ మేరే దిల్ కి జబాన్ హైఁ ॥2॥

చిత్రం : మిస్‌మేరీ
రచన : రాజేంద్ర కిషన్
సంగీతం : హేమంత్‌కుమార్
గానం : లతా

సైయ్యా...లగ్‌జా గలే ఆజా... మేరా దిల్ జలే
చుప్ కైసే రహూఁ మేరా బస్ నా చలే ॥సైయ్యా॥
కైసా ఏ జాదూ కియా
లాగీ కా జీనా జియా
అఖియోఁనే అఖియోఁనే హాయే ముఝే లూట్ లియా ॥కైసా॥
చురే చురే ఆజా జరా ఖిడికీ తలే....ఆజా ఖిడికీ తలే
చుప్ కైసే రహూఁ మేరా బస్ నా ఛలే
సైయ్యా...లగ్‌జా గలే ఆజా మేరా దిల్ జలే
చుప్ కైసే రహూఁ మేరా బస్ నా చలే
దిల్‌తో హువా హై తేరా తూహీ తో హో జా మేరా
షామ్ సవేరే తుమ్ భీ మేరీ గలీ డాల్ తేరా
దిల్‌తో హువా హై తేరా తూహీ తో హో జా మేరా
షామ్ సవేరే తుమ్ భీ మేరీ గలీ డాల్ తేరా
తుజే భీ న పియా మేరీ జాన్ గలే...మేరీ జాన్ గలే
చుప్ కైసే రహూఁ మేరా బస్‌నా ఛలే
సైయ్యా...లగ్‌జా గలే ఆజా మేరా దిల్ జలే
చుప్ కైసే రహూఁ మేరా బస్ నా చలే



ఉండేవి.

అప్పుడు అడిగాను 'మీనాజీ హాత్ కో క్యా హై...కుఛ్ యాక్సీడెంట్ హువా?' అంటే చెప్పారామె, యాక్సిడెంట్‌లో ఆమె ఒకవేలు చితికిపోయిందన్నమాట. అందుకని అలా కవర్ చేసేవారు. ఆవిడ చేతులే నాకు చాలా ముద్దొచ్చేవి. తెల్లగా, బొద్దుగా... సగం వరకూ గాజులు ఉండేవి. ఏమిటబ్బా ఇంత అందమైన లేడీకి ఇది శాపమా అనిపించేది.

మీనాకుమారి,జెమినీ గణేశన్, కిశోర్‌కుమార్,

# నేనూ నా పాటలు

చిత్రం : మిస్‌మేరీ　　రచన : రాజేంద్ర కిషన్
సంగీతం : హేమంత్‌కుమార్　　గానం : రఫీ, లతా

అ: బృందావన్ కా కిషన్ కన్హయ్యా సబ్‌కీ ఆంఖోం కా తారా
ఆ: బృందావన్ కా కిషన్ కన్హయ్యా సబ్‌కీ ఆంఖోం కా తారా
అ: మన్‌హీ మన్ క్యూ జలే రాధికా మోహన్ తో హై సబ్‌కా ప్యారా
ఆ: మన్‌హీ మన్ క్యూ జలే రాధికా మోహన్ తో హై సబ్‌కా ప్యారా
ఇ: బృందావన్ కా కిషన్ కన్హయ్యా సబ్‌కీ ఆంఖోంకా తారా
అ: జమునా తట్ పర్ నంద్ కా లాలా జబ్ జబ్ రాత్ రచాయేరే
ఇ: జమునా తట్ పర్ నంద్ కా లాలా జబ్ జబ్ రాత్ రచాయేరే
ఆ: తన్‌మన్ డోలే కాన్హా ఐసే బన్సీ మధుర్ బజాయేరే
సుద్ బుద్ భోలీ ఖడీ గోపియా జానే కైసా జాదు ఉడారా　ఇ: ॥బృందావన్ కా॥
అ: రంగ్ సలోనా ఐసా జైసే ధాయీ హో ఘట్ సావన్ కీ
ఇ: రంగ్ సలోనా ఐసా జైసే ధాయీ హో ఘట్ సావన్ కీ
ఆ: తేరీ మై తూ హుయీ దివానీ మన్‌మోహన్ మత్ పావన్‌కీ
తేరీ కారణ్ గీత్ బావ్ రే ఛోఢ్ దియా మైం జగ్ తారా　ఇ: ॥బృందావన్ కా॥







'మిస్‌మేరీ' చిత్రంలో మీనాకుమారి, జెమిని గణేషన్‌తో....

నేనూ చేశాం. కిశోర్‌కుమార్‌తో ఫస్ట్ టైమ్. ఆయన చాలా సరదాగా మాట్లాడుతుండే వారు. నేను అంత చనువుగా ఉండేదాన్ని కాదు. మొత్తానికి ఆ పిక్చర్ బాగా ఆడింది. ఈ మధ్య స్టార్ వరల్డ్ ఛానల్‌లో 'మిస్‌మేరీ' వేశారు. అది చూసినప్పుడు మీనాకుమారి విషయంలో కొంచెం బాధ కలిగింది... ఏవీయం లో ఉన్న చిన్న వీక్‌నెస్ ఏంటంటే అదర్ లాంగ్వేజీ స్టార్స్ ఎలా చేశారో అదే ఫాలో అవమని చెప్పేవారు. అందులో షాట్స్ ఎలా ఉండేవో డిటో అలా తీయమనేవారు.

మీనాకుమారి నాచురల్ యాక్ట్రెస్ . కానీ ఈ చిత్రంలో కంప్లీట్‌గా సావిత్రిని ఇమిటేట్ చేయవలసి వచ్చింది. ప్రతి ఫ్రేములోనూ అంతే. ఆ కళ్లు ఇట్లా ఇట్లా అనటం...ఆర్పటం మొత్తం సావిత్రిని ఇమిటేట్ చేసింది. అయితే ఈవిడకు అది మ్యాచ్ కాలేదు. ఏదో ఆర్టిఫిషియల్‌గా చేసినట్టుంది కానీ మీనాకుమారి ఒరిజినల్ పెర్ఫార్మెన్స్‌లా లేదు. అలా చేయటం వల్ల సావిత్రక్క గుర్తుకువచ్చినా ఈవిడ ఎక్స్‌ప్రెషన్స్‌లో... ఒరిజినాలిటీ లేకపోవటం... ఆవిడ పెర్ఫార్మెన్స్ ఎలా ఉంటుందో తెలుసు కనుక ..బాధపడ్డాను.

అది కూడా బాగా ఆడింది. అందులో మంచి పాట 'బృందావనమది అది అందరిది'... అక్కడ 'బృందావన్ కా కిషన్ కన్హయ్యా సబ్‌కీ ఆంఖోం కా తారా' అదో పాటా. 'బాలనురా మదనా' పాట బదులు 'సైయ్యా...లగ్‌జా గలే ఆజా... మేరా దిల్ జలే' అంటూ వేరే డ్యాన్స్ సాంగ్ పెట్టారు. ఏవీయంలో అప్పటికే నేను నాగులచవితి... భూకైలాస్ లాంటివి ఏడు పిక్చర్స్ చేశాను. అప్పుడు మిస్‌మేరీకి నన్ను అడిగారు. అప్పుడు నేను నంబర్‌వన్ ర్యాంకులో ఉన్నాను. ఉన్నా కూడా ఏవీయం అంటే నా మాతృసంస్థలాంటిది. చిన్నప్పుటి నుంచీ చేశాను కదా అందుకని నో అని చెప్పలేదు. అదీ కాక మీనాకుమారి అంటే నాకు చాలా ఇష్టం. ఆమె కాంబినేషన్ అని ఒప్పుకున్నాను.

(మరికొన్ని పాటల గురించి... వచ్చే సంచికలో....)

తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 8



- ఇంద్రగంటి జానకీబాల



## ఉడతాభక్తి సరోజిని

"వచ్చేనమ్మా వచ్చేనే ఉగాది పండుగ వచ్చేనే..." అనే పాట సి.ఆర్. సుబ్బరామన్ సంగీత దర్శకత్వంలో "బ్రతుకుతెరువు" చిత్రంలో అందర్నీ ఆకర్షించింది. అయితే ఆ పాట పాడిందెవరు?

అసలే తెరవెనుక గానం, అందులో మరీ తెర వెనక్కి వెళ్ళి చాటుమాటుగా వుండిపోయిన ఉడత సరోజిని ఈ పాట పాడారు. నేపథ్య గానమంటేనే మనిషి కనిపించక పోవడం కదా! పాడిందెవరో తెలీకుండా తెరమీద కనిపించిన వారే పాడారని నమ్మే స్థితి కూడా వుంది. అందుకే కాస్తో కూస్తో పాడినవారు కూడా మరీ కనిపించకుండా పోయే సందర్భాలు వున్నాయి. నటించేవారు వేరనీ, పాడేవారు వేరని సామాన్య ప్రేక్షకులకు తెలియక పోవడం కూడా వుంది.

ఏలూరులో గోపాలకృష్ణ, అన్నపూర్ణల కుమార్తె సరోజిని. ఇంట్లో కూనిరాగాల పేరుతోనే రాగాలు తీసి అందంగా పాటలు పాడుతుంటే అద్దంకి శ్రీరామ్మూర్తి ఆమెలో వున్న సంగీతం గ్రహించి మెచ్చుకున్నారు. కేవలం మెచ్చుకుని ఊరుకోక భరణీవారు 'రత్నమాల' సినిమా మొదలుపెడుతూ చిన్నప్పటి హీరో (అంటే సూర్యనారాయణ చిన్నప్పుడు)కి ప్లేబ్యాక్ పాడటానికి ఒక చిన్నపిల్ల దొరికితే బాగుండునని వెదుకుతున్న సమయంలో సరోజినిని తీసుకెళ్ళి పాడించారు. అది ఆమె పాడిన 'దారి తెలియ దాయే' అనే మొదటి పాట. తర్వాత అందులోనే 'వినాయకుని వలె నను కూడ కనికరించదాయె' అనే పాట కూడా పాడారు. ఆ సినిమాకి దర్శకత్వం వహించిన పి. రామకృష్ణ. సంగీతం చేసిన సి.ఆర్. సుబ్బరామన్ ఆ పిల్ల పాటను మెచ్చుకున్నారు. నాగయ్యగారి త్యాగయ్యలో 'రారే రారే పిల్లల్లారా! బొమ్మల పెళ్ళి చేద్దాము' కె. జమునారాణితో కలిసి పాడారు.

'శాంతి'అనే సినిమాలో 'అయ్యో ఈ పెళ్ళివారు 'కె.రాణితో కలిసి పాడారు.

చిన్నపిల్లలకి ప్లేబ్యాక్ పాడాల్సి వచ్చినప్పుడల్లా సరోజినికి అవకాశం వస్తూండేది. అదీ కాకుండా కోరస్‌లు పాడుతూ నలుగురితో కలిసి మెలిసి చురుకుగా మసిలే సరోజిని అంటే అంత యిష్టపడేవారు.

'స్త్రీ సాహసం'లో చిన్నప్పటి అంజలీదేవి పాత్రకి పాడారు. 'సువర్ణ సుందరి' లో అన్ని కోరస్‌ల్లో ఆమె వున్నారు.

'పెళ్ళిచేసి చూడు'లో ఒక డ్రామా పాట వుంది. అది ఆ రోజుల్లో అందర్నీ ఎంతగానో అలరించింది. అందులో 'బ్రహ్మయ్యా-ఓ బ్రహ్మయ్యా' -'అమ్మా నొప్పులే అమ్మమ్మా నొప్పులే ' అనేవి అప్పుడు పిల్లలందరూ తెగ పాడుకునేవారు. ఈ పాట రికార్డింగ్ సందర్భంగా జరిగిన ఒక ప్రహసనం లాంటి సంఘటన సరోజిని నవ్వుతూ వివరిస్తారు.

"మొదట్లో రాజేశ్వరరావుగారు, వేణుగారు,ఈ పాట నేను, ఎ.పి.కోమల, కె.రాణి పాడాలనుకున్నారు. పాట నేర్చుకోవడం అదీ అయింది. రికార్డింగ్ మొదలైంది. మొదట రాజేశ్వరరావు పాడి రికార్డు చేశారు. అది విని ఇంక వేణు ఒకటే పొగడటం మొదలుపెట్టారు. దానికి అంతూ పొంతూ లేకుండా పొగడ్తలతోనే సమయం చాలా అయిపోయింది. మేమెవ్వరం పాడే టైము లేకపోయింది. మర్నాడు వేణుగారు పాడితే రాజేశ్వరరావు ఒకటే పొగడ్త-దానితో ఆ రోజంతా గడిచిపోయింది. మిగిలిన వాళ్ళు పాట పాడి పూర్తిచేసే వీలు చిక్కలేదు. ఆ రెండు రోజులు టిఫిను తిని కూర్చోవడమే మా పని. అప్పుడు చక్రపాణి గారికి ఏదో అర్థమైంది. తల పంకించారు. ఒకరు పాడింది మరొకరు పొగుడుకునేందుకే టైము చాలడం లేదనుకున్నారేమో, మూడోరోజు 'అంత పెద్దోళ్ళు మనకొద్దులే' అని చక్రపాణి - కుందు, రామకృష్ణలతో ఆ పాట పూర్తిచేశారు. అందులో కె.రాణి ఎ.పి. కోమల, నేను పాడాం" అని చెప్తూ సంఘటన తల్చుకుని ఎంతో కులాసాగా నవ్వారు.

"అయితే ముందుగానే రాజేశ్వరరావుగారు, వేణుగారు మేమెందుకు చిన్నపిల్లల కార్యక్రమంలో అన్నప్పటికీ, వినకుండా, అప్పటికే పేరున్నవారు కదాని పెట్టార్ట. అది అలా

అయి, కథ మరో మలుపు తిరిగింది'' అంటూ అనాటి సంఘటనను నవ్వుతూ చమత్కారంగా వివరించి ముగించారు సరోజిని.

'పెళ్ళి చేసి చూడు' లో ఇది హిట్ సీన్. పాట కూడా చాలా పాప్యులర్-అప్పట్లో స్కూళ్ళలో ఈ డ్రామా వేసేందుకు ప్రయత్నాలు చేసేవారు. సరోజిని 'పాతాళభైరవి'లో కోరస్‌లు పాడారు. అద్దేపల్లి రామారావు సంగీత దర్శకత్వం వహించిన 'బంగారు పాపలో', 'కన్నదేవికి వంతు కన్నీరాయే' అనే పాట పాడారు. 'బాలరాజు' లో 'గూటిలో చిలకేదిరా - అన్నా గూడు చిన్నబోయెరా' పాటలో గొంతు కలిపారు. 'సంసారం' (సంగీతం సుసర్ల దక్షిణామూర్తి)లో 'అమ్మా! ఆకలే' పాడారు. 'కన్నతల్లి' చిత్రంలో సుశీల, వింజమూరి లక్ష్మి, వింజమూరి సరస్వతిలతో ఒక జోలపాట, ''చూస్తారెందుకు రారండీ'' అనే పాట పాడారు. సి.ఆర్.సుబ్బురామన్ సంగీతం చేసిన అన్ని సినిమాలలో సరోజిని పాడుతూ వచ్చారు. 'ఇంతకీ ఈ సరోజిని ముందు ఉడత ఏమిటి? 'త్యాగయ్య' సినిమాలో పాడుతుండగా, తుర్రున అటూ యిటూ పరుగెడుతూ సరోజిని చలాకీగా వుండేవారట. ఉడతలా పరుగెడుతోందని ఆమెని 'ఉడతా' అని ముద్దుగా నాగయ్య పిలిచేవారట. అది అలా అలా అందరికీ అలవాటై సరోజిని గురించి చెప్పాలంటే ఉడత సరోజిని అనే చెప్పడం సినిమా పరిశ్రమలో మామూలై పోయిందిట. ఆమెకి ఆ పేరలా స్థిరపడిపోయింది.

'దేవదాసు' సినిమాలో చిన్న దేవదాసుకి చిన్న పార్వతీకి 'ఓ.... దేవదా!' పాట వుంది. ఆ చిన్న పార్వతికి ఉడత సరోజిని పాడారు. చిన్న దేవదాసుకి జిక్కి పాడారు. 'తోడికోడళ్ళు' చిత్రంలో 'గాలిపటం -గాలిపటం' ఆమె కూడా పాడారు.

'మాంగల్యబలం'లో 'హాయిగా ఆలుమగలై - కాలం గడపాలి' అనే పాట పి.సుశీలతో కలిసి పాడారు. 'ఇంటికి దీపం ఇల్లాలే' చిత్రంలో 'కనుమూసి కథ ముగించిన' పాటను పాడారు. 'వెలుగునీడలు' చిత్రంలో 'శివ గోవింద గోవింద' పాటలో మాధవపెద్ది సత్యంతో గొంతు కలిపింది సరోజిని (సావిత్రి చిన్నప్పటి వేషం వేసిన శశికళకి).

'భక్త అంబరీష'లో జానకితో కలిసి పాడారు. 'దేవి లలితాంబ'లో కూడా జానకితో కలిసిపాడారు అలాగే 'పల్లెటూరి పిల్ల', 'గృహప్రవేశం, 'టింగ్ రంగా' లాంటి చిత్రాల్లో పాడారు. 'జయమ్ము నిశ్చయమ్మురా - భయమ్ము లేదురా' (శభాష్ రాముడు) పాటలో పల్లవి ఎత్తుకున్నది సరోజినియే. అలాగే 'ముందడుగు'లో ''జండా ఊంఛారహే హమారా'' పాడారు. 'దైవబలం'లో కె.జమునారాణితో కలిసి పాడారు. 'జగదేకవీరుని కథ'లో 'జలకాలాటలలో' పాటలో పి.లీల, పి. సుశీలలతో కొన్ని పంక్తులు ఈమె కూడా పాడారు.



భర్త శ్రీనివాసరావుతో...

చిన్న పిల్లలకు పాట పెట్టాల్సి వచ్చినప్పుడే సంగీత దర్శకులు ఉడత సరోజినిని గుర్తు పెట్టుకున్నారని చెప్పాలి. మిగిలిన సందర్భాలలో కోరస్‌లకే ఆమె పరిమితమై పోయారు. ఆమె కంఠం చాలా సన్నగా చిన్న పిల్లలకి సరిపోయే విధంగా వుండేది. అందువల్ల హీరోయిన్‌కి కావలసిన గాంభీర్యం, నిండుతనం పలికించటం కష్టమని సంగీత దర్శకులు భావించి వుండవచ్చు . పాట పాడటంలో ఎన్నో స్థాయిలలో ప్రతిభ వుంటుంది. దాన్ని గ్రహించి, వినియోగించటం సంగీత దర్శకుల దృష్టి మీద ఆధారపడి వుంటుంది.

1946ల్లోనే సినీ పరిశ్రమకి పరిచయమైన సరోజిని అంతంత మాత్రపు గాయనిగానే మిగిలిపోయారంటే సినిమాల్లో నేపథ్యగానం చేయాలంటే, అందులో కథా నాయికకు పాడాలంటే కావల్సిన హంగులు కొన్ని వుండాలని భావించవచ్చు. ఆ సందర్భంగా పోటీ కూడా ఎక్కువే వుంటుంది. మొదటి తరం గాయనుల లో అందరికీ ఉడత సరోజిని ఆత్మీయంగా తెలుసు. అందరూ ఆమెను తల్చుకుంటారు. ప్రత్యేక ముద్ర లేకపోవడంతో ఉడత సరోజిని తెలుగు సినిమా పాట చరిత్రలో ఉడతాభక్తిగా సంచరించారని భావించవలసి వుంటుంది.

**చిత్రం : బ్రతుకు తెరువు** — **రచన: సముద్రాల**
**సంగీతం : సుబ్బరామన్, ఘంటసాల**

వచ్చెనమ్మా వచ్చెనే
ఉగాది పండుగ వచ్చెనే
ముచ్చటైనా పావడా
జడకుచ్చెలుకొని తెచ్చెనే
మామిడారి మామయ్య
చిగురాకు పాగాచుట్టెనే
వేపవారి అత్తయ్య పూలచీర కట్టెనే ॥వచ్చెనమ్మా॥
కోయిలమ్మా కొమ్మనెక్కి కొసరికూత పెట్టెనే
నాయనమ్మా వేపపూత తియ్యగా తిన పెట్టెనే
తియ్యగా తిన పెట్టెనే ॥వచ్చెనమ్మా॥
బొండుమల్లె పొదలు విరిచి పూల నవ్వులు కురిసెనె
దండలల్లి తల్లి పాపాయి తలను తురిమి మురిసెనె
అత్తవారి యింటిలో సరికొత్త అల్లుడు వెలెసెనె
చిట్టి మరదలు పొట్టి బావను పట్టి
సరసాలాడెనె ॥వచ్చెనమ్మా॥

**చిత్రం : మాంగల్యబలం** — **రచన : శ్రీశ్రీ**
**సంగీతం : మాస్టర్ వేణు** — **గానం : సుశీలతో**

హాయిగా ఆలూ మగలై కాలం గడపాలి ॥హాయిగా॥
వేయేళ్లు మీరనుకూలంగా ఒకటై బ్రతకాలి
హాయిగా చేయి చేయిగా ఆలు మగలై కాలం గడపాలి
సతిధర్మం పతిసేవేయని పతి భక్తిని చూపాలి
అనుదినము అత్తామామల పరిచర్యలనే చేయాలి
పతి ఇంట్లో బంధు జనాల అభిమానం పొందాలి ॥పతి॥
పదిమందీ నీ సుగుణాలే పలుమార్లు పొగడాలి ॥హాయిగా॥
ఇల్లాలే ఇంటికి వెలుగని ఎల్లప్పుడు తెలియాలి
సంసారపు బండికి మీరే చక్రాలై తిరగాలి
శరీరాలు వేరేగాని మనసొకటై మసలాలి ॥శరీరాలు॥
సుఖమైనా కష్టమైనా సగపాలుగా మెలగాలి ॥హాయిగా॥
ఇరుగమ్మలు పొరుగమ్మలతో ఇంటి సంగతులు అనవద్దు
చీరలు నగలిమ్మని భర్తను చీటికిమాటికి అడగొద్దు
అత్తింటను అదరిపాటుతో పుట్టిందని పొగడొద్దు ॥అత్తింటి॥
తరుణం దొరికిందే చాలని 'తలగడ మంత్రం' చదవొద్దు ॥హాయిగా॥

**చిత్రం : శాంతి** **రచన : సముద్రాల(జూనియర్)**
**సంగీతం : సి.ఆర్.సుబ్బరామన్**

ఆడపెళ్లివారు : ఈ పెళ్లివారు ఎట దాపురమైనారు
మా పాలిట పడినారు యీ పేచీకోరులు
బుర్ర ముక్కు తొర్రినోరు
మిట్టపళ్లు తుట్టెపెదవులు
దొడ్డికాళ్లు దోనెకడుపు
జిడ్డుమొగము -పెళ్లికొడుకు
అందరు : ఎట్టెట్టె,ఎట్టెట్టె, ఎట్టెట్టె, ఎట్టెట్టె
ఎట్టెట్టె,బెట్టె,బెట్టె,బెట్టె
అయ్యో ఈ పెళ్లివారు ఎట దాపురమైనారు
మొగపెళ్లివారు : పిల్లా -అందానికి కోతిపిల్లా
కుడికంట్లో మెల్ల
చీడావాళ్లు చీకిరికళ్లు
వంకర టింకర కాళ్లు
అయ్యయె,అయ్యయె,అయ్యయె,అయ్యయె
అయ్యయ్యెయ్యయ్యెయ్యె అయ్యెయ్యెయ్యయ్యె
ఆడపెళ్లివారు : కట్నకాసులు, రవలబేసరి, పట్టెడ, కంటె
జిగినీ గొలుసు తెస్తామంటూ కబుర్లు చెప్పి
తొంటిచెయ్యి చూపించారే
మొగపెళ్లివారు : వెండి కంచము, పట్టు పంచలు,వెయ్యినూట
పదహారులు, ఏవేవో యిస్తామంటూ మురిపించి
ఎగనామం వేశారు
అందరూ : మిసాటిమీరే సరివియ్యాలవారే
యిక చేతులు కలపండి,పాడండీ మంగళం

**చిత్రం : దేవదాసు** **రచన: సీనియర్ సముద్రాల**
**సంగీతం : సి.ఆర్.సుబ్బరామన్** **గానం : జిక్కితో**

ఓ...ఓ... దేవదా
ఓ..ఓ... పార్వతి
చదువు ఇదేనా...అయ్యవారు నిదరోతే
తమరూ ఇలాగే దొడ్డో దొడా
ఓ దేవదా
కూనలమ్మ మర్రిలో గిజిగాళ్లున్నాయే
పడితే వాటముగా పట్టుపడేనే
బడి మాని ఎడముంటే
ఎపుడూ ఇలాగే ఆటే ఆట
ఓ..ఓ...పార్వతి
రెక్కరాని కూనలే - పడితే పాపమే
బడిలో నేర్చినదీ ఈ చదువేనా
బడిలోన చదువైతే బ్రతుకూ ఇలాగే
బెదురూ పాటే
ఓ...ఓ..పిరికి పార్వతి
తేలేనులే నీ బడాయి
చాలునులే నీ లడాయి
లడాయిలా సరే మనకు
జిలాయిలోయ్ జిలాయిలోయ్
ఆఁ అన్నా ఊఁ అన్నా అలిగిపోయే
ఉడుకు మోతా
రా..రా...పిరికి పార్వతి
ఓ..ఓ...దుడుకు దేవదా

**చిత్రం : పెళ్లిచేసిచూడు** **సంగీతం: ఘంటసాల**

పిల్లవాడు : అమ్మా నొప్పులే-అమ్మమ్మా నొప్పులె
ఫస్ట్‌క్లాస్ లో ప్యాసౌదామని
పట్టుబట్టి నే పాఠాల్ చదివితె
పరీక్షనాడే పట్టుకున్నదే
బడికెట్లా నే వెళ్లేది?....... ॥అమ్మా॥
అమ్మమ్మ : బాబూ !లేవరా! - ఈ మందూత్రాగరా!
పరీక్ష కోసం దిగులు పడకురా
వచ్చేయేటికి ప్యాసౌదవులే
నువు బాగుంటే మాకు చాలురా
నిక్షేపంగా యింటనుండరా...బాబూ
అమ్మ : అయ్యోగారెలా-అయ్యయ్యో బూరెలా
పరీక్ష యిచ్చే పాపకోసమని
కమ్మకమ్మగా నేను చేస్తినే
అయ్య నోట శనిపట్టెనో యేమో
మాయలమారి నొప్పులొచ్చెనే.. ॥అ॥
పిల్ల : అమ్మా ! పాయెనే అమ్మమ్మా పాయెనే
అమ్మా ఒక్కటే-అమ్మమ్మా ఒక్కటే
అమ్మమ్మ : బాబూ తినకురా నీ కడుపు నొచ్చురా
పిల్ల : అమ్మా ఒక్కటే-అమ్మమ్మా ఒక్కటే
అమ్మ : బుద్ధివచ్చెనా -నీకు బుద్ధివచ్చెనా
పిల్ల : బుద్ధివచ్చెనే-అమ్మ బుద్ధివచ్చెనే
అమ్మ : లెంపలేసుకో అయితే లెంపలేసుకో
పిల్ల : వేసుకొంటినే అమ్మ ఒక్కటివ్వవే
అమ్మ : బడికిపోదువా ?...
పిల్ల : అమ్మ బడికిపోదునే బాగచదువుకొందునే


జడ్జి : చక్రి

మాటీవి సమర్పించు
పాడాలని ఉంది
కార్యక్రమాల వివరాలు

సూత్రధారి

యస్పీ బాలసుబ్రహ్మణ్యం

25-07-04/01-08-04 ఉదయం 10.30 గం॥లకు


1. వి.కృష్ణ
నీమధు మురళీ — భక్తజయదేవ
మురళీధరుని
మధురమే — సత్యం


2. పి.శ్రీనివాసకుమార్
సంతతమే సరస — సరిగమలు
గగనా నా వగమున
అందమైన భామలు — మన్మథుడు


3. టి.కృష్ణారావు
నవరస సుమమాలికా — మేఘసందేశం
చక్కెర కలిసిన
ఓ లాలీపాపకు... — వసంతం


4. వి.పార్థసారథి
నీతోనే ఆగేనా సంగీతం — రుద్రవీణ
ఒక్కసారి ఒక్కసారి
వివాహాలే నశించాలి — వివాహ భోజనంబు


5. బి.రవికుమార్
శ్రీతుంబుర నారద — భైరవద్వీపం
ఏలా ఈ మధుమాసం
కొడితే కొట్టాలిరా — ఠాగూర్

18-7-2004న యస్పీ బాలసుబ్రహ్మణ్యం, యస్.పి.శైలజతో
పాత ఎపిసోడ్ల ప్రత్యేక కార్యక్రమం ఉంటుంది.

# హాసం క్లబ్ కార్యక్రమాలకు ఆహ్వానం...

హాసం

క్లబ్

ఈ ఉగాది నుండి వివిధ ప్రాంతాలలో ఏర్పాటైన 'హాసం క్లబ్'ల తదుపరి కార్యక్రమ వివరాలివిగో !

ఈ కార్యక్రమాలలో పాల్గొనటానికి మీరు 'హాసం' పాఠకులు కానవసరం లేదు. క్లబ్‌కు చందా కట్టనవసరం లేదు. హాస్య, సంగీత ప్రియులై ఉండి, సకుటుంబంగా రెండు గంటలపాటు ఆహ్లాదకర వాతావరణంలో కాలక్షేపం చేయటానికి రెడీగా ఉంటే చాలు. వచ్చి హాయిగా జోకులు, పాటలూ వినవచ్చు, మీరూ చెప్పవచ్చు, పాడవచ్చు. పాడలేకపోయినా పాటల గురించి మీ పరిశీలనలు పదిమందితో పంచుకోవచ్చు.

| ఊరు | తేదీ | సమయం | స్థలం | వివరాలకు సంప్రదించవలసినవారు |
|---|---|---|---|---|
| రాజమండ్రి | 18-07-04<br>3వ ఆదివారం | సాయంత్రం<br>6.00 - 8.00 | 16-4-2, శ్రీరామనగర్,<br>పేపర్‌మిల్లు వద్ద, రాజమండ్రి-5 | శ్రీ ఎం.వి.అప్పారావు, ☎ 2438085, 98852 15155<br>శ్రీ డి.వి.హనుమంతరావు, ☎ 2430945 |
| వైజాగ్ | 18-07-04<br>3వ ఆదివారం | సాయంత్రం<br>6.35 - 8.35 | విశాఖ పౌర గ్రంథాలయం<br>ద్వారకా నగర్, బి.వి.కె. కాలేజీ ఎదురుగా,<br>విశాఖపట్టణం | శ్రీ టి.ఎల్.ప్రసాద్ ☎ 98850 56449<br>శ్రీ మస్తాన్‌రెడ్డి ☎ 2720219/2713554 |
| ఏలూరు | 18-07-04<br>3వ ఆదివారం | సాయంత్రం<br>6.35 - 8.35 | శ్రీ మోతే నారాయణరావు గారి ఇల్లు<br>పడమర వీధి, ఏలూరు | శ్రీ మోతే నారాయణరావు ☎ 958812-221989<br>శ్రీ డి.రామకృష్ణారావు ☎ 958812-222318 |
| హైదరాబాదు | 31-07-04<br>ఆఖరి శనివారం | సాయంత్రం<br>6.35 - 8.35 | ఆంధ్రబాలానంద సంఘం<br>నారాయణగూడ, హైదరాబాద్ | శ్రీ గిరి ☎ 55570215<br>శ్రీ ఎస్.వి.రామారావు ☎ 24160279/98491 39030 |
| పలాస (శ్రీకాకుళం జిల్లా) | 31-07-04<br>ఆఖరి శనివారం | సాయంత్రం<br>6.35 - 8.35 | డా॥ వై.రామినాయుడు<br>నర్సింగ్‌హోమ్, వివేకానంద కాలనీ, పలాస | శ్రీ డా॥ వై.రామినాయుడు<br>☎ 08945-241268, 98486 51615 |
| జగ్గంపేట | 08-08-04<br>1వ ఆదివారం | సాయంత్రం<br>4.35 - 6.35 | ఆర్యవైశ్య కళ్యాణ<br>మంటపం ఎదురుగా, జగ్గంపేట | శ్రీ నూజిళ్ళ సూర్యనారాయణ ☎ 08852-234185, 533435<br>శ్రీ పి.వి.ఆర్.శాస్త్రి ☎ 233209, 234414 |

'హాసం' అభిమానులు తమ వీలుమేరకు ఈ కార్యక్రమాలలో పాల్గొని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాం. ఇతర ప్రాంతాలలో 'హాసం క్లబ్బు'లు ప్రారంభించ దలచినవారు సంప్రదించవలసిన చిరునామా -

**శ్రీ ఎస్.వి.రామారావు, కన్వీనర్, హాసం క్లబ్స్, జి3, ఉమా అపార్ట్‌మెంట్, లలితానగర్, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ -500 060, ఫోన్ - 040-2416 0279/98491 39030**

# మార్కెట్లో ఉన్న ఆడియో క్యాసెట్లు




విడుదల : సుప్రీమ్

వెల : రూ.30/-




విడుదల : ఆదిత్య మ్యూజిక్

వెల : రూ.38/-




విడుదల : సూర్య మ్యూజిక్

వెల : రూ.35/-




# పెళ్ళిపుస్తకం

## దర్శకత్వం : బాపు

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్ళపూడి వెంకటరమణ**

**నవలీకరణ**
**ఇలపావులూరి మురళీమోహనరావు**

వెండితెర నవల
**11**

### జరిగిన కథ

మధ్యతరగతికి చెందిన కృష్ణమూర్తి, సత్యభామలకు పెళ్ళవుతుంది. ఒకే ఊరిలో ఉండాలని శ్రీధరం కంపెనీలో ఉద్యోగాలలో చేరతారు. చేరడానికి తామిద్దరం భార్యాభర్తలు కాదని చెప్పవలసి వస్తుంది. కృష్ణమూర్తి బ్రహ్మచారి అనుకుని శ్రీధరరావు కూతురు వసుంధర అతన్ని అభిమానిస్తూ ఉంటుంది. భామకు ఇది కంటగింపుగా ఉంటుంది. శ్రీధరం బావమరిది గిరి సత్యభామపై కన్నేస్తాడు. వసుంధర శనాదివారాలు కృష్ణమూర్తి దగ్గర ఆర్టు నేర్చుకుంటానని తలిదండ్రుల్ని ఒప్పిస్తుంది. ఆమె వస్తున్నట్టుగా పైలెట్‌లా కబురుతెచ్చిన కొండల్రావుకి అక్కడే ఉన్న భామ కనబడుతుంది.

-(ఇక చదవండి)

**కొం**డల్రావు ఆవులిస్తే పేగులు లెక్కబెట్టే రకమని బాగా తెలుసు భామకు. అందుకే ఏమాత్రం త్రొటు పడకుండా



"ఛీ..ఛీ.... సారీ.... అబ్బే .. అయనది ఆవాటా. మా చుట్టాలది ఈ వాటా" అన్నది.

"వాడి గురించి ఏమన్నా సారీ అక్కర్లేదు. నన్ను మించిన మాయల పకీరు వాడే...ఆ కేకే గాడు" అన్నాడు కొండల్రావు - భామ మీద చెయ్యివెయ్యడానికి ప్రయత్నిస్తూ! సత్యభామ ఇస్త్రీ పెట్టెపైకెత్తి ఆ ప్రయత్నాన్ని అడ్డుకుంది.

"ఆ కేకే గాడు ఆఫీసులో మొన్న నీమీద, ఒక పెళ్ళైన పరస్త్రీని ..వాడు చేసిన జులుం.."అంటూ చెప్పసాగాడు.

"ఇష్.... " అతను వింటున్నాడని సైగ చేస్తూ నోటికి వేలు అడ్డం పెట్టింది సత్యభామ.

లెక్కచెయ్యలేదు కొండల్రావు. "వాడిప్పుడే రాడులే కాసేపట్లో మా వసుంధర ఇక్కడికొస్తుంది. ఆమె కోసం గది ముస్తాబు చేస్తున్నాడు. హి..హి..." కోతిలా నవ్వాడు కొండల్రావు.



న్వతహాగా మంచివాడే అయినా... ఒంటరిస్త్రీని - అందునా భర్తకు దూరంగా ఉంటున్న ఓ నిస్సహాయను చూస్తే ఎవరికైనా రిమ్మతెగులు పుడుతుందేమో... మనసు కోతివంటిదని ఊరికే అన్నారా! ప్రస్తుతం కొండల్రావు పోకడకూడా అలాగే ఉంది.

ఇస్త్రీ పెట్టె తగిలించబోయినందుకు సారీ చెప్పింది సత్యభామ. "పర్లె... పర్లె...పర్లె...పర్లె.. చెప్పేదివిను. వాడంటే నీకెంత చిరాకూ, భయమో - నాకూ అంతే" చెవిలో గుసగుసలాడాడు.

"మీకెందుకు భయం?" అడిగింది భామ.

"ఎందుకా?" అటు ఇటు చూశాడు కొండల్రావు.

"ఊఁ" కళ్ళు చక్రాల్లా తిప్పుతూ మళ్ళీ ఇస్త్రీ పెట్టె ఎత్తింది భామ -'దగ్గరకొస్తే జాగ్రత్త' అన్నట్టు !

దాన్ని తప్పించుకుంటూ "ఆ పెట్టిదించు చెబుతాను" అన్నాడు కొండల్రావు. పెట్టె పక్కన పెట్టింది భామ.



"వాడు మా వసునే కాదు, దాని తల్లిని, తండ్రీని కూడా బుట్టలో వేసుకున్నాడు" రహస్యం చెప్పాడు కొండల్రావు.

"ఆఁ...." తెలియనట్లు నోరు తెరిచింది భామ.

"ఆఁ...ఇది దేవరహస్యం. అమ్మగారేమో పిల్లను అమెరికాలో వున్న పెద్ద తమ్ముడికి ఇవ్వాలని.. వాడేమో అమెరికా వదిలిరానని... అయ్యగారేమో పిల్లని, ఇల్లుని, బిజినెస్సునీ చూసుకునే ఇల్లరికం అల్లుడు కావాలని. ఇదీ ఘర్షణ. ఆ కేకే గాడు పిల్లని వలలో వేసుకున్నాడు. ఆవిడ ఇవాళ్టినుంచి శని,ఆదివారాలు ఇక్కడే మకాం" అని చెబుతూ మరోసారి భామను తాకాలని ప్రయత్నం చేశాడు కొండల్రావు.

రకాలున ఇస్త్రీ పెట్టె ఎత్తింది భామ. అది కొండల్రావు చేతిని తాకగానే 'అబ్బా' అని గావుకేక పెట్టాడు. "అబ్బ..బ్బ...బ్బ.. ఇదో అగ్ని పరీక్ష" అన్నాడు ఇటు ఇస్త్రీపెట్టె వేడికి, అటు సంబంధం తీవ్రతకు సమన్వయం కుదిరేట్లు.

"ఆ .." అమాయకంగా అని పెట్టె కిందపెట్టింది భామ.

"ఇందులో వీడు పాసయితే.. అయితే ఏంటి... పాసైపోతాడు గాడిద, అక్కడ అమెరికా అల్లుడు ఇల్లరికం రానూ అంటే. వీడు బూరెల గంపలో పడ్డట్లే. కోటీశ్వరుడి అల్లుడు."



"వసుకే కాదు. నీకు నాకు కూడా మొగుడౌతాడు. నా బిడ్డలాంటి దానివని చెప్పాను. కడుపులో ఉంచుకో" అని మళ్ళీ భామ మీద చెయ్యి వేశాడు.

ఇస్త్రీపెట్టెను కిందికి జారవిడచింది భామ. అది కొండల్రావు కాలిమీద పడ్డది.

"అమ్మో.. అబ్బో..నాకాలు ..ఓ.. ఓ...."మూలుగుతూ పరిగెత్తాడు కొండల్రావు.

* * *

ఉదరపోషణార్థం - విడివిడిగా ఉంటూ శని, ఆదివారాలలో మాత్రమే కలుసుకోగలుగుతున్నారు సత్యభామ, కృష్ణమూర్తి. ఆదివారం నాడు కూడా హాయిగా గడపడానికి వీలులేకుండా ఆటంబాబులా ఊడిపడబోతున్నది వసుంధర. తను అభిమానించే ఆర్ట్ డైరెక్టర్ కృష్ణమూర్తిని ఆటపట్టించడం ఒక హాబీగా మారిపోయింది వసుంధరకు. మనసులో ఎటువంటి కల్మషం లేకున్నా- మగాడిని కవ్వించడం- చిలిపిపనులు చేస్తూ అల్లరిపెట్టడం- ఆ వయసు ప్రభావం అని సరిపెట్టుకోవాలి. మానసికంగా అపరిపక్వదశలో ఉన్న యువకులు ఇటువంటి చేష్టలను ప్రేమగా భ్రమించడం- ఆ తరువాత తన ఊహాప్రేయసి మరొకడితో తాళికట్టించుకుని హనీమూన్‌కు వెళ్ళగానే - భగ్నహృదయులై మందుబాటిల్ చేతబట్టి - దేవదాసులా జగమేమాయా- బ్రతుకే మాయా అంటూ తత్వాలు పాడుకుంటూ దగ్గడం....ఎక్కడ చూసినా ఇవాళ జరిగే కథ ఇదే !

కానీ కృష్ణమూర్తి అలాంటివాడు కాడు. భార్యను హృదయంలో ప్రతిష్టించుకున్నవాడు. అయినా ఒక ఉద్యోగిగా బాస్ కూతురుతో ఎలా నడుచుకోవాలో తెలిసినవాడు. పాపం.. భామకు ఈ లౌక్యం పాళ్ళు తెలీవు. అంచేత కృష్ణమూర్తి చేష్టలు ఆమెకు ఓ పట్టాన అంతుపట్టవు.

"వాటీజ్ దిస్ నాన్సెన్స్? ఆదివారం నాడు ఈ దండయాత్ర లేంటి? నో... దిస్ వోంట్‌డు..నో...నో...అని బాస్ కుట్టిని అడిగేస్తాను,కడిగేస్తాను" అని అన్నాడు భామను సంతృప్తి పరచడానికి. కానీ అప్పటికే అతను వసుంధర వస్తే ఎంత నీట్‌గా ఉండాలో అంత స్టయిల్‌గా తయారయి ఉన్నాడు. ముందే అనుకున్నాంగా భామకీ లౌక్యం పాళ్ళు తెలీవని. అందుకే విచిత్రంగా చూసిందతని వైపు.



ఇంతలో వసుంధర గొంతు వినిపించింది. "గుడ్ మార్నింగ్ కెకెజీ" అంటూ.

విలాసంగా ముందుకు కదలబోయాడు కృష్ణమూర్తి.

"ఏవండీ... మాట" అంటూ పిలిచింది భామ.

ఎందుకన్నట్టు వెనక్కి వచ్చాడు కృష్ణమూర్తి.

అతని జుట్టు చెరిపేసి, షర్టుని నలిపేసింది.

నలిగిన షర్టు, చెదిరిన క్రాఫ్‌తో వెళ్ళిన కృష్ణమూర్తి "హల్లో... వసూ...ఎ వెరీగుడ్ మార్నింగ్ టుయూ... వాట్ ప్లెజంట్ సర్‌ప్రైజ్....." అని అంటుంటే పెరట్లోంచి అతని ఓవరాక్షన్‌ని వెక్కిరించి తృప్తిపడింది భామ.

"సర్‌ప్రైజా.....? మా పైలట్ తాతయ్య రాలేదూ?" ఆశ్చర్యంగా దిక్కులు చూసి అన్నది వసుంధర.



"రాకేం...వచ్చాడు. ఇల్లంతా ఇన్‌స్పెక్షన్ చేశాడు. నాకు వార్నింగిచ్చాడు. బట్..ఇట్స్ ఓకే...అయినా మీరు రావడం సర్‌ప్రైజ్. ప్లీజ్...కూర్చోండి ప్లీజ్.." అన్నాడు కృష్ణమూర్తి.

"గురూజీ... గురూజీ... ఇవాళ నుంచీ మీరు నా కెకెజీ.

ఛ... ఐమీన్..కెకె.జీ...ఇవాళ నుంచీ మీరు నా గురూజీ" అన్నది వసుంధర వగలు పోతూ.

"అదేంటి?" అన్నాడు కృష్ణమూర్తి ఆశ్చర్యంగా.

"అదేమరి, ఆ టైపిస్ట్ ఆంటీ దగ్గర నన్ను డాన్స్ నేర్చుకోమన్నారు. నేనో బేరం పెట్టాను. నాకు డాన్స్ కన్నా ఆర్ట్ ఇష్టం కాబట్టి కెకెజీ గారి దగ్గర శని, ఆది వారాలు ఆర్ట్ నేర్చుకోనిస్తే...ఆంటీ దగ్గర డాన్స్ నేర్చుకుంటానూ అన్నా. ఓకే అన్నారు డాడీ. పిలిపిస్తాను అన్నారు. నో...నో...నో ...శని, ఆదివారాలు కూడా ఆయన్ని ఆఫీసుకు రమ్మంటే ఛీ పొమ్మంటారు. నేనే ఆయన రూమ్‌కి వెళ్తాను అన్నాను. ఏదీ మీ రూము? ఎక్కడ మీ స్టూడియో?" రూంలో అటు ఇటు తిరిగి చూడసాగింది వసుంధర.

తత్తర పడ్డాడు కృష్ణమూర్తి.

"ఆ.... స్టూడియో...ఇదే. అసలీ ప్రపంచమంతా నా స్టూడియోనే" నవ్వుతూ అన్నాడు.

"అలా తప్పించుకోకండి. మీ గది చూడాలి. అందులో రహస్యాలన్నీ పట్టుకోవాలి" అంటూ కె.కె. గదిలోకి వెళ్ళిబోయింది వసుంధర.

"జస్ట్ మినిట్....కూచోండి..కూచోండి" కంగారుగా అడ్డం వచ్చాడు కృష్ణమూర్తి.



ఏమిటన్నట్లు చూసింది వసుంధర.

"రూమ్ గలీజుగా ఉంది" చెప్పాడు కృష్ణమూర్తి.

"నాకు గలీజే ఇష్టం. ఇస్త్రీ చేసిన గదులంటే నాకు చిరాకే" అన్నది వసుంధర కొంటెగా.

"పెద్దగా సర్దనులెండి. కొన్ని ఉంటాయికదా....బ్రహ్మాచారి గదంటే" గది తలుపుకు అడ్డంగా నిలుచుని ఏడవలేక నవ్వాడు కృష్ణమూర్తి.

పెద్దగా నవ్వింది వసుంధర. "తెలుసు. గుడ్డలు లేని ఆడ పిల్లల బొమ్మలుంటాయి. అంతేగా. బ్రహ్మాచారుల గదికి భామలే అందం. నాకేం సిగ్గులేదు" కృష్ణమూర్తిని తోసుకుని లోనికెళ్ళబోయింది వసుంధర.

"కానీ నాకుందిలెండి సిగ్గు" అని గాభరాగా లోపలికెళ్ళి తలుపు గడియవేశాడు కృష్ణమూర్తి.



భామచీరలు, ఇతర సామగ్రి గబ గబ మూటగట్టి పక్క వాటా గది తలుపుతట్టి అందించాడు. వాటినందుకుని అవతల గదిలో పడేసి మళ్ళీ వచ్చింది భామ.

"బొట్టు-కాటుక ఆదర్శ గృహిణికి అలంకారాలు"అంది అవి పట్టుకెళ్ళడం మరిచిపోయానని చెబుతూ.

"అబ్బా.... " తలపట్టుకున్నాడు కృష్ణమూర్తి.

"పెళ్ళిఫోటో.... మనపెళ్ళిఫోటో" అంది 'ఇదికూడా తీసెయ్యాల్సొచ్చిందే' అన్న బాధతో.

మళ్ళీ హడావిడిగా లోపలకొచ్చి తాము పడుకునే పరుపుని కూడా అక్కణ్ణించి కదిలించాలని ప్రయత్నించిందా ఆడ మనసు.

"పట్టదు పట్టదు" అన్నాడు కృష్ణమూర్తి. ఆ పరుపు పక్కవాటా గుమ్మంలోంచి తీసుకువెళ్లడానికి కుదరదని చెబ్తూ.

కృష్ణమూర్తిని ఉడికిస్తూ లోపలకొచ్చింది భామ- "బ్రహ్మాచారుల గదికి భామలే అందం" అన్నది కవ్విస్తూ.

"ఇష్... " భయపడుతూ అన్నాడు కృష్ణమూర్తి.

"కాదా?" అన్నది భామ.

"అవును మహాప్రభో అవును. ప్లీజ్...నీకిది ధర్మం కాదు. ఇకవెళ్ళు. ఆమె వస్తుంది" అంటూ బతిమాలాడు.

(ఇంకావుంది)



"అమ్మా మనం అన్నం తినేది చేతులతోనే కదా"
"అవును ..బాబూ"
"మరి..కాళ్ళు కడుక్కుని రా...అన్నం తిందువుగాని అంటావేంటి"...



"కోపంగా చూస్తావెందుకు టిక్కెట్టుకు సరిపడే చిల్లర ఇచ్చానుకదా.." అడిగాడు పరంధామయ్య..సిటీబస్ కండక్టర్ని..
"అందుకే !" అంటూ అరిచాడు కండక్టర్ మరింత కోపంతో !



"మీ కోడలిమధ్య ఇంటిపనీ, వంటపనీ చేస్తున్నట్లుగా వుందే?"
"అవును ..మీకెలా తెలుసు?"
"ఇంట్లో పాత్రలన్నీ సొట్టలు పడివుంటేనూ..?"



స్వామి దైవానందంను కలుసుకున్నాడు అప్పారావు.
"స్వామీ! నా భార్యొక గయ్యాళి. ప్రతి చిన్న విషయానికి సాధిస్తోంది. నాకు సుఖ సంతోషాలు లేకుండా పోయాయి. ఎలాగైనా ఆమెను మార్చే మార్గం సెలవివ్వండి స్వామీ" అంటూ భోరున విలపిస్తూ అడిగాడు.
"ఆ మార్గం తెలియకే.. నేను ఈ మార్గం అవలంబించాను నాయనా!" సెలవిచ్చేడు స్వామిజీ .



కొత్తగా పెళ్ళయిన భార్యాభర్తల్ని ఓ కారు గుద్దేసి ఆగకుండా వెళ్ళిపోయింది. ఇద్దరికీ స్వల్పంగా గాయాలయ్యాయి..
"ఆ కారు నెంబరు గుర్తుందా?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్. "అదృష్టవశాత్తు మొదటి రెండు నెంబర్లూ నావయస్సు అంటే ఇరవైఆరు. చివరి రెండు నెంబర్లూ మా ఆవిడ వయస్సు ...అంటే.."
"కేసొద్దులెండి" కంగారుగా అరిచింది భార్య, భర్తమాటలకు అడ్డొస్తూ!

**ఈ జోకులను పంపించిన వారు: వేంద్ర బాలస్వప్న హైదరాబాదు,**



ఓ 60 ఏళ్ళ ముసలావిడ ట్రాఫిక్ సిగ్నల్ చూడకుండా దాటుతుండగా కానిస్టేబుల్ విజల్ ఊది ఆమెను ఆపాడు.
"ఏమ్మా....నేనెన్ని సార్లు విజిల్ ఊదినా ఆగకుండా చూడకుండా అలా వెళ్ళిపోతున్నావేంటి ..? అన్నాడు కోపంగా.
"విజిలేస్తే వెనక్కి తిరిగి చూసే వయసు కాదు కదా నాయనా.. నేను వయస్సులో వుండగా ఒక్క విజిల్‌కే ఆగి తిరిగి చూసేదాన్ని.. ...! ఆ రోజులే వేరు...!" అంటూ నవ్విందావిడ ముసిముసిగా .




లత బట్టల షాపులో పదివేల రూపాయలకు పట్టు చీర కొన్నది, ఆ తర్వాత మెడికల్ షాపులో నిద్రమాత్రలు కొన్నది.
ఆమెతో పాటు షాపింగుకు వెంట వచ్చిన రాధ ఇది గమనించి "నిద్ర మాత్రలు దేనికే?" అంది ఆశ్చర్యంగా.
"ఈ చీర ఇంత రేటుకి కొన్నట్లు తెలిశాక మా వారికి ఈ రాత్రి సరిగ్గా నిద్రపట్టదులే అందుకనీ" అంది లత క్యాజువల్‌గా

**ఈ జోకులను పంపించిన వారు: మామిడి మహేంద్ర,పూణే.**



"మీరు గవర్నమెంట్ ఆఫీసరని తెలిక మీరు కట్టించిన ఇంట్లో అద్దెకు దిగడం నేను చేసిన పెద్ద మిస్టేక్."
"ఏమైంది?"
" ఇంట్లో అందరికీ రాత్రనక, పగలనక నిద్ర ముంచుకొస్తోంది మరి!"



"మీ నాన్న గారి కోసం రోజూ చాలా మంది వస్తుంటారే !?"
"అవును మరి ఏవనుకున్నావు మా నాన్నంటే?"
"ఇంతకు ఏం చేస్తూంటారు మీ నాన్న ?"
"అప్పులు "



"రైల్వే ఉద్యోగిని పెళ్లి చేసుకుని పెద్ద పొరబాటు చేశాను"
"ఏమైంది?"
"ఒక్కరోజైనా ఇంటికి చెప్పిన టైమ్‌కి రారు కదా !? "

**ఈ జోకులను పంపించిన వారు: షేక్ అస్లాం షరీప్, శాంతినగర్.**



"పొద్దున్నుంచీ అన్నం తినలేదు కదా !?"
"అరె ఎలా పసికట్టావ్?"
" నా బ్రెయిన్‌లో క్షణ క్షణానికీ ఏదో తరిగిపోతున్నట్టు వుంటేను".

**ఈ జోకులను పంపించిన వారు: షేక్ అస్లాం షరీప్, శాంతినగర్.**



"పాపా... మీ నాన్నగారు ఏం చేస్తున్నారు? "
"డిన్నర్ చేస్తున్నారంకుల్."
"తప్పమ్మా..ఇప్పుడు ఉదయం ఎనిమిది గంటలయింది కదా... డిన్నర్ అనకూడదు. బ్రేక్ ఫాస్ట్ అనాలి."
"ఆ సంగతి నాకూ తెలుసు అంకుల్. మా నాన్నగారు తింటున్నది రాత్రి అన్నమే."



మంత్రి : డాక్టర్ గారూ! మా అబ్బాయి రూపాయి నాణెం మింగేశాడు. నాకు భయంగా వుంది . వెంటనే వైద్యం చేయండి ప్లీజ్....
డాక్టర్ : ఏం కాదండీ... కోట్లు మింగిన మీరే దుక్కలా వున్నారు... రూపాయి మింగిన మీవాడికేమవుతుంది!?



"నీ చదువుకి నేను ఎంత ఖర్చు పెడుతున్నానో తెలుసా! "
"తెలుసు డాడీ "
"మరి ఎందుకని సరిగా చదవటం లేదు."
"నీకు ఖర్చు పెంచడం ఇష్టం లేక!"



"డాక్టర్ నన్ను హోటల్‌లో ఏదీ తినవద్దని చెప్పాడురా."
" మరి ఏం చేస్తున్నావు?"
"పార్శిల్ తెచ్చుకొని తింటున్నాను"

**ఈ జోకులను పంపించిన వారు: సి.హెచ్. సురేష్ కుమార్, విజయనగరం**

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన **వేంద్ర బాలస్వప్న-హైదరాబాదు, మామిడి మహేంద్ర-పూణే, షేక్ అస్లాం షరీప్ - శాంతినగర్, సిహెచ్. సురేష్ కుమార్-విజయనగరం** గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'సత్యం' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.

SOHAN
MUSIC



# సంగీత సాహిత్య ఆధ్యాత్మిక తరంగం....

# నారాయణ తీర్థులు

(1580-1680)

నా చిన్నతనంలో సంక్రాంతి పండుగని
చాలా అద్భుతంగా జరుపుకునేది ఊరు ఊరంతా....
పొద్దున్నే కుంకుడు కాయలు కొట్టి తలంటు స్నానం....
కొత్త బట్టలు..వాకిట్లో పట్టు పరికిణీలు కట్టుకుని కన్నెపిల్లల ముగ్గులు...
గంగిరెద్దు మేళం...హరిదాసులూ...
అలాంటప్పుడు ఓ హరిదాసు వచ్చేవాడు..
చక్కగా ఊర్ధ్వపుండ్రాలూ...వొంటినిండా! నెత్తిమీద ఎర్రగా మెరిసిపోతున్న రాగిచెంబూ
దాని వెనకనుంచి మోకాళ్ళ దాక ఓ గుడ్డ..
ఓ చేతిలో తంబూర...మరో చేతిలో చిడతలూ..
కాళ్ళకి గజ్జెలు...మొలకి చిత్రంగా చీర... కట్టేవాడు
విశేషం ఏమిటంటే...
ప్రతి గుమ్మం ముందు ఆగి...కాసేపు చిందేస్తూ..
**కృష్ణంకలయ సఖీ సుందరం**
**బాలకృష్ణం కలయ సఖీ సుందరం**
**కృష్ణం గత విషయ తృష్ణం....**
అంటూ అత్యంత మనోహరంగా పాడేవాడు...
ఎన్నడూ 'భవతీ భిక్షాం దేహి' అని అడిగి ఎరగడు..
పిల్లల మందరం..ఆయన పాట పాడ్తోంటే చాలా దూరం వెంటపడే వాళ్ళం...
ఆ తర్వాత తెలిసింది....వాటిని 'కృష్ణలీలా తరంగాలు' అంటారనీ
అవి రాసినాయన 'నారాయణ తీర్థులు' అనీ....
నిజంగా ఆ పాటలు వింటోంటే ....ఆ నాటినుంచీ ఈ నాటివరకు హృదయం పన్నీటి తరంగాల్లో స్నానం చేసినట్టే ఉంటుంది..
నారాయణతీర్థుల కాలం గురించీ..ఆయన జన్మస్థలం గురించీ రకరకాల వాదనలున్నాయ్... మహామహోపాధ్యాయులు ఎంతో మంది చాలా కాలం పరిశోధించి....అనేక రకాలుగా తేల్చారు. కానీ ఆయన ఆంధ్రదేశంలోని గుంటూరు జిల్లా 'కాజ' అనే గ్రామంలో పుట్టారనీ... ఉత్తరోత్తరా-దక్షిణ ప్రాంతానికి వలస వెళ్ళారనీ అంటే తెలుగువాళ్ళమైన మనకో తృప్తి..
ఈయన తండ్రి పేరు తల్లావఝ్ఝుల నీలకంఠశాస్త్రి....
ఈయన పేరు తల్లావఝ్ఝుల గోవిందశాస్త్రి.
అయితే గోవిందశాస్త్రికి యవ్వనంలోనే 'పరిణామశూల' (అంటే బహుశ కడుపులో గడ్డవంటింది) వచ్చి విపరీతంగా బాధపడ్తుంటే...ఎవరి సలహా మేరకో సింగరాయ కొండలోని నరసింహస్వామి దేవాలయానికి వెళ్ళి ప్రదక్షిణలు చేస్తూ ..ఈ తరంగాలు రచించాడనీ - వాటినే అద్దంకి ప్రాంతంలోని 60 గ్రామాలకి తనే స్వయంగా నేర్పాడనీ ప్రతీతి...
సరే... గోవిందశాస్త్రికి పెళ్ళైంది...అత్తారి ఊరు కృష్ణ ఆవలి ఒడ్డున ఉన్న వేదాద్రి!. ఓసారి అత్తవారింటికి వెళ్లాలనీ...కృష్ణ ఈదుకుంటూ పోతున్నాడు .... తీరా క్రిష్ణమ్మ పొంగింది!!
గోవిందశాస్త్రికి పట్టుతప్పింది..కాళ్ళుచేతులు కొట్టున్నా ..
ఈడ్చుకు పోతోంది కృష్ణమ్మ ! తేలిపోతున్నాడు
నీళ్ళుమింగేశాడు...ఉక్కిరి బిక్కిరై పోతున్నాడు....
పాదాలు ఒకసారి అడుగు తాకీ పైకొచ్చాయ్..
తెలిసిపోయింది....ప్రాణం పోబోతుందని..
ఈ సమయంలో 'ఆపత్సన్యాసం' తీసుకుంటే...?
(సన్యాస దీక్ష తీసుకుని మరణిస్తే ముక్తి అన్న ఒక నమ్మకం)
వెంటనే మనసులోనే సన్యసించాడు..కృష్ణుడికో దణ్ణం పెట్టుకునీ.. 'శరణం భవకరుణాలయ - గురు దీన దయాళో' అనుకున్నాడు.
పరమాత్మ పరమభాగవతోత్తముణ్ణీ... అంత తొందరగా పోనిస్తాడూ... అక్కడో దుంగ దొరికింది...! దాని సాయంతో వొడ్డుకొచ్చాడు. ప్రాణం నిలిచింది..ఇంటికెళ్ళి.. భార్యకి జరిగిందంతా చెప్పి 'మరి ఆపత్సన్యాసం స్వీకరించాను...! అనుజ్ఞ ఇస్తే' అన్నాడు...అర్థోక్తిగా
ఆవిడ దుఃఖాన్ని గుండెల్లో దిగమింగుకునీ మౌనంగా సన్యాసాన్ని అంగీకరిస్తూ 'వీక్షే కదా దేవ దేవం..' అనుకుంది..
వెంటనే గోవిందశాస్త్రి తన గురువుగారైన శివ పరమానంద తీర్థుల ఆజ్ఞ మేరకు ఆయన ఆధ్వర్యంలో యథావిధిగా సన్యాసాశ్రమం స్వీకరించి నారాయణ తీర్థులయ్యాడు..
ఇకపోతే జగత్ప్రసిద్ధమైన కృష్ణలీలా తరంగిణిని భాగవత పురాణం లోని దశమ స్కంధం ఆధారంగా ఒక పెద్ద సంస్కృత నాటకం రాసీ.....ప్రతీ అంకానికి 'తరంగం' అని పేరు పెట్టీ... పన్నెండు తరంగాలు ప్రకటించారు. ఇందులో దాదాపు 156 కీర్తనలు ఉన్నాయి అందులో బాగా జనరంజకం అయిన తరంగాలు....

- ✦ఏహి ముదం దేహి - యదుకుల కాంభోజి
- ✦కలయ కళ్యాణిని - కేదార గౌళ
- ✦కలయ-యశోదే - కేదార గౌళ
- ✦క్షేమం కురు సతతం - సావేరి
- ✦గోవింద ఘటయ - కాంభోజి
- ✦గోవింద మిహ - గోపివే నంద-మధ్యమావతి.
- ✦జయ జయ గోకులబాల - కురంజి
- ✦నందగేహినీ - ద్విజావంతి
- ✦పూరయ మహకామం - బిలహరి
- ✦కృష్ణం కలయ సఖి - ముఖారి
- ✦బాలగోపాల క్రిష్ణ -మోహన
- ✦వీక్షే కద దేవ దేవం - ఆనంద భైరవి
- ✦మంగళాయ - కేదార గౌళ
- ✦శరణం భవ కరుణాలయ -సౌరాష్ట్రం

మరో విశేషం ఏమిటంటే...నారాయణ తీర్థులవారికి సిద్ధయ్య అనే శిష్యుడుండేవాడనీ.. అతనే తర్వాత సిద్ధేంద్రయోగి అయ్యాడనీ..... కూచిపూడి నృత్యానికి మూల పురుషుడై... కూచిపూడి నృత్యానికి ప్రపంచ ప్రఖ్యాతి తెచ్చి పెట్టాడనీ.. కూడా అంటారు.

నారాయణ తీర్థుల వారికీ దృష్టిదోషం ఉండేది.. రోజూ రాత్రిళ్ళు భోజనాలయ్యాక.... వసారాలో పడుకునీ కళ్ళుమూసుకుని తరంగాలు పాడుకునేవారు.

బాలకృష్ణుడొచ్చి..తీర్థులవారి బొజ్జమీదెక్కి ..తాండవం చేసేవాడు.

తాండవ క్రిష్ణుడి నృత్యం రోజూ చూస్తున్న సిద్ధయ్య.. ఓ రోజు అడిగాడు. "గురూ గారు రోజూ బాలకృష్ణుడు మీ బొజ్జమీద తాండవం చేస్తోంటే మీకు పొట్టనొప్పిగా ఉండట్లేదూ?"

"బాలకృష్ణుడి తాండవమా..ఎప్పుడ్రా..."

"అయ్యో! రాత్రిళ్ళు...మీరు నిద్రపోయే ముందు తరంగాలు అంటారు గదా... అప్పుడు బాలకృష్ణుడు తాండవం చేస్తాడు... నేను రోజూ చూస్తున్నాగా!"

"ఎంత అదృష్టవంతుడివిరా.....గుడ్డిపీనుగుని నాకు కనపడ్డేం!" అని కళ్ళు తుడుచుకునీ

"ఒరే...ఈసారి కృష్ణుడు కనబడ్తే మనిద్దరికీ జన్మరాహిత్యం ఎప్పుడో కనుక్కో..."

"ఓ ...అలాగే" అన్నాడు సిద్ధప్ప...

మర్నాడు రాత్రి బాలకృష్ణుడు కనపడగానే దణ్ణం పెట్టి "జగద్గురూ.... మా గురూగారికీ, నాకూ మోక్షం ఎప్పుడు?" అన్నాడు.

"నీకు ఈ జన్మలోనే...(నా దర్శనం అయ్యిందిగా...!)

మీ గురూగారికి మాత్రం మరో జన్ముంది!!" అన్నాడు. మురళి మనోహరంగా మోగింది....

అంచేతే సిద్ధేంద్రయోగి.. యక్షగానంని ఆంధ్ర దేశం అంతటా ప్రదర్శించి ..పుణ్యలోకాల కెళ్ళారు.

ఆ తర్వాత... వారి గురువు నారాయణతీర్థులు....



**- తనికెళ్ల భరణి**

## పాఠకులకి.....నమస్కారం..

ఎందరెందరో మహానుభావుల గురించి 'హాసం'లో రకరకాల వ్యాసాలు రాసే అవకాశం కలిగింది. వీటన్నిటినీ కలిపి 'ఎందరో మహానుభావులు' అనే మకుటంతో ఓ పుస్తకంగా వేస్తే... అనే ఆలోచన ఈ మధ్యనే వచ్చింది. లెక్క చూసుకుంటే 43.. మరొక ఏడు వ్యాసాలు ఎలాగోలా వీలుచిక్కించుకుని రాయగలిగితే 50 అవుతాయి. చెప్పుకుందికి బావుంటుంది. అందుకే మళ్లీ మొదలుపెట్టాను.

సరే..ఈ ఆలోచనతో పాటే మరో ఆలోచన...

'హాసం'లో నా వ్యాసాలు వచ్చిన తర్వాత ఎందరెందరో ఉత్తరాలు రాసేవారు. ఫోన్లు చేసేవారు, వ్యక్తిగతంగా కలిసేవారు. "మేం మీరు రాసిన ఫలానా వారి బంధువులమండీ... మా దగ్గర వారికి సంబంధించినవీ ఎన్నో ఉన్నాయండీ" అంటూ చెప్పేవారు. ప్రాణం ఉసూరుమనేది. అవి కూడా ఉంటే ఇంకా బాగా రాసేవాణ్ణి కదా అనిపించేది.

అందుకే 'హాసం'లో ఇప్పటివరకూ నేను రాసిన మహానుభావుల పేర్లు ఈ దిగువన ఇస్తున్నాను. వీరికి సంబంధించిన వివరాలు, ఫోటోలు, వారు వాడిన వస్తువుల యొక్క ఫోటోలు ఏవి దొరికితే అవి పంపించండి. పుస్తకంలో కలుపుకుంటాను. పంపిన వారిని జీవితాంతం మరిచిపోలేను. పుస్తకంలో పేరుపేరునా కృతజ్ఞతలు తెలుపుకుంటాను. అలాగే నేను రాయబోయే మిగిలిన 7 మంది మహానుభావుల పేర్లు కూడా ఆయా వ్యాసాలు ప్రింట్ అయ్యాక చూసి పంపించండి.

నేను ఇప్పటి వరకూ రాసిన మహానుభావుల పేర్లివి.

తుమరాడ సంగమేశ్వర శాస్త్రి, పట్రాయని సీతారామశాస్త్రి, కోలంక వెంకటరాజు, గుమ్మలూరి వెంకట శాస్త్రి, దూర్వాసుల సోమయాజులు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, ఆదిభట్ల నారాయణదాసు, విశ్వపతి శాస్త్రి, హనుమద్దాసు, సారంగపాణి, వీణవెంకట రమణదాసు, గరికపర్తి కోటయ్యదేవర, బొబ్బిలి కేశవయ్య, మద్దిరాల వెంకట రాయకవి, దుడ్డు సీతారామయ్య, మనుసొరి వెంకట లక్ష్మమ్మ, వాసా అప్పయ్య, పిరాట్ల శంకరశాస్త్రి, దాసు శ్రీరాములు, విద్యల నారాయణ స్వామి నాయుడు, కాళహస్తి వీరయ్య, పాటల రామన్న, వెంకట సామయ్య, పప్పు వెంకన్న, ద్వారం వెంకట స్వామి నాయుడు, మహేంద్రవాడ బాపన్న శాస్త్రి, పారుపల్లి రామక్రిష్ణయ్య పంతులు, కామసముద్రం అప్పలాచార్యులు, శ్రీశ్రీశ్రీ ఆనందగజపతి మహారాజా, త్యాగరాజు, పొడుగు రామమూర్తి, షేక్ చినమౌలా, యానం రామకృష్ణ, కొచ్చెర్లకోట రామరాజు, తూము నరసింహదాసు, వారణాసి రామసుబ్బయ్య, హరి నాగభూషణం, పలుకూరి వెంకట రమణ, నందిగానం వెంకన్న, వీణకుప్పయ్య, స్వాతి తిరుణాళ్,అల్లారఖా, భీమ్‌సేన్ జోషి.

నన్నింతవరకూ ప్రోత్సహించినట్టే, లభించిన వివరాలను రాసి పంపి ఆశీర్వదిస్తారు కదూ..

మీ తనికెళ్ల భరణి

వీర్ని గురించిన వివరాలను మీరు పంపవలసిన చిరునామా :

**తనికెళ్ల భరణి,**
**కేరాఫ్ హాసం,**
**502, శ్రీ బాలాజీ నిలయం,**
**మోతీనగర్,**
**బాలాజీస్వర్ణపురికాలనీ,**
**హైదరాబాద్-500 018**



నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



## కనుబొమ్మలాట

ఎన్.టి.రామారావు 'వరకట్నం' (1968) సినిమా తీశారు. ఆయనే దర్శకుడు. ఆ సినిమా ఆరంభానికి ముందు ఓ శుభోదయాన, మా యింటి టెలిఫోన్ డింగ్ డాంగ్ అని కొడితే,అపుడు మా యింటి కొచ్చిన మా అన్నయ్య కొడుకుని "చూడ్రా" అన్నాను. వాడు ఫోనెత్తి 'హలో' అని, కాలుమీద ఏదో కాటువేసినట్టు పైకి ఒక్క ఎగురు ఎగిరి,చేతులు వణికిపోతుండగా ఫోన్ పక్కన పెట్టి "రామారావు...ఎన్.టి.రామారావుగారు... ఆయనే ఫోను... అమ్మో...ఆయనతో హలో మన్నాను బాబోయ్'' అంటూ చూరుకు కొట్టుకునేంత పైకి ఎగిరి, కంగారు పడ్డాడు, తర్వాత కిందపడ్డాడు!

నేను అంత కంగారుగానూ వెళ్లి ఫోన్ తీసి ''అన్నగారూ నమస్కారం'' అన్నాను నా గొంతులో వణుకు స్పష్టంగా తెలుస్తోంది. ఆయన ఎప్పుడూ నాకు ఫోన్ చెయ్యలేదు. ఎందుకు చేస్తారు. అవసరం వుంటే వేరెవరో చేస్తారు గాని! ''బ్రదర్, వరకట్నంలో మీకు వేషం... భట్రాజు. ఆఫీసుకి రండి" అంతే! పెట్టేశారు ఫోను!




రామారావు గారి పక్కన ఇతర చిత్రాల్లో వేషాలు వేస్తున్నానుగాని, ఆయన సొంత సినిమాలో వెయ్యలేదు. "ఎన్ఎటిలో వేషం" అంటే అదో గొప్ప! దాంతో నాకు కంగారు!.. రామారావు గారు ఆఫీసుకి రమ్మన్నారని నా భార్యతో చెప్పి, 'నన్నెవరూ డిస్టర్బ్ చెయ్యకండి' అని పది పదిహేను నిముషాల్లో సిద్ధమైపోయి రామారావు గారింటికి పరుగెత్తాను. అదే -కారుని పరుగెత్తించాను. అక్కడున్న జయవిజయుల్ని దాటుకుని, ఆఫీసు రూములో వున్న రుక్మాంగద రావు గారిని కలిసి, విషయం చెప్తే ఆయన కూచోబెట్టి రామరావుగారి రూమ్‌కి వెళ్లి తిరిగొచ్చి ''వెళ్లండి'' అంటే నడక నేర్చుకుంటున్న వాడిలా-తడబడుతూ గదిలోకి వెళ్లాను.

''బ్రదర్ రండి! కూచోండి'' అన్నారు. "మంచివేషం. మీరయితే బావుంటుంది. తమ్ముడితో మాట్లాడండి...డేట్స్ ఇస్తారు...ఆ? ఆల్ ది బెస్ట్" అని చెయ్యిజాచి, వణుకుతున్న నా చేతికి కలిపి, చిరునవ్వి-"బాగా చెయ్యండి" అన్నారు."చాలా సంతోషం అన్నగారూ" అని త్రివిక్రమరావుగారిని కలిసి,షూటింగ్ తేదీల కాగితం మీద సంతకాలు పెట్టి, దర్జాగా సొంతకాలు బయటపెట్టి, బయటపడ్డాను-అమందానంద కందళిత హృదయారవిందుండనై!

సరే, షూటింగ్ తొలిరోజు, వాహినిలో చాలా సహజమైన ఇంటి సెట్టువేశారు కళా దర్శకుడు యస్.కృష్ణారావు. అది చూసి, మేకప్ రూమ్‌కి వెళ్లి కూచున్నాను. నాకు పెద్దకోటు,జుబ్బా,తలపాగా, పెడతారట. అన్నీ అక్కడ వున్నాయి. మేకప్ భక్తవత్సలం గారు. చాలా సీనియర్. అంతకు ముందు నాకు మేకప్ వేశారు గనక, కొత్తకాదు. ఆయన చేతిలో బ్లేడుంది. ''సార్, కనుబొమలు సన్నగా చెయ్యాలి. కిందాపైనా తీసేస్తాను" అన్నారు. నేను దిగ్గుమన్నాను. "వద్దండీ -నాకు అలవాటు లేదు. ఏ సినిమాలో అలా ''ఐబ్రోస్''తియ్యలేదు. బయట తిరగడానికి ఇబ్బందిగా వుంటుంది. మగాళ్లమ్ కదా. వద్దులెండి" అన్నాను.

"మీ యిష్టం. తర్వాత పెద్దాయన (ఎన్.టి.ఆర్‌ని అందరూ అలాగే అంటారు) ఇష్టం!'' అన్నారు భక్తవత్సలం.

మేకప్ పూర్తి చేసి, మీసం అతికించి "మీకు బొట్టు పెట్టాలి. సెట్టుకి వెళ్తే పెద్దాయనే పెడతారు" అన్నారాయన. (పౌరాణికాలయినా, సాంఘికాలయినా ముఖాన బొట్టుపెట్టవలసి వస్తే ముఖ్యపాత్రలకి రామరావు గారే దిద్దేవారు)డ్రెస్సు వేసుకుని సెట్లోకి వెళ్లి నించున్నాను. నా వెనకాలే భక్తవత్సలం గారు వచ్చి నించున్నారు. మొదటి రోజుకదా, మేకప్, దుస్తులూ ఎలా వున్నాయో నిదానించి చూస్తారు రామారావు. నావైపు తిరిగి, ఎగాదిగా చూశారు. 'ఏమంటారో' అని నేను హెడ్మాస్టరు ముందు స్కూలు పిల్లడిలా నించున్నాను. "ఆ లైటు ఇటు తిప్పండి." అని ఆయనే ఒక బేబీ లైటు నా ముఖం మీదికి తిప్పి-తేరపారచూసి "ఏమిటీ,ఐబ్రోస్ తియ్యలేదేం?" అన్నారు.

"సార్ (అంటే నేను), ఎందుకూ, వద్దన్నారు... అందుకని" అని నసిగారు భక్తవత్సలంగారు.

"వద్దేమిటి -నో! బ్రదర్, కన్ను బాగా విశాలంగా కనిపిస్తుంది...చూడండి" అంటూ ఆయన చెయ్యి చాచగా, చేతిలో రెడీగా వున్న బ్లేడుని అందించారు భక్తవత్సలం.

రామారావుగారు నా నుదిటిమీద చెయ్యి ఆన్చి, బ్లేడుతో సర్‌సరని 'ఆపరేషన్' చేశారు! నేను నోరెత్తితే ఒట్టు! ఒక కన్ను అయింది. రెండో కన్నూ 'విశాలం' చేశారు. "వూ" అని గర్జించి," బ్రదర్‌కి అద్దం చూపించండి" అన్నారు. నా మొహం ముందు అద్దం ప్రత్యక్షమైంది. "ఎలావుందిప్పుడు?" అన్నారాయన.

నాకేం తేడా కనిపించలేదుగాని, కంటిపైన చిన్నమంట! "ఏం?" అన్నారు మళ్లీ ఆయనే! ''చాలాబాగుంది'' అన్నాను చచ్చినట్టు. 'రేపట్నుంచి ఇలాగే ఫాలో అవండి" అన్నారు.

గీసిన కనుబొమ్మలతో బయట తిరిగితే, చూసినవాళ్లు ఏమంటారో అని భయం!.... కానీ, ఎన్.ఎ.టిలో వేషం అంటే సామాన్యమా !

ఇంతకీ అవాళ షూటింగ్ లేదు పొమ్మన్నారు-మేకప్ టెస్టట.......

## (దానవీరశూర)కర్ణాభరణం

తర్వాత కొన్నాళ్లకి అదే 'వరకట్నం' సినిమాకోసం అవుడ్డోర్ వెళ్లాం తాడేపల్లి గూడెం. కొంతమంది నటీనటులు ముందే వెళ్లిపోయారు. రాజనాలగారు,నేనూ మాత్రం బయల్దేరాం. రేలంగి గారింట్లోనే మాకు బస. పైన గదిలో పెద్దాయన! కింద మేము. రామారావుగారిని చూడ్డానికి వచ్చిన జనం-మహాసముద్రంలా వున్నారు. సముద్రపు ఒడ్డున వున్న ఇసక తీసి వేస్తే రాలదు! రామారావు గారు ఆంధ్రాలో అవుడ్డోర్‌కి రావడం అదే ప్రథమంట- అందులోనూ ఆ ప్రాంతానికి.

రోడ్డు మీద బండిపాట. ''సై సై జోడెడ్లబండి..'' అని బండి తోలుతూ

రాజనాలగారు, వెనక నుంచుని "మహప్రభో" అంటూ నేనూ, (పాట - రాజనాలకి ఘంటసాల, నాకు 'మహాప్రభో' మాధవ పెద్ది సత్యం) రోడ్డుకి రెండుపక్కలా జనం. వాళ్లని అదుపులో పెడుతూ, అంతకంటే ఎక్కువ సంఖ్యలో కనిపిస్తున్నారు పోలీసులు. గోల,కేకలు, ఈలలుతో బండి ముందున్న ట్రక్‌లో దర్శకులు చెమటలు కక్కుతూ,ముఖం తుడుచుకుంటున్నారు.

'స్టార్ట్' అంటే పాట మొదలైందిగాని,బండి కదలదే! ఎంత అదిలిస్తున్నా రెండెద్దులూ అడుగుముందుకు వెయ్యడం లేదు. "మామాజీ! (రాజనాలని రామారావు అలా పిలిచేవారు) ఏం-మీ మాట ఎద్దులు కూడా వినడంలేదే!"అని చమత్కారం విసిరారు రామారావు. నేనూ చిరునవ్వు చిందించాను.

"బి రెడీ బ్రదర్ ..స్టార్ట్" అన్నారు. బండి ఓనరు కాబోలు- ఏదో అని అదిలించగా బండి బయల్దేరింది..ఒక అడుగు వెయ్యడంతో నేను పొలికేక! "కట్..ఏమ్ ..ఏమైంది?"

"సార్, నా చెవికి తగిలించిన రుద్రాక్ష జారిపోయింది" అన్నాను వెతుకుతూ.

"ఎలా జారిపోయింది? ఏమ్ కాస్ట్యూమ్... చూడండి..వెతకండి" అని పెద్దాయన కేక.

పైన ఎండ వేడి, చుట్టూ జనం వేడి, అవుతున్న ఆలస్యానికి పెద్దాయన వేడి, బండి మీద గడ్డివేశారు. ఆ కర్ణాభరణం అందులో ఎక్కడ చిక్కుకుందో దొరకదు. పదిమంది వచ్చారు వెదకడానికి. నేను పదకొండోవాణ్ణి. "బ్రదర్! పెట్టుకున్నప్పుడే గట్టిగా వుందో లేదో చూసుకోవాలి....ఏం దొరకలేదా?" గద్దింపు. "దొరికింది దొరికింది" అన్నాడొకడు తీసి. "తగిలించండి. రెడీ" ఏం తగిలిస్తారు? రుద్రాక్ష దొరికింది. కాని చెవికి పెట్టి టైట్ చేసే స్ర్క్యూ ఎక్కడికో పారిపోయింది. "ఏమ్.... తగిలించండి..ఏమిటాలస్యం?" అన్నగారు ఉగ్రులవుతున్నారు. వేరే స్ర్క్యూ కోసం పరుగెత్తారు... జనం తొక్కిసలాట .....అన్నగారు విసుగు....నాకు కంగారు,ఒణుకు...అందరికీ భయం..పోలీసులు లాటీల విదిలింపులు.... 'ఓర్నాయినో! ప్రాణం మీదికొచ్చిందిరా బాబు!..నా వల్లనే ఆలస్యం'. ఓ పదినిమిషాల తర్వాత, ఇంకొక ఆభరణం తెచ్చి తగిలించారు. ..అమ్మయ్య..'రెడీ..స్టార్ట్...'’రాజనాలగారి పాట, వెనకాల "మహాప్రభో".......అయినాయి. "బ్రదర్ మహాప్రభో ముందుగా అనేశారేమిటి?... క్లోజ్ తీస్తాను తర్వాత లిప్ చూసుకోండి" అని ఆయన అనగానే " లిప్ చూసుకోవయ్యా-నువ్వు. తర్వాత నాకు తప్పుతుంది" అని రాజనాల. అది అయిన తర్వాత, బండి పరుగెత్తే షాట్లు తీశారు...ఆ పరుగుకి నా పంచె వెనక దోపిన గోచీ వూడింది. అది నేను చూసుకోలేదు. తర్వాత బండి దూకి నేను పరుగెత్తే షాటు తీశారు......అలాగే పరుగెత్తాను- వూడిన గోచీ నేలమీద పొర్లాడుతుండగా ఆ షాటు హైలైటన్నారు-గోచీ వూడిపోతున్నా గమనించక పరుగెత్తానని. అసలు సంగతి వాళ్లకేం తెలుసు? గుప్ చప్..

## బ్రేక్స్‌తో సంభాషణ

అవుడ్డోర్ అయిన తర్వాత ఓరోజు ఇన్‌డోర్. పెద్దసెట్టు. ఆ సెట్లో రాజనాల,సత్యనారాయణ అరటిపళ్లు తింటుంటే నేను పెద్ద డైలాగు చెబుతూ, రావాలి. ముందుగా డైలాగ్సు ఇచ్చారుగాని, ఏది తర్వాత తీస్తారో, ఏది ముందో తెలీదు...

"బ్రదర్....రండి....ఆ రెండో పేరా చెప్పండి" అన్నారు దర్శకులు. రెండోపేరా! అది చూసుకోలేదే...మొదటిది తీసిన తర్వాత కదా, రెండోది తీస్తారు...

"ఏమ్ రెడీయా?" అన్నగారు.

"ఒక్కసారి చూసుకుంటాను" నేను.

"టేక్ యువర్ ఓన్ టైమ్..రెడీయా?"

ఏం రెడీ...అరపేజీ డైలాగుంది..అంతలో ఎలా వస్తుంది?....

"లైట్స్" అన్నారు.

"రెడీ రండి.... అక్కడినుంచి చెప్పుకుంటూ ఇక్కడి దాకా రండి"

ఇప్పటిలాగా,అప్పుడేమన్నా ప్రామ్టింగ్‌లా? డైలాగ్ రికార్డింగ్ అంతా అక్కడే...తప్పులు పలకడానికి లేదు. నాకొక్క ముక్కరాలేదు... "రండి...రిహార్సల్..."

ఏదో చెప్పుకుంటూ వచ్చాను..

"ఇట్నుంచి,ఇలా ఈలైట్‌లో రండి" అన్నారు కెమెరామేన్ (రవికాంత్ నగాయిచ్ ).

అదొకటా! డైలాగే సరిగా చెప్పనా.... లైటింగ్‌కోసం దారే వెతుక్కోనా..డైలాగు రెండు వాక్యాలే నోటికొచ్చింది. తర్వాత బండి ఆగిపోతోంది.

"ఏమ్ ! చదువుకోలేదా...! ముందుగా చూశారు కదా సీను?"

"చూశాను ..అదీ..ఇంకా ..నోనో... నోటికి..." నత్తొచ్చింది నాకు.

లైట్స్ ఆఫ్ అన్నారు. చూసుకోండి అన్నారు. వెంటనే రెడీ అన్నారు. నిదానం,నిర్భయం అయితే డైలాగు నోటికి వచ్చేస్తుంది గాని,ఇలా కంగారుపడిపోతూ వుంటే ఏం వస్తుంది? పైగా సత్యనారాయణ, రాజనాలలకి డైలాగ్ లేదు...స్వేదజలంతో నాకు స్నానం...లైట్లు వెలిగాయి...మరీ వేడీ...

"టేక్ వన్" క్లాప్ కొట్టారు.

"బ్రదర్ రండి....." వచ్చాను. డైలాగు రెండు వాక్యాల తర్వాత మూడో వాక్యం పెగల్లేదు. "ప్పెప్పెప్పె" అన్నాను.

"కాట్" అన్నారు .. అంతే! వన్‌మోర్..

"మామాజీ!.. సత్యనారాయణా.. అరటిపండ్లు బాగా తినాలి. ఒలుచుకుని తినడం కనిపించాలి..ప్రొడక్షన్ వాల్యూ కోసం పెద్దసైజువి తెప్పించాను" అన్నారు రామారావు.

"అలాగే సార్" అన్నారా ఇద్దరూ....కథ ముందుకి జరగడంలేదు.

డైలాగ్ బండి ఎక్కడో దగ్గర బ్రేక్ కొడుతోంది...."టేక్ సిక్స్" అన్నారు..."సెవెన్" అన్నారు. నేను అలిసిపోయాను. నాకంటే అలిసిపోయారు పెద్దాయన. అరటిపళ్లు టేక్ టేక్‌కీ తినలేక అలిసిపోయారు ఆ ఇద్దరూ. రాజనాల తన దగ్గరికి నన్ను పిల్చి రహస్యంగా "తొందరగా ఓకే చేయించవయ్యా నాయనా...ఇప్పటికి ఏడు అరటిపళ్లు తిన్నాం. నువ్వు టేకులు మేము అరటిపళ్లు తినడమే తినడం! పొట్టపగిలి చస్తాం" అన్నారు.

అసలే నేను నా గ్రహాల్ని నిందించుకుంటూ వుంటే వీళ్ల బాధ వీళ్లదీ!

"రెడియా?..టచప్.."

టచప్ చేసుకుంటూ, లోలోపల సంభాషణ మననం చేసుకుంటూ 'రెడీ' అనడం- మధ్యలో ఆగిపోవడం! ..."టేక్ లెవెన్" అన్నారు. అది వినగానే, పంచప్రాణాల్లోనూ రెండు ప్రాణాలు తమని కాపాడుకోడానికన్నట్టు పారిపోయాయి. ఒక్కో నెంబరు అనౌన్సు చేస్తూంటే ఈ శరీరం మీద ఔన్సుల కొద్దీ స్వేదం..!...కుదరడంలేదు. ఎన్ని టేకులయినా ఇది వచ్చేలా లేదు.

"బ్రదర్ కాల్‌షీటు టైమ్ వేస్టవుతోంది... ఫిలిమ్ చార్జవుతోంది....ఫిలిమ్ ఖరీదు ఎంతో మీకేమైనా తెలుసా?" పెద్దాయనకి విసుగు,ఓర్పు నశిస్తోంది.

"సారీ..అన్నగారు..నన్ను క్షమించండి... ఎక్కడ పోతోందో ఎందుకు పోతోందో..నావల్ల కావడంలేదు..ఒక్క పావుగంట..నన్ను...." నా ఏడుపుమొహం చూసి, అన్నగారు నవ్వుమొహం పెట్టారు.. "ఇట్సాల్‌రైట్...టైమెంత ?" అన్నారు. "ఐదు" అన్నారెవరో.

"ఆరుగంటలకి బ్రేక్ చెయ్యాలి. బ్రదర్ కోసం గంట ముందు బ్రేక్ చేద్దాం..బ్రదర్ మీరెవరితోనూ కలవకండి. ఆ మూల కూచోండి. మీకు టిఫిను అక్కడికే పంపిస్తాను. డైలాగు పూర్తిగ కంఠతా పట్టండి...ఓకే?" అభయహస్తం కనిపించింది.

టిఫిను కూడానా నాకు? విందుభోజనం లభించిందే ...రామారావుగారు దగ్గరకొచ్చారు. "వాటీజ్ ది డిఫికల్టీ? ...ఏమైంది మీకు? పేజీల డైలాగులు అనర్గళంగా వూదేస్తారే.... ఏం జరిగిందిక్కడ?" అన్నారు చిన్న పిల్లాడిని బుజ్జగిస్తున్నట్టు. మాస్టారి దగ్గర విద్యార్థిలా భయపడుతూ చెప్పాను. "డోంట్ వర్రీ -చూస్కోండి" అన్నారాయన. చూసుకున్నాను. రెడీ అనిపించీ చెప్పాను. బ్రేక్‌కాగానే టేక్ చేశారు. మళ్లీ మొదలు పెట్టిన తర్వాత, ఫస్ట్ టేక్ ఓకే. అప్పుడు గాని పారిపోయిన రెండు ప్రాణాలు తిరిగి ఈ గూటికి చేరుకోలేదు. ఓరీ బాబోయ్,ఏం టెన్షను అందరికీ నా వల్ల.

"రామారావు గారి సినిమా షూటింగంటే రాత్రే మొదలవుతుంది దడ" అని రామలింగయ్య గారు చెప్తే ఏమిటో అనుకున్నాను. అనుభవిస్తే గాని తెలియలేదు. అవునుమరి. అన్నింటిలోనూ కచ్చితం పాటిస్తారు కదా రామారావు గారు!



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : ఏక్ ముసాఫిర్ ఏక్ హసీనా
రచన : రాజా మెహదీ అలీ ఖాన్
సంగీతం : ఓ.పి. నయ్యర్
గానం : మహమ్మద్ రఫీ,ఆశా భోంస్లే
అభినయం : జాయ్ ముఖర్జీ,సాధనా

అ: ఆప్ యూంహీ అగర్ హమ్‌సే మిల్‌తే రహే, దేఖియే ఏక్ దిన్ ప్యార్ హోజాయేగా
ఆ: ఐసీ బాతేఁ న కర్,ఓ హసీఁ జాదూగర్, మేరా దిల్ తేరీ అంఖోఁ మేఁ ఖోజాయేగా
అ: పీఛే పిఛే మేరే ఆప్ ఆతీహైఁ హై క్యూఁ (2)
మేరీ రాహోఁ మేఁ ఆంఖేఁ బిఛాతీ హైఁ క్యూఁ
ఆప్ ఆతీ హైఁ క్యూ
ఆ: క్యా కహూఁ ఆప్ సే యే భీ ఇక్ రాజ్ హై
ఎక్ దిన్ ఇస్‌కా ఇజ్‌హార్ హో జాయేగా ॥ఆప్ యూంహీ॥
అ: కైసీ జాదుగరీ కీ అరే జాదుగర్ (2)
తేరే చెహరే సే హట్‌తీ నహీఁ యే నజర్
హాయ్,మేరీ యే నజర్
ఆ: ఐసీ నజరోఁ సే దేఖా అగర్ ఆప్‌నే
షర్మ్ సే రంగ్ గుల్‌నార్ హోజాయేగా "ఆప్ యూంహీ॥
అ: మైఁ ముహబ్బత్ కీ రాహోఁ సే అన్‌జాన్ హూఁ (2)
క్యా కరూఁ,క్యా కరూఁ , మైఁ పరేషాన్ హూఁ (2)
మైఁ పరేషాన్ హూఁ
ఆ: ఆప్‌కీ యే పరేషానియాఁ దేఖ్‌కర్
మేరా దిల్ భీ పరేషాన్ హో జాయేగా ॥ఆప్ యూంహీ॥

హిందీ చిత్రాలలో గజల్ ప్రక్రియకు ప్రత్యేక గుర్తింపు తెచ్చిన కవులలో రాజా మెహదీ అలీఖాన్ ముఖ్యులు. గజల్స్ రూపొందించటంలో తనకు తానే సాటి అనిపించుకున్న మదన్‌మోహన్‌తో ఆయన కలిసి పని చేసిన 'అన్‌ఫడ్','వో కౌన్ థీ', 'మేరా సాయా' చిత్రాలలోని పాటలు సంగీత రసగుళికలు. 'ఆప్‌కీ నజరోఁ నే సమ్ ఝా'(అన్‌పఢ్), 'లగ్ జా గలే'(వో కౌన్ థీ),'నైనోం మేఁ బద్‌రా ఛాయే' (మేరా సాయా) పాటలు ఇప్పటికీ గజల్ ప్రేమికులను ఆకట్టుకుంటూనే ఉన్నాయి.

యుగళ గీతాలలో కూడా తనదైన శైలిలో చక్కని పాటలు రాశారు ఖాన్ సాబ్. ఇందుకు చక్కని ఉదాహరణ 'ఏక్ ముసాఫిర్ ఏక్ హసీనా' చిత్రంలోని 'ఆప్ మూఁహీ అగర్ హమ్‌సే మిల్ తే రహే, ఓ.పి. నయ్యర్ సంగీతంలో రూపొందిన ఈ పాట విలక్షణంగా ఉంటుంది. 'నిన్ను ప్రేమించడం నా ఉద్దేశం కాదు, అయినా తప్పేలా లేదు 'అనే భావంతో ఈ పాట ఉంటుంది. మహమ్మద్ రఫీ గళంలో ఆ చెప్పీ చెప్పనట్టుండే భావం చిలిపిగా పలికింది. ఆశా భోంస్లే గళంలోని చలాకీతనం దానికి తోడుగా నిలిచింది. ఓ.పి. నయ్యర్‌తో రెగ్యులర్‌గా పనిచేసే గీత రచయిత ఎస్.హెచ్.బిహారీ ఈ చిత్రం కోసం వ్రాసిన 'బహుత్ షుక్రియా',ముఝే దేఖ్‌కర్ ఆప్ కా ముస్కురానా' పాటలతో పాటు ఈ పాట కూడా అమిత ప్రజాదరణ పొందింది.

నాయిక (సాధనా)ను దుండగులనుంచి కాపాడుతుండగా, తలకు గాయమై తన గతాన్ని మరిచిపోతాడు నాయకుడు (జాయ్ ముఖర్జీ). తనవారందరూ దూరమైన నాయిక,సైన్యంలో పనిచేసే నాయకుడు ఆ విధంగా కలుస్తారు. తానెవరో తెలియక అయోమయంలో ఉన్న అతను ఆమెకు చేరువ అవటం మంచిది కాదని భావించినా ఆమె మంచితనం వల్ల ఆకర్షితుడవుతాడు. గతం మరిచిన అతనికి తోడు అవసరమని ఆమె



అతన్ని అంటిపెట్టుకుని ఉంటుంది. ఈ సందర్భంలో వచ్చే పాట 'ఆప్ యూఁహీ అగర్ హమ్‌సే మిల్ తే రహే'. అతను తన భావాలను చెప్తే ఆమె అతన్ని హ్యూమర్ చేయటానికి అతనితో సరదాగా పాడుతుంది.

మిల్‌నా అంటే కలవటం. హసీఁ జాదూగర్ అంటే అందమైన మాయగాడు.

అ: నువ్విలాగే నాకెదురుపడుతూ ఉంటే ఏదోనాడు ప్రేమ పుడుతుంది చూసుకో

ఆ: అలా అనకు, ఓ సొగసైన మాయగాడా, నా మది నీ కళ్ళలో మునిగిపోతుందేమో'

'మనం ఇలాగే కలుస్తూ ఉంటే ఏదో ఒకరోజు ప్రేమ పుడుతుంది. ఆ తర్వాత నీ ఇష్టం' అంటున్నాడతను. ఆమె సరదాగా 'అలాంటి మాటలు అనకు. ఆ మాటలతోనే నన్ను మాయచేసి వశపరచుకుంటావు' అంటోంది

పీఛే పీఛే అంటే వెంట వెంట. రాహ్ అంటే దారి. 'రాహోం మేఁ ఆంఖేఁ బిఛానా' అంటే ఎదురు చూపులు చూడటం. రాజ్ అంటే రహస్యం. 'ఇజ్‌హార్' అంటే వ్యక్తపరచటం.

అ : నా వెంట నీవు వచ్చేవెందుకు
నా కోసం ఎదురుతెన్నులు కాచేవెందుకు
వచ్చేవెందుకు

ఆ : ఏమని చెప్పను,ఇదీ ఓ రహస్యమే
ఓ రోజు నీకే తెలిసేనులే'

ఆమెకు దగ్గర కాకూడదని అతను ఎంత ప్రయత్నించిన ఆమె అతన్ని వదిలి వెళ్ళటంలేదు. 'ఎందుకు నా కోసం ఆరాటపడుతావు' అని అడుగుతున్నాడు. ఆమె కూడా గడుసుగా ' అదో రహస్యం. ఓ రోజు నీకే అర్థమవుతుందిలే' అంది.

జాదూగర్ అంటే మాయ చేసేవారు. జాదూగరీ అంటే మాయ. చెహరా అంటే ముఖం. నజర్ అంటే చూపు. షర్మ్ అంటే సిగ్గు. గుల్‌నార్ అంటే పూవులరంగు.

అ : ఏం మాయ చేశావో ఓ గడసరీ
నీ మోము నుంచి చూపు మరలదే... నా చూపుమరలదే

ఆ : అలా నీవు చూస్తూ ఉంటే సిగ్గుతో మోము ఎరుపెక్కునే'

'నువ్వేం మాయ చేశావో గానీ నువ్వు ఎదురుగా ఉంటే నీ మోము నుంచి నా చూపు మరలదు ' అని అతనంటే 'నువ్వు అలా చూస్తూ ఉంటే నాకు సిగ్గు ముంచుకొస్తుంది' అని ఆమె సిగ్గుపడుతోంది.

ముహబ్బత్ అంటే ప్రేమ. అన్‌జాన్ అంటే తెలియని వారు. పరేషాన్ అంటే ఏమీ పాలుపోకపోవటం.

అ : నాకు ప్రేమ సంగతులు తెలియవే
ఏం చేయను,నాకు దిక్కుతోచదే
దిక్కే తోచదే

ఆ : నీ బాధ చూస్తూ ఉంటే
నా మది కూడా దిగులుపడుతుంది'

'ప్రేమికులు ఏం చేస్తారో నాకు తెలియదు. నాకు ఏం చేయాలో తెలియటం లేదని అతను అంటున్నాడు' 'నీ బాధ చూస్తుంటే నాకు దిగులుగానే ఉంది' అని ఆమె ఆట పట్టిస్తోంది.

ఒ.పి. నయ్యర్ మధురమైన సంగీతానికి అనుగుణంగా లయబద్ధంగా నడుము ఊపుతూ అమాయకత్వం ఉట్టిపడేలా ఉన్న సాధనా నటన ఆకట్టుకుంటుంది.

అ: మైఁ ప్యార్ కా రాహీ హూఁ
తేరీ జుల్ఫ్ కే సాయే మేఁ కుఛ్ దేర్ రహహూఁ జావుఁ

ఆ: తుమ్ ఏక్ ముసాఫిర్ హో
కబ్ ఛోడ్‌కే చల్ దోగే యే సోచ్‌కే ఘబ్‌రావూఁ ॥మైఁ ప్యార్ కా॥

అ: తేరే బిన్ జీ లగే నా అకేలే

ఆ: హో సకే తో ముఝే సాథ్ లేలే

అ: నాజ్‌నీఁ తూ నహీఁ జా సకేగీ
ఛోడ్‌కర్ జిందగీ కే ఝమేలే

ఆ: జబ్ భీ ఛాయే ఘటా
యాద్ కర్‌నా జరా
సాత్ రంగోఁ కీ హూఁ మైఁ కహానీ ॥మైఁ॥ప్యార్ కా॥

అ: ప్యార్ కీ బిజిలియాఁ ముస్కురాయే

ఆ: దేఖియే ఆప్ పర్ గిర్ న జాయే

అ: దిల్ కహీ దేఖ్‌తా హీ రహూఁ మైఁ
సామ్‌నే బైఠ్ కర్ యే ఆదాయేఁ



ఆ: న మైఁ హుఊఁ నాజ్ నీఁ
న మైఁ హూఁ మెహజబీఁ
ఆప్ కీ హీ నజర్ హై దివానీ ॥మై ప్యార్ కా॥

ఈ చిత్రం కోసం రాజా మెహదీ అలా ఖాన్ 'మేఁ ప్యార్ కా రాహీ హూఁ' అనే పాట కూడా రాశారు. ఈ పాట చిత్రంలో చోటు చేసుకోలేదు. అయినా ఈ పాట ఆడియో బైట దొరుకుతుంది.

రాహీ అంటే బాటసారి. జుల్ఫ్ అంటే కురులు. సాయా అంటే నీడ. ముసాఫిర్ అన్నా బాటసారియే. ఛోడ్‌నా అంటే వదలటం. ఘబ్‌రానా అంటే భయపడటం.

అ : నీ ప్రేమ బాటసారిని
నీ కురుల నీడలో కాస్త సేద తీరనీ
ఆ : నీ వొక బాటసారివి
భయపడుతున్నా నన్నొదిలి పోతావని'

'నేను ప్రేమ ప్రయాణం చేస్తున్నాను. నీ కురుల నీడలో కాస్త 'సేదతీరనివ్వు' అని అతను అడుగుతున్నాడు. కానీ అతను తన వెంట ఎల్లప్పుడూ ఉంటాడని ఆమెకు నమ్మకం కుదరటంలేదు. అతను తన జీవితంలోకి అనుకోకుండా వచ్చినట్టే చెప్పకుండా వెళ్ళిపోతాడని ఆమె భయం.

'జీనాలగే' అంటే మనసు కుదుటపడదు అని. అకేలా అంటే ఒంటరి. సాథ్ అంటే తోడు నాజ్ నీఁ అంటే సొగసుకత్తె. జిందగీ అంటే జీవితం. ఝుమేలా అంటే లంపటం. ఘటా అంటే మేఘం. యాద్ అంటే గుర్తు. 'సాత్ రంగ్' అంటే ఏడు రంగులు. కహనీ అంటే కథ.

అ : నువు లేక నేనుండలేనే
ఆ : నీ తోడుగా ఉంటాను నేనే
అ : నీవు నా వెంట రాలేవులే
ఈ జీవితాన్ని వదిలి
ఆ : మేఘం కమ్మినపుడు
గుర్తు చేసుకో
ఏడు రంగుల కథ నేనని'

ఆమె లేకపోతే మనసు మనసులో ఉండదని. అంటున్నా మళ్ళీ 'నావెంట రాలేవులే' అంటున్నాడతను. తనను వదిలి వెళ్ళినా మేఘం కమ్మినపుడు విరిసే ఇంద్రధనుసులా తానున్నానని గుర్తుంచుకోమంటుంది ఆమె.

బిజిలీ అంటే మెరుపు. ముస్కురానా అంటే చిరునవ్వు నవ్వటం గిర్‌నా అంటే పడటం. సామ్‌నే అంటే ఎదురుగ. అదాయేఁ అంటే సొగసులు . మెహజబీఁ అంటే అందగత్తె. దివానీ అంటే పిచ్చిది.

అ : ప్రేమ మెరుపులే మెరిసేను
ఆ : చూసుకో అవి నీపై కురిసేను
అ : మనసు ఆరాటపడుతోంది
ఇలా నీ సొగసులు చూస్తూ ఉండాలని
ఆ : నేను సొగసు కత్తెను కాను
నేను అందగత్తెను కాను
నీ చూపుకే ఏదో మైకం కమ్మింది'

ప్రేమ పుట్టిందనే విషయాన్ని అతను 'ప్రేమ మెరుపులు మెరిశాయి' అని చెబితే ఆమె 'ఆ మెరుపులే నీపై పడితే ప్రమాదం'అంటోంది. 'నిన్నిలా చూస్తూ ఉండాలని పిస్తోంది' అని అతనంటే 'నేనేమంత అందగత్తెను కాను, నీ కేదో పిచ్చిపట్టినట్టుంది' అంటోందామె.

- పి.వి.సత్యనారాయణ రాజు

## హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలూ

### 1964

'చిత్రలేఖ' చిత్రం ద్వారా రోషన్ చక్కటి గుర్తింపును సాధించారు. భగవతి చరణ్ వర్మ రాసిన నవల ఆధారంగా తయారయిన ఈ చిత్రంలో సాహిర్ లుధియాన్వి రాసిన సాహిత్యానికి అతి చక్కటి సంగీతాన్నందించారు రోషన్. మూడు దశాబ్దాల తరువాత ఇందీవర్ , సాహిర్ సాహిత్యాన్ని వేనోళ్ల పొగడటం ఓ విశేషం. ఈ చిత్రంలోని 'సంసార్ సే భాగే ఫిర్‌తే హో, భగవాన్ కో తుమ్ క్యా పావోగే...'(లతా), 'మన్ రే తు కాహె నా ధీర్ ధరే' (రఫీ) పాటలు అజరామరమైనవి. 'కాహే తరసాయే జియారా'(లతా, ఆశా), 'సఖి రి మేరా మన్ ఉలఝే తన్ ఢోలే'(లతా), 'ఏ రీ జానే న దూంగీ, మై తో అప్‌నే రసిక్ కో'(లతా) పాటలు ఈ చిత్రంలో చెప్పుకోతగ్గవి.

'దూజ్ కా చాంద్' చిత్రం కోసం రోషన్ స్వరపరిచిన 'ఫుల్‌గేంద్‌వా న మారో , లగత్ కరే జవా'(మన్నాడే), 'మహఫిల్ సే ఉఠ్ జానే వాలో తుమ్ లోగోం'(రఫీ) పాటలు కూడా ఆయనకు మంచి పేరు తీసుకువచ్చాయి.

'బేనజీర్' చిత్రంలో ఎస్.డి.బర్మన్ స్వరపరిచిన 'దిల్ మైఁ ఇక్ జానే -తమన్నా నే జగహ్ పాయీ హై'(రఫీ) పాట మంచి హిట్ అయింది. అయితే 'జిద్దీ' చిత్రం కోసం ఆయన స్వరపరిచిన 'రాత్ కా సమా ఝూమే చంద్రమా'(లతా), 'యే మేరీ జిందగీ, ఇక్ పాగల్ హవా'(లతా) లతో పాటు మెహమూద్ పై మన్నాడే పాడిన 'ప్యార్ కి ఆగ్ మేఁ', 'మై తేరీ ప్యార్ మే క్యా క్యా న బనా(గీతా, మన్నాడే) పాటలు సూపర్‌హిట్ అయ్యాయి.

వి.శాంతారాం స్వంత చిత్రం 'గీత్ గాయా పత్థరోం నే' చిత్రం కోసం రామ్‌లాల్ అద్భుతమైన సంగీతాన్నిచ్చారు. ఈ చిత్రం కోసం ప్రముఖ వాగ్గేయకారిణి కిశోరీ అమోంకర్ పాడిన టైటిల్ సాంగ్ 'సాంసో కే తార్ పర్..గీత్ గా గయా పత్థరోం నే...' పాట హిట్ అయితే మేల్ వర్షన్ పాడిన మహేంద్రకపూర్ కెరీర్‌లో అతి చక్కటి హిట్ గీతం గా ఈ పాట నిలిచింది. అయితే ఈ చిత్రంలోని 'తేరే ఖయాలోం మేఁ హమ్..' పాటతో ఆశా మొత్తం క్రెడిట్ కొట్టేసింది.

'దూర్ గగన్ కీ ఛావ్ఁ మేఁ' చిత్రం కోసం శైలేంద్ర రాసిన 'కోయీ లౌటా దే మేరే బీతే హుయే దిన్'(కిశోర్ కుమార్), 'జిన్ రాతోం కి భోర్ నహీఁ'(కిశోర్‌కుమార్) పాటలతో పాటు కిశోర్ స్వయంగా రాసి, పాడిన 'ఆ చల్ కే తుఝే మైఁ లేకే చలూఁ' పాట కూడా మంచి హిట్ అయింది. ఈ చిత్రానికి కిశోర్ సంగీతాన్నిచ్చారు.

చిత్ర గుప్త 'గంగా కి లెహరేఁ' చిత్రం కోసం చేసిన 'ఛేడోఁ నా మేరీ జుల్ఫే, సబ్ లోగ్ క్యా కహేంగే'(లతా, కిశోర్), 'మైఁ భీ లడ్కీ హూఁ' చిత్రం కోసం చేసిన 'కృష్ణా ఓ కాలే కృష్ణా, తూనే యే క్యా కియా'(లతా), 'మేరా కుసూర్ క్యా హై' కోసం చేసిన 'మేరా కుసూర్ క్యా హై'(లతా) పాటలు హిట్ అయ్యాయి.

'కభీ న కభీ కహీఁ నా కహీఁ'(షరాబీ- రఫీ), 'తుమ్హీ తో మేరి పూజా హో'(సుహాగన్- లతా, తలత్, )'తు మేరే సామ్నే హై'(సుహాగన్-రఫీ), 'అగర్ ముఝ్‌సే మొహబ్బత్ హై'(ఆప్ కి పర్ఛాయియాఁ -లతా), 'నగ్‌మా ఓ షేర్'(గజల్ -లతా), 'రంగ్ ఔర్ నూర్'(గజల్-రఫీ) పాటలు మదన్‌మోహన్ కు మంచి గుర్తింపును తీసుకువస్తే, 'వో కౌన్ థీ', 'హకీకత్', 'జహఁ ఆరా' చిత్రాల కోసం అందించిన సంగీతం ఆయన్ని ఉన్నత స్థానంలో నిలుచోపెట్టాయి.


కిశోరీ అమోంకర్

(వచ్చే సంచికలో మరికొంత)

కూర్పు : తెలికిచర్ల రామకృష్ణ, విజయనగరం, టి.నవీన్, హైదరాబాద్,




సినారె స్పెషల్

23

జులై 29 సినారె పుట్టినరోజుని పురస్కరించుకుని...



అడ్డం:-

1. సి.నారాయణరెడ్డి గారి మూడక్షరాల పిలుపు(3)
3.'.........గా ఒకరాజు........గా ఒకరాణి' (4)
6.'.......... సన్నిధి అదే నాకు పెన్నిధి' (3)
7.'నామది ....... పిలిచింది గానమై వేణు గానమై' (2)
8. '........గొ రాయలసీమ గడ్డ' 'సీతయ్య'లోని పాట (2)
9. "మల్లియలారా మాలికలారా .........గా ఉన్నారా' 'నిర్దోషి' చిత్రం లోని పాట (3)
12. 'ఏ .........జాతమ్ము లీయగలనో సఖీ' ఏకవీరలోని పద్యం (2)
13. '.......... నిన్నే రమ్మని పిలువ చేర రావేల' 'కులగోత్రాలు'చిత్రంలోని గీతం (4)
16. '....... ....... నవ్వులు చిలికిన' 'చదువుకున్న అమ్మాయిలు' సినిమాలోని పాట (2)
17. 'రాగాల ......లోన సిరిమల్లివి సంగీత గగనాన జాబిల్లివి' తూర్పుపడమరలోని పాట (2)
18. 'పతిని కోలు పడి....... దేవి దుఃఖితమతియై రోదించగా' 'చెల్లెలి కాపురం'లోని పాట (2)
20. '......కళారాధనలో వెలిగే చిరు దివ్వెను నేను' 'కళ్యాణి' చిత్రంలోని పాట (3)
22. '....నాన్న నీమనసే వెన్న' 'ధర్మదాత' లోని గీతం (1)
24. '........నల్లని రాలలో ఏకన్నులు దాగెనో' అమరశిల్పి జక్కన్న' సినిమాలోని గీతం (1)
25. 'నీటిలో ఆ రాజు ........ నవ్వెను నేడు' 'ఏకవీర' లోని ఓ గీతంలోని ఓ వాక్యం(2)

నిలువు:-

2. '.......యే మందిరమై నీవే ఒక దేవతవై' నిలువు 5 లోని పాటలో ఒక వాక్యం (3)
3. '........బ్రహ్మయ్యా అన్యాయం చేసావేమయ్యా' (3)
4. ఏ మెరు...... చంటి పాప ఏడ్చును అమ్మాయని' 'చదువురాని వాడవని దిగులు చెందకు' పాటలోని ఓవాక్యం (2)
5. '........దోచుకుందువటే వన్నెల దొరసాని' సి.నారాయణరెడ్డి తొలి చిత్రంలోని హిట్ గీతం(2)
6. '...........తారవో నా అభిమాన తారవో శివరంజని'(4)
8. '........ప్రతీచోట యిలాగే పాడుకుంటాను' (4)
10. '.........కులమేది ఏదీ నేలకు కులమేది' 'కర్ణ(డబ్బింగ్)' సినిమాకు సినారె రాసిన గీతం(3)
11. 'తోటలో నారాజు తొంగిచూసెను ....... ' ఏకవీర చిత్రంలోని పాట (2)
14. ........మనే గాలానికి చిక్కి తేలని ప్రశ్నలు ఎన్నెన్నో ఎన్నెన్నో' స్వరములు ఏడైనా అనే పాటలో ఒక వాక్యం (2)
15. '........రాణివి నీవే సొగసు గాడను నేనే' 'బందిపోటు'లోని పాట (3)
18. 'కనుల ముందున్న.......నాల మూర్తిని విలువలెరుగక విసిరితివి' 'నేడే- ఈనాడే' పాట లోని ఓవాక్యం (2)
19. '......... హాయ్ భళారే వి.......' 'దానవీరశూరకర్ణ'లో దుర్యోధనుడి పాట (2)
21. 'చి...... కనుల తీయని చెలికాడా' 'కులగోత్రాలు' చిత్రంలోని పాట (2)
23. 'ఈ........ల మాటున ఏ గుండెలు మ్రోగెనో' అమర శిల్పి జక్కన్న చిత్రంలోని ఓ గీతం లోని ఓవాక్యం (2)

పంపినవారి పేరు :........................................................................

వయసు :........... వృత్తి :............................................................

చిరునామా :.............................................................................

..............................................................................................

..................................................ఫోన్ :..................................

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ <u>నంబర్‌తోసహా</u> పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...

This feature is sponsored by :

SOHAN MUSIC

పజిల్, కూపన్ 31-07-2004 లోగా చేరాలి

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



రెండవ బహుమతి (ఒక తప్పుతో)



మూడవ బహుమతి (రెండు తప్పులతో)




కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)



# 'సరిగపదమని-21

**జవాబులు**

అడ్డం: 1.చిటపట 3.ముద్ధబంతి 5.రామ 7.నా 10.వానా 11.మావా 12.కన్నె 13.ఆరు 14.పలు 15.గల 18.రెండు 19.పురం 21.దివి 22.తేట 23. కళ్ళ

నిలువు:1.చిన్ని 2.పడమటి 3.ముక్కు 4.బంధం 6.శ్రీవారు 8.బావా 9.ఒక 11.మామా 13.ఆలు 14.పసుపు 15.గట్టుంది 16.రెండుజెళ్ళ 17.తాగితే 20. రంగు

## కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:

మేడా పద్మావతి- విశాఖపట్నం, జి.శ్రీకీర్తన- విశాఖపట్నం, బిహారా శేషశాయి- సత్తెనపల్లి (గుంటూరు), కె.లక్ష్మినారాయణ మూర్తి- నాందేడ్ (మహారాష్ట్ర), కె.సుధాదేవి- చీరాల, ఇందిర సహారె- కళ్యాణ్ (వెస్ట్), సి.వి.ఎస్.నాగమణి- నెల్లూరు, గోసాల వ్యాఘ్రేశ్వరరావు- రాజమండ్రి, ఎల్.వి.వి.ఎస్.భగవాన్‌శాస్త్రి- గండిపాళెం (నెల్లూరు), పసుమర్తి సరస్వతి- నెల్లూరు, కె.నాగేశ్వరి- బళ్ళారి, పి.లక్ష్మి- విజయవాడ, కె.వి.దుర్గమోహనరావు- నల్గొండ, బి.లక్ష్మినరసింహదాస్- హైదరాబాద్, గానుగపాటి సరోజినీదేవి- సికింద్రాబాద్, మండపాక శ్రీదేవి- వైజాగ్, ఎ.బి.వి.ఎస్. రమేష్- వేలూరు (తమిళనాడు), టి.వి.రావు- కొదాడ (నల్గొండ), పి.ఎస్.ఆర్.మూర్తి- హైదరాబాద్, హరి మంగళంపల్లి- హైదరాబాద్, ఉప్పల వెంకటరమణయ్య- కడప, సి.హెచ్.పద్మశ్రీ- హైదరాబాద్, అల్లూరి రామరాజు- విజయవాడ, ఎ.శైలజాకిషోర్- జనగామ (వరంగల్), ఎ.టి.శ్రీనివాసన్- అనంతపూర్, అయ్యగారి రాజశేఖర్- రాజోలు (తూ॥గో॥జిల్లా), వేంద్ర బాలస్వప్న- హైదరాబాద్, ఎ.అదినారాయణ- పోతవరం (గుంటూరు), పి.శ్యామ- హైదరాబాద్, సుమలత.జి- హైదరాబాద్, సి.హెచ్.శ్రీరాం- జోగిపేట (మెదక్), ఉడాలి భాస్కరయ్య- చెన్నై, కె.ఈశ్వర్- నెల్లూరు, వేముల శేఖర్- నిజామాబాద్, యం.బిందుమాధవి- హైదరాబాద్, బి.మంజుల- నెల్లూరు, ముటుకూరు వసుంధర- హైదరాబాద్, మేడా మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, బేరా సతీష్‌కుమార్- నర్సీపట్నం (విశాఖజిల్లా), భండారు వెంకటేశ్వరశర్మ- నందిగామ, కనుపర్తి జగదీశ్- విజయవాడ, నారోజు శంకరాచార్యులు- చిలుకానగర్, సహారె ఈరణ్ణ- ఆదొని, పి.ఉదయభాస్కరరావు & విజయ- రాజమండ్రి, వై.నాగలక్ష్మి- ఎల్లందు (ఖమ్మం), వేంకటేశ్వరరావు ధూర్జటి- మునుగోడు (నల్గొండ), తిరుమల్‌ప్రసాద్- హైదరాబాద్, పేరాల శ్రీవాణి- వైజాగ్, పి.హిమబిందు- బట్టిలంక (తూ॥గో॥జిల్లా), ఎన్.అరుణకుమారి- యలమంచిలి (విశాఖజిల్లా), యు.గున్నేశ్వరరావు- పోగిరి (శ్రీకాకుళం), ఇ.రాము- కర్నూలు, జి.జయచంద్రగుప్త- కర్నూలు, జి.జయలక్ష్మి- కర్నూలు, టి.ఎస్.ఆర్.శర్మ- హైదరాబాద్, పి.శిరీశ్ కుమార్- రాజమండ్రి, రాజ్‌కుమార్ ముగ్గళ్ళ- హైదరాబాద్, రాయచోటి కృష్ణమూర్తి- డోంబివిలి (వెస్ట్) (మహారాష్ట్ర), పి.వేణుగోపాల్ రావు- అచ్చంపేట (మహబూబ్‌నగర్), జోశ్యుల భానుమూర్తి- భీమవరం (ప॥గో॥జిల్లా), కాల్వలక్ష్మిదేవి- డోన్ (కర్నూలు), అర్.శరదాఅననూయ- హైదరాబాద్, సి.విజయసారథి- కర్నూలు, ఎ.ఎమ్.ప్రణవి- హైదరాబాద్, కొంపెల్ల పద్మజారాణి- విశాఖపట్నం, పింగళి అశ్వత్థనారాయణ- ఒంగోలు, ఎన్.శారదా- విశాఖపట్నం, వై.యశోద- విశాఖపట్నం, ఎ.విఘ్నేశ్వరరావు- పర్లాకిమడి (ఒరిస్సా), గంగారపు కళ్యాణి- సత్తెనపల్లి (గుంటూరు), యడ్లపల్లి చంద్రశేఖర్- తెనాలి(గుంటూరు), జి.విజయదుర్గ- వరంగల్, ఎమ్.పురుషోత్తమాచార్య- నల్గొండ, ఎమ్.అంజిరెడ్డి- ఒంగోలు.

## ఒక తప్పుతో వ్రాసిన వారు:

ఎస్.సమీర- హైదరాబాద్, ఎమ్.బదరాలక్ష్మి- బొబ్బిలి, వేలివెంటి నాగస్వర్ణ- తెనాలి(గుంటూరు), ఎన్.రాదాకామేశ్వరి- హైదరాబాద్, కె.బాలసుబ్రహ్మణ్యం- శ్రీకాకుళం, అప్పన సత్యవెంకటకృష్ణారావు- ధవళేశ్వరం (తూ॥గో॥జిల్లా), సామంచి శ్రీరాధ- విశాఖపట్నం, మంచెం విజయ- కాకినాడ, తాడి రంగారావు- రాజమండ్రి, యు.యు.యు.- ఎమ్మిగనూరు, కె.వసంతకుమార్- దేవరకొండ, డి.హరికృష్ణ- చీరాల (ప్రకాశం), గర్రేపల్లి వెంకటరావు- హైదరాబాద్, డి.సబిత- బోడుప్పల్, వై.భానుప్రసాదు- కర్నూలు, కె.జ్యోతిశర్మ- కర్నూలు, నెల్లూట్ల రమాదేవి- హన్మకొండ (వరంగల్), తాళ్ళూరి జయదేవ్- శాంతినగర్ (నిజామాబాద్), శెట్టిపల్లి రామ్‌మోహన్- వెంకటగిరి (నెల్లూరు), ఎమ్.నాగేశ్వరరావు- విశాఖపట్నం, మున్నంగి కుసుమ- గజియాబాద్ (ఉత్తరప్రదేశ్), ఉప్పులూరి సుబ్బారావు- మొగలికుదురు, మద్దాలి సువర్చలా శ్రీనివాస్- హైదరాబాద్, యం.పి.ధర్మరాజు- నల్గొండ, పి.వి.ఎస్.ఎన్.శర్మ- హైదరాబాద్, పాలకోడేటి గౌరి- హైదరాబాద్, బి.ఉమాదేవి- అదోని, మల్లంపల్లి రాధిక- హైదరాబాద్, మంత్రిప్రగడ సందీప్- నల్గొండ, కె.కె.విశ్వనాథం- హైదరాబాద్, జి.విజయలక్ష్మి- సికింద్రాబాద్, జన్ను బాబురావు- గుడివాడ, చివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రి- ఒంగోలు, మైసూరు కీర్తన- మదనపల్లి, ఎం.వి.యస్.లక్ష్మి- కాకినాడ, ఎ.శివకుమార్- తిరుపతి, సాలాదేవి రాహుల్- విశాఖపట్నం, ఎమ్.వి.రాఘవమూర్తి- రాజమండ్రి, సి.హెచ్.రామమెహన్‌రావు- విశాఖపట్నం, జె.అహల్య- హైదరాబాద్, ఎమ్.కోటేశ్వరరావు- కాశీపూర్ (ఉత్తరాంచల్), ఎస్.విశాల్- అనకాపల్లి, సి.హెచ్.పరాత్పరరావు- ఏలూరు (ప॥గో॥ జిల్లా), ఎస్.శేషకుమారి- దేవాపూర్(ఆదిలాబాద్), కె.వి.ఎల్.నరసింహశాస్త్రి - హైదరాబాద్, కె.వి.శరవనకుమార్- సోదాం (చిత్తూరు), కె.వి.సరస్వతి- హైదరాబాద్, ఎమ్.మాధురిరంగారావు- నల్గొండ, తాళ్ళూరి రాధ- హైదరాబాద్, ఆత్కూరి వెంకటశరత్‌కృష్ణ- హైదరాబాద్, జి.ముత్తుమారన్- విజయవాడ, బి.వి.వి.సత్యవాణి- హైదరాబాద్, కె.శాంతాకృష్ణరావు- నవరంగ్‌పూర్ (ఒరిస్సా), తాతిరాజు రమణి- బెర్హంపూర్ (ఒరిస్సా), వి.మురళికృష్ణ- న్యూఢిల్లీ, ఎస్.సూర్యనారాయణ- హైదరాబాద్, వి.వి.సూర్యనారాయణమూర్తి- కాకినాడ, పర్చా వాసుదేవరావు- దేవరకొండ (నల్గొండ), కోడూరు సత్యనారాయణ- కడప, ఎమ్.వి.ఆర్.కె.కృష్ణ- పాలపట్నం (శ్రీకాకుళం), కె.అహిలలిత- విశాఖపట్నం, అద్దంకి శ్రీరామచంద్రమూర్తి- హైదరాబాద్, అద్దంకి సీతాదేవి- హైదరాబాద్, కె.వి.ఎన్.ఎస్.భగవాన్- రాజమండ్రి, మారం ఉమామహేశ్వర్- హైదరాబాద్, శివనాద్రి నీలిమ- హైదరాబాద్, కె.సరోజినీదేవి- హైదరాబాద్, టి.శ్రీధర్- విజయనగరం, విజయా కిశోర్- 8ఇంక్లైన్ కాలనీ (కరీంనగర్), పుణ్యాల రాజ్యలక్ష్మి- సత్తెనపల్లి, కర్రి ఝన్సీ- హైదరాబాద్, కొండదాడి సుగుణాకరరావు- విశాఖపట్నం, సి.హెచ్.శ్వేత- చీపురుపల్లి (విజయనగరం), కె.ఈశ్వర్- నెల్లూరు, పుణ్యాల లక్ష్మి- సత్తెనపల్లి, బోలెం సత్యనారాయణ- చినఓగిరాల(కృష్ణా), కె.నీరజదీపిక- హైదరాబాద్, టి.విజయలక్ష్మి- హైదరాబాద్, లుంబూరు లక్ష్మిప్రసాద్- హైదరాబాద్, ఎ.అన్నపూర్ణ- హైదరాబాద్, పి.వి.వి.ఆర్‌ప్రతాప్- చీపూరుపల్లి, బి.కవిత- తిరుపతి, ఎస్.విజయలక్ష్మి- హైదరాబాద్, కె.వి.రమణారెడ్డి - హైదరాబాద్, ఇప్పగుంట వెంకటశ్రీనివాసరావు- హైదరాబాద్, ఆర్.సాయిప్రసాద్- హైదరాబాద్, పి.అరుంధతి- విశాఖపట్నం, సాదినేని వెంకటేశ్వర్లు- కాజీపేట (వరంగల్), జె.రేణుకాదేవి- హైదరాబాద్, పప్పు అప్పారావు- శ్రీరాంనగర్ (విజయనగరం), జి.వి.రమణమూర్తి- హైదరాబాద్, సి.ఎస్.కిరణ్- రాజమండ్రి, వరయోగి రామ్‌మోహన్‌రావు- సికింద్రాబాద్, ఎ.ఎస్.రెడ్డి- నెల్లూరు, ముప్పిరాల వెంకటరమణ- హైదరాబాద్, పద్మాకృష్ణ- హైదరాబాద్.

## రెండు తప్పులతో వ్రాసిన వారు:

నేమాన సుభాష్ చంద్రబోస్- శ్రీకాకుళం, జి.సత్యవతీ సుజాత- బొబ్బిలి (విజయనగరం), వంగా పద్మజ- విజయవాడ, ఎన్.జగన్మోహనరావు- కరీంనగర్, శ్రీవాణి నేమాని- విజయవాడ, కె.సీతారామగిరి- కాకినాడ, పి.వి.ప్రవీణ్ - వేముగుంటవారి వీధి, ఆర్.హారీతబందు- నెల్లూరు, బొగ్గవరపు లక్ష్మిసింధూజ- ధూలిపూడి (గుంటూరు), జి.పార్వతి- రాజమండ్రి, పైడిపల్లి గోపి- విశాఖపట్నం, పైడి లక్ష్మికాంతరావు- అనంతపురం, ఎస్.వేణుగోపాల్- హైదరాబాద్, జైదేవ్ ప్రసాద్- గార్లా (ఖమ్మం), ఉమాదేవి కరణం- కర్నూలు, ఆర్.పుల్లాయమ్మ- తెనాలి, జి.పాండురంగశర్మ- హైదరాబాద్, కె.సౌందర్యవల్లి- విజయవాడ, కె.రఘునాథాచార్లు- కడప, ఎ.ఎస్.అవధాని- హైదరాబాద్, పార్నంది వెంకట సూర్య- విశాఖపట్నం, మామిడి మహేంద్ర- పూణే, కొడమంచిలి ప్రవీణ్‌కుమార్- అలమూరు (ప॥గో॥జిల్లా), పి.నిరాలంబ మూర్తి- బుచ్చిరెడ్డిపాలెం (నెల్లూరు), ఎం.మారుతిశాస్త్రి- చింతలపూడి (గుంటూరు), ఎల్.వెంకటేశ్వర్లు- తిరుపతి, ఎన్.తులసి- హైదరాబాద్, శ్రీనివాస్‌పవార్- ఆర్మూర్ (నిజామాబాద్), మరువాడ కామేశ్వరరావు- మంచిర్యాల, సత్యవతిపప్పు- బెర్హంపూర్ (ఒరిస్సా), అలకనంద.వి- కాకినాడ, ఎ.ఎల్.నంచారమ్మ - హైదరాబాద్, పి.జయప్రకాష్- హైదరాబాద్, ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ (కృష్ణా), పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), ఎ.దుర్గ- గుంటూరు, వి.సుబ్రహ్మణ్యం- హైదరాబాద్, వి.రాగచంద్రిక- నారావల్లి(రంగారెడ్డి), ఎ.మల్లేశ్వరమ్మ- హైదరాబాద్, కె.నాగేశ్వర్ రెడ్డి- జయపూర్ (ఒరిస్సా), పి.రంగానాథరావు- విజయవాడ, పసుమర్తి పద్మనాభం- హైదరాబాద్.

## మూడు తప్పులతో వ్రాసిన వారు:

సోమయాజుల వెంకటసాయి- ఒనకఢిల్లి(ఒరిస్సా), వై.కె.మూర్తి- విజయవాడ, వై.రాజానాయుడు- పెద్దచెన్నయ్యగారిపల్లె (చిత్తూరు), టి.కిరణ్‌కుమార్- గుంటూరు, కె.కృష్ణమూర్తి- సికింద్రాబాద్, ఎమ్.డి.లతీఫ్- నాచారం (రంగారెడ్డి), వానస్తరామచంద్ర- నెల్లూరు, జూవ్వాడి రూపవతిదేవి- గుంటూరు, కె.మురళిమోహన్- మర్కాపూర్ (ప్రకాశం), గౌర్తి రాణి- రాయగడ, పి.పాపారావు- విశాఖపట్నం, ఎమ్.డి.షబ్బం- నెల్లూరు.

# అలాంటి గాయకుడు నభూతో నభవిష్యతి

మహమ్మద్ రఫీ పేరు తెలియని భారతీయుడు ఉండడు. మన తెలుగు వారికి కూడా కనీసం 'నా మది నిన్ను పిలిచింది గానమై' పాటయినా గుర్తుంటుంది. రఫీ జీవిత చరిత్ర అంటూ వివరంగా ఏదీ లేదు. ఒక విధంగా అతని జీవిత చరిత్ర అంటే అతని గాన చరిత్రే. ఏ మసాలాలు, మెలోడ్రామాలు లేని సాదా సీదా జీవితం అతనిది. దానికి పరిస్థితులు, బహుశ అతని స్వభావం రెండూ కారణమే. అతని గొప్పతనం రెండింట్లో మనకు దర్శనమిస్తుంది.

1. అతని అసాధారణ గాన ప్రతిభ. 2. సౌమనస్యం, ప్రశాంత చిత్తం; హుందాతనాలతో కూడిన అతని వ్యక్తిత్వం.ఈ రెండింటికీ కారణం అతన్ని అడిగితే మాత్రం 'అల్లా దయే' అని సమాధానమిచ్చేవాడేమో. అతని దైవభక్తి, వినమ్రత అలాంటివి.

రఫీ జీవిత చరిత్రలో డ్రామా లేదు. అతని పాడే విధానంలో ఉంది. రఫీ యవ్వనంలో ప్రచారం పొందిన రొమాన్సు ఉందో లేదో, అతని కంఠ స్వరం ఒంపులో మాత్రం అది పుష్కలంగా ఉంది. రఫీ జీవితపు మలుపుల్లో పెద్ద విషాద సంఘటనలు లేవు. అతని మంద్రస్వరంలో, పదాలు పలికే లోతుల్లో అది అనివార్యంగా ఉంది. అతని జీవితంలో అపురూపమైన సంఘటనలు, సన్నివేశాలు పెద్దగా లేవు. అతను పాడిన ప్రతి పాటా, శ్రోతకు అపురూపమే. అపూర్వమే. అందుకే రఫీ పాడిన పల్లవే అతని జీవితంలో మలుపు. అతను పాడిన చరణమే జీవితంలో చేరుకున్న లక్ష్యం.

అతి నిరాడంబరంగా జీవించిన అతను పాటల్లో కురిపించిన అట్టహాసం ఇంతింత కాదు. అతి వినమ్రంగా మాట్లాడిన అతను పాటల్లో చూపించిన ధీమా, ధాటి ఎవరికీ తీసిపోవు. అందరికీ పాడ్డం ఒక కళ అయితే, పాటలోనే జీవితమంతా ఇమిడేలా చేసుకోవడం రఫీ నేర్చిన కళ. అందుకే అతని వ్యక్తిత్వం, అతని జీవితం అన్నీ అతని పాటే. ఇంతా చేసి అతను లతా మంగేష్కర్ లా, తలత్ మెహమూద్‌లా కొంత కాలమైనా నటించలేదు. కిశోర్ కుమార్ లా పాడుతూ, ఆడుతూ, స్వరరచన చేస్తూ సకల కళా సామ్రాట్టు కాలేదు. హేమంత్ కుమార్, మన్నాడే లలా సంగీత దర్శకత్వం వహించలేదు. (ఒకటో,రెండో ప్రైవేటు రికార్డులకు తప్ప) ఒట్టి పాటలు పాడాడు. కానీ ఆ పాడిన ఒట్టి పాటలే శ్రోతలకు తరతరాలకు తరగని ఆనందాన్నిచ్చే గనులయ్యాయి. అలాంటి రఫీ గాయక జీవితాన్ని విహంగ వీక్షణంలా ఒక్కసారి పరికించి చూస్తే....



మహమ్మద్ రఫీ జీవితంలో,ఇందాకే చెప్పినట్లు సస్పెన్సులూ,థ్రిల్లులూ లేవు. అతని కంఠస్వరంలోని మాధుర్యమే మనల్ని రోమాంచితం చేస్తుంది. అతని ఉచ్చారణ లోని వైదగ్ధ్యమే మనలో థ్రిల్లింతలు కలిగిస్తుంది. అతను జీవితంలో ఏ థ్రిల్లు ఎంతవరకు అనుభవించాడో మనకు తెలీదు కానీ, అతని హావభావాలు, గానేకీ అందాజ్, మనల్ని పరవశుల్ని చేస్తాయి. అవి ఎలా ఎందుకు చేస్తాయో, అతను పాడే విధానంలో విలక్షణత ఏమిటో చర్చించుకునే ముందు, అతని జీవిత చరిత్రను అలా అలా సమీక్షిస్తే....

| | |
|---|---|
| **చిత్రం** | **: చిత్రలేఖ** |
| **రచన** | **: సాహిర్ లుధియాన్వి** |
| **సంగీతం** | **: రోషన్** |
| **గానం** | **: మహమ్మద్ రఫీ** |

మన్‌రే తూ కాహే నా ధీర్ ధరే
వో నిర్‌మోహీ మోహ్ న జానే,
జిన్‌కా మోహ్ కరే
మన్‌రే...
ఇస్ జీవన్ కీ చఢ్‌తీ ఢల్‌తీ
ధూప్ కో కిస్‌నే బాంధా
రంగ్ పే కిస్‌నే పెహరే డాలే
రూప్ కో కిస్‌నే బాంధా
కాహే యే జతన్ కరే... ॥మన్‌రే॥
ఉత్‌నా హీ ఉప్‌కార్ సమఝ్
కోఈ జిత్‌నా సాథ్ నిభాదే
జనమ్ మరణ్ కా మేల్ హై సప్‌నా
యే సప్‌నా బిస్‌రాదే
కోయీ న సంగ్ మరే... ॥మన్ రే॥



చిత్రం : గైడ్
సంగీతం : సచిన్ దేవ్ బర్మన్

రచన : శైలేంద్ర
గానం : మహమ్మద్ రఫీ

దిన్ ఢల్ జాయె హాయ్
రాత్ న జాయ్
తూ తోన ఆయే
తేరి యాద్ సతాయ్ ॥దిన్ ఢల్ జాయె॥
ప్యార్ మేఁ జిన్‌కే సబ్ జగ్ ఛోడా
ఔర్ హుయే బద్‌నామ్
ఉన్‌కే హీ హాథోఁ హాల్ హువా యే
బైఠే హైఁ దిల్ కో థామ్
అప్నే కభీ థే
అబ్ హైఁ పరాయి ॥దిన్ ఢల్ జాయె॥
ఐసీ హీ రిమ్‌ఝిమ్ ఐసీ ఫుహారేఁ
ఐసీ హీ థీ బర్సాత్
ఖుద్ సే జుదా ఔర్ జగ్ సే పరాయే
హమ్ దోనోఁ థే సాథ్
ఫిర్ సే వో సావన్
అబ్ క్యోఁ న ఆయ్ ॥దిన్ ఢల్ జాయె॥
దిల్‌కే మేరే పాస్ హెూ ఇత్నే
ఫిర్ భీ హెూ కిత్నీ దూర్
తుమ్ ముఝ్‌సే, మైఁ దిల్ సే పరేషాఁ
దోనోఁ హైఁ మజ్‌బూర్
ఐసే మేఁ కిస్‌కో
కౌన్ మనాయ్ ॥దిన్ ఢల్ జాయె॥



మహమ్మద్ రఫీ 1924 డిసెంబర్ 24వ తేదిన ప్రస్తుతం పాకిస్తాన్ లో ఉన్న పంజాబ్‌లోని కొట్లా సుల్తాన్ సింగ్ గ్రామంలో జన్మించాడు. తన ఏడవ ఏట ఒక ఫకీరు, వీధిలో ఎక్ తారా మీటుతూ, పాడుతూ వెళూంటే,అతని వెంటే పరిగెత్తి మొత్తం పాట మనసులో నింపుకుని, తిరిగి ఇంటికి వచ్చి, తన వాళ్ళందరికీ తు.చ. తప్పక, అద్భుతంగా పాడి వినిపించడంతో సంగీతంతో రఫీ అనుబంధం ప్రారంభమైనది. ఆ ఫకీరే అతని తొలి గురువు. ఆ తర్వాత తన 14వ ఏట లాహోర్ కు తరలి, అక్కడ ఖాన్ అబ్దుల్ వజీద్‌ఖాన్, జీవన్ లాల్ మట్టో, గుల్షన్ అలీఖాన్‌ల వద్ద శాస్త్రీయ సంగీతం అభ్యసించాడు. రఫీని మొదట్నుంచి ప్రోత్సహించింది అతని సోదరుడు. రఫీ పాటల పిచ్చికి తండ్రి వ్యతిరేకమైనా, తమ్ముణ్ణి ప్రోత్సహించి అతను బొంబాయికి వెళ్ళడానికి కారకుడైంది ఈ సోదరుడే. అంతకు ముందే, రేడియో లాహోర్ కు రఫీని పరిచయం చేసిన ఘనత సంగీత దర్శకుడు ఫిరోజ్ నిజామీ (తర్వాత జుగ్నూ సినిమాలో 'యహా బదలా వఫాకా' అన్న యుగళ గీతాన్ని నూర్జహాన్ తో పాడే అవకాశం ఇచ్చిన మహానుభావుడు) కి దక్కుతుంది. రఫీ 1944లో 'గుల్ బలోచ్' అనే పంజాబి సినిమాకు పాడడంతో చిత్రరంగ ప్రవేశం చేసాడు. అదే సంవత్సరం బొంబాయికి రాగానే అతన్ని అక్కున చేర్చుకుని, అతని అనంతర విజయాలకు నాంది పలికిన వ్యక్తి నౌషాద్. 'పెహలే ఆప్' సినిమాలో మొదట కోరస్ పాడ్డంతో హిందీ సినీరంగ ప్రవేశం చేసాడు రఫీ. 1944నుంచి1980 జూలై 31 లో చనిపోయే వరకూ, హిందీ చలన చిత్ర రంగానికి రఫీ తన గానం ద్వారా అందించిన నవ్యత, ప్రామాణికత, సృజనాత్మకత అనితర సాధ్యమైనవి. అందుకే అతనికి ఎందరో అనుకర్తలున్నారు కానీ ఒక్క వారసుడు కూడా లేడు.

రఫీ ఎన్ని పాటలు పాడాడన్న విషయంపై అనేక అభిప్రాయాలున్నాయి. భారతీయులకు ఎంతో ఇష్టమైన అతిశయోక్తి అలంకారం ఇక్కడ బాగా పనిచేసింది. 10వేల నుంచి 26వేల వరకు ఈ పాటల సంఖ్య పెరుగుతూనే వచ్చింది. అదేమీ కాదు, రఫీ పాడింది నాలుగువేల తొమ్మిది

చిత్రం : చౌదవీఁకా చాంద్
సంగీతం : రవి

రచన : షకీల్ బదాయూనీ
గానం : మహమ్మద్ రఫీ

చౌదవీఁకా చాంద్ హో
యా ఆఫ్‌తాబ్ హో
జో భీహో తుమ్ ఖుదా కీ కసమ్,లాజవాబ్ హో ॥చౌదవీఁ॥
జుల్ఫేఁహైఁ జైసే కాంధోఁపే బాదల్ ఝుకే హువే
అంఖేఁ హై జైసే మయ్‌కే ప్యాలే భరే హువే
మస్తీ హై జిస్ మేఁ ప్యార్‌కీ తుమ్ వో షరాబ్ హో ॥చౌదవీఁ॥
చెహరా హై జైసే ఝీల్ మేఁహఁస్‌తా హువా కవఁల్
యా జిందగీ కే సాజ్ పే ఛేడీ హుయీ గజల్
జాన్-ఎ-బహార్ తుమ్ కిసీ షాయర్‌కా ఖ్వాబ్‌హో ॥చౌదవీఁ॥
హోంఠోఁపే ఖేల్‌తీ హై తబస్సుమ్‌కీ బిజ్‌లియాఁ
నజ్రేదే తుమ్హారీ రాహ్ మేఁ కర్ తీ హై క హకషాఁ
దునియా -ఎ-హుస్న్-ఒ-ఇష్క్‌కా తుమ్ హీ షబాబ్ హో ॥చౌదవీఁ॥











| | | | |
|---|---|---|---|
| చిత్రం | : బైజూ బావ్‌రా | రచన | : షకీల్ బదయూనీ |
| సంగీతం | : నౌషాద్ | గానం | : మహమ్మద్ రఫీ |



భగ్‌వాన్.. భగ్‌వాన్... భగ్‌వాన్
ఓ దునియాతే రఖ్‌వాలే
సున్ దర్ద్‌భరే మేరే నాలే ...
సున్ దర్ద్‌భరే మేరే నాలే
ఆశ్ నిరాశ్ కే దో రంగోంసే దునియా తూనే సజాయీ
నయ్యా సంగ్ తూఫా బనాయా, మిలన్ కే సాథ్ జుదాయీ
జా దేఖ్‌లియా హర్‌జాయీ
ఓ.. లుట్‌గయీ మేరే ప్యార్ కీ నగరీ
అబ్‌తో నీర్ బహాలే ॥3॥ ॥ఓ దుని॥
ఆగ్ బనీ సావన్ కీ బర్‌సా, ఫూల్ బనే అంగారే



నాగన్ బన్ గయీ రాత్ సుహానీ, పత్థర్ బన్ గయే తారే
సబ్ టూట్ చుకే హై సహారే
ఓ... జీవన్ అప్‌నా వాపస్ లేలే జీవన్ దేనేవాలే.. ॥ఓ దుని॥
చాంద్ కో ఢూంఢే పాగల్ సూరజ్, శామ్‌కో ఢూండే సవేరా
మై భీ ఢూండూ ఉస్ ప్రీతమ్‌కో, హోన సకా జో మేరా
భగవాన్ భలా హో తేరా
ఓ..కిస్మత్ ఫూటీ ఆస్ న టూటీ
పాంవ్‌మే పడ్‌గయే ఛాలే.. ॥ఓ దుని॥
ఆ... ఆ... ఆ... ఆ...
మహల్ ఉదాస్ ఔర్ గలియా సూనీ, చుప్‌చుప్ హై దీవారే



దిల్ క్యా ఉజ్‌డా దునియా ఉజ్‌డీ, రూఠ్‌గయీ హై బహారే
హమ్ జీవన్ కైసే గుజారే
ఓ... మందిర్ గిర్‌తా ఫిర్ బన్‌జాతా
దిల్ కో కౌన్ సంభాలే.. ॥ఓ దుని॥
ఓ దునియాతే రఖ్‌వాలే ..
రఖ్‌వాలే...
రఖ్‌వాలే...
రఖ్‌వాలే...



వందల చిల్లరేనని ఇటీవల కొందరు అభిమానులు తేల్చారు. కనీసం అయిదారు వేల పాటల జాబితా తన వద్ద ఉందని మరో అభిమాని హామీ. నిజం చెప్పాలంటే, పాటల సంఖ్య ముఖ్యం కాదు. ఒక్కొక్క పాట శ్రోతపై వేసే ప్రభావం మనకు కావాలి. 1945 లో పాడిన 'జుగ్నూ' పాట కూడా ఈనాటికీ మనకు చెవులూరిస్తుంది. మరో వందేళ్లకూ అదే ప్రభావంతో ఉంటుంది. గణించుకోవాల్సింది ఆ పాటల ఆయుష్షును, ఆ శ్రోతల సంఖ్యనే.

అతని పాటల సంఖ్య నాలుగు వేలు కానీ, పద్నాలుగు వేలు కానీ, ఇంతగా, ఇన్నేళ్ళ బట్టి మనల్ని అంతగా ఆకర్షించే, మన మనసుల్ని పాదరసంలా కరిగించే మహమ్మద్ రఫీ కంఠంలోని ఆ ప్రత్యేకత ఏమిటి? అతన్ని ఎన్ని సార్లు విన్నా, ఎందుకు విసుగనిపించదు? చౌదవీకా చాంద్ (చౌదవీకా చాంద్ సినిమా) 'దునియాకే రఖ్ వాలే' (బైజూ బావరా) 'జిందగీ భర్ నహీ భూలేగి' (బర్సాత్ కీ రాత్) 'దిన్ ఢల్ జాయే హాయే'(గైడ్) 'ఎహ్ సాన్ తేరా హోగా ముఝుపర్'(జంగ్లీ).... ఇలా ఎన్నో పాటలు ఎన్ని సార్లు విన్నా,'అమృత భరితము,రఫీ గానము' అనేలా ఎందుకుంటాయి?

రఫీ జీవిత చరిత్రను తెలుసుకోవడమంటే, అతని గానసరళిని అర్థం చేసుకోవడం. అతని జీవితలక్ష్యాన్ని తెలుసుకోవడమంటే, అతని పాటల ప్రభావాన్ని అర్థం చేసుకోవడం. అతని స్మృతికి నివాళులర్పించడమంటే, అతని గానాన్ని మరీ మరీ మననం చేసుకోవడం, అతని గాన వైదుష్యాన్ని విశ్లేషించుకోవడం. ఇలా విశ్లేషించుకోడానికి మన దగ్గర తగినన్ని తూనిక రాళ్ళు లేవు. దొరకవు కూడా. ఎంత తేలిపోతున్నట్లయినా పాడగలడు(మస్తీ మే చేడ్ కే తరానా కోయి దిల్ కా-హకీకత్), ఎంత భావ గాంభీర్యంలో మునిగిపోయి అయినా పాడగలడు(మన్ రే తు కాహేనా ధీర్ ధరే-చిత్రలేఖ). ఎంత ఎత్తులకైనా ఆ కంఠ స్వరాన్ని ఎదిగించగలడు (జిందాబాద్ ఐ మొహబ్బత్ జిందాబాద్-మొఘలే అజమ్), ఎంత గుసగుసలైనా చెప్పగలడు (మేరీ దునియా మే తుమ్ ఆయే, క్యా క్యా అప్నే సాథ్ లియే- హీర్ రాంఝూ).

అతను ఒక్క వేషమూ వెయ్యకపోయినా, ఆ గొంతు ఎన్ని వేషాలేసిందో, ఎన్ని వయ్యారాలు పోయిందో. ఎంత కుమిలి పోయి ఏడ్చిందో, ఎంత పగలబడి నవ్విందో. ఎంత గునిసిందో, ఎంత అలిగిందో. ఎంత ఆనందించిందో,ఎంత పరవశించిందో. ఎంత నిస్పృహ చెందిందో. ఎంత ధైర్యం వహించిందో. ఎంత ఆత్మార్పణ చేసుకుందో. ఎంత స్వాభిమానంతో విరుచుకు పడిందో.....

ఇన్నీ చేసిన రఫీ అవన్నీ ఎలా చేసాడో, ఎంత బాగా చేసాడో అర్థం చేసుకోవడాని ప్రయత్నించడం, అతను మనకిచ్చిన అపురూపమైన పాటల ఖజానాను మళ్ళీ మళ్ళీ గుర్తు చేసుకుంటూ ముందుకు వెళ్ళడం అభిమానులుగా మనం ఆనందంగా నిర్వహించే కర్తవ్యం.

ఏమో. మన విశ్లేషణలు, మన పలవరింతలు, మన పిలుపులు వినిపించి, ఎక్కడో, ఎప్పటికో అతను మళ్ళీ జన్మిస్తాడేమో. 'తుమ్ నే పుకారా ఔర్ హమ్ చలే ఆయే' అని మనల్ని తన రాకతో పునీతుల్ని చేస్తాడేమో.

**- మృణాళిని**

**రఫీ గాన వైదుష్యాన్ని ఇంకొక కోణంలో వివరించే మరొక వ్యాసం వచ్చే సంచికలో...**

# ఇవాళ నన్ను 'జానూ' అనటం మర్చిపోయి 'ఫాతిమా' అంటున్నారు

**- జాహ్నవి**



**టీవీ ప్రేక్షకులకు జాహ్నవి అంటే ఎవరో ప్రత్యేకంగా పరిచయం చెయ్యనవసరం లేదు. ఇటీవల విడుదలైన 'యజ్ఞం' లో ఆమె ప్రేక్షకులను హాయిగా నవ్వించే పాత్రలో సునాయాసంగా నటించింది. థియేటర్‌లో ఆమె ధరించిన ఫాతిమా పాత్రకు జనం చాలా మంచి రెస్పాన్స్ ఇస్తున్నారు. కామెడీని చక్కగా పండించటంలో మరొక నటి తెలుగు తెరకు లభించిన సందర్భంగా జాహ్నవిని 'హాసం' ఇంటర్వ్యూ చేసింది. ఆ వివరాలివిగో...**

**✦ 'యజ్ఞం'లో మిమ్మల్ని తీసుకోవడం ఎలా జరిగింది?**

యాక్చువల్‌గా డ్యాన్స్ బేబీ డ్యాన్స్ షూటింగ్ అన్నపూర్ణా స్టూడియోలో జరుగుతోంది. అక్కడకు 'యజ్ఞం' చిత్రం అసిస్టెంట్ డైరెక్టర్, కాస్ట్యూమర్ వచ్చారు. నా షూటింగ్ రాత్రి 9 గంటలకు పూర్తయిపోయింది. అక్కడనుంచి 'యజ్ఞం' ఆఫీస్‌కు వారు నన్ను తీసుకెళ్లారు. అప్పుడు నిర్మాత పోకూరి బాబూరావుగారు, దర్శకుడు రవికుమార్ చౌదరి గారు ఉన్నారు. వాళ్లు 'క్యారెక్టర్ ఉంది చేయగలవా' అని అడిగారు. 'చేయగలను' అన్నాను. నా యాంకరింగ్‌గాని, నా ప్రవర్తన గానీ జోవియల్‌గా ఉంటుంది. ఈ సినిమాలో ఫస్ట్ అంతా జోవియల్‌గా ఉన్నా సీరియస్ కామెడీ కదా ...అందుచేత నవ్వు అన్నది నా ఫేస్‌లో కనిపించకుండా సీరియస్ కామెడీ చేయగలనా లేదా అన్న సందేహంతో వాళ్లు ఓ డైలాగ్ ఇచ్చి, దాన్ని చెప్పమన్నారు. ఆ డైలాగ్ చెప్పిన తర్వాత...నెక్స్‌డే మార్నింగ్ 6గంటలకు షూటింగ్‌కు రమ్మన్నారు. అలా 'యజ్ఞం' సినిమాలో సెలెక్ట్ చేశారు.

**✦ మొదటిరోజు ఏ సీన్స్ చేశారు?**

మొదటిరోజు షూటింగ్... నానక్‌రామ్‌గూడా రామానాయుడు స్టూడియోలో జరిగింది. హీరో మమ్మల్ని హాస్టల్ నుండి హీరోయిన్ ఫాదర్ ఇంటికి తీసుకువస్తాడు. 'మీ పేరేమిటమ్మా' అని హీరోయిన్ ఫాదర్ అడుగుతారు. ఫ్రెండ్స్ అంతా చెబుతుంటే నేను దాక్కుంటూ బయటకు వస్తూ తప్పించుకోడానికి ట్రై చేస్తాను కదా అదే నాకు ఫస్ట్ షాట్. మొత్తం అక్కడ 10 రోజులు షూటింగ్ జరిగింది. ఈ 10 రోజులలో హీరో, హీరోయిన్స్ కాంబినేషన్‌తో ఉన్న నా సీన్స్, ధర్మవరపు సుబ్రహ్మణ్యం గారితో సీన్స్ అన్నీ అక్కడే జరిగాయి.

**✦ ధర్మవరపు సుబ్రహ్మణ్యం లాంటి టైమ్ సెన్స్ విపరీతంగా ఉన్న కామెడీ ఆర్టిస్ట్‌తో.... ఎలా తూగ గలిగేరు?**

అప్పుడప్పుడు పొరపాటున మధ్యలోనే నవ్వేసేదాన్ని. ఒక సీన్‌లో ధర్మవరపు సుబ్రహ్మణ్యం గారితో 'ఇక్కడ గుడులు ఉంటాయా... క్యా..' అంటాను. అప్పుడు ఆయన 'ఊరు అన్నాక గుడి, బడి ఉండదు క్యా..' అంటారు. 'అయితే మసీదు కిదర్ హై' అంటాను. 'వెళ్తే ఉదర్ హై' అని ఆయన అంటారు. వెళ్తే ఉదర్ హై అనగానే....నాకు నవ్వొచ్చింది. మైనస్సో, ప్లస్సో తెలీదు కానీ నాకు నవ్వు ఎక్కువ. 24 గంటలూ నవ్వుతూనే ఉంటాను. కామెడీ చేయడం అలవాటు లేదు. అంచేత నేను చెప్పే డైలాగ్స్‌కి కూడా నవ్వేసేదాన్ని. దానికి డైరెక్టర్‌గారు కోప్పడకుండా 'ఫర్వాలేదురా ...ఇంకో టేక్ తీసుకుందువుగానీ.. నో ప్రాబ్లం' అనేవారు. బాబూరావు గారు వచ్చి 'నవ్వొస్తే కంట్రోల్ చేసుకోవాలమ్మా. కంట్రోలింగ్ అనేది చాలా ముఖ్యం. మనం ఏది అక్కడ చేయాలో అదే చేయాలి...'అని చెప్పి చాలా సెటిల్డ్‌గా చేయించేవారు.

**✦ అసలు టీవీ ఫీల్డ్‌లోకి ఎలా వచ్చారు?**

మా ఫ్యామిలీలో ఎవరికీ ఇండస్ట్రీతో టచ్ లేదు. జెమినీ వాళ్లు డ్రీమ్‌గర్ల్ కాంటెస్ట్ అని ఒకటి పెట్టారు. ఆ సెలక్షన్స్ కోసం విజయవాడ వచ్చారు. మా మదర్ బ్యుటీషియన్ కాబట్టి నన్ను తీసుకెళ్లారు. అది చూసి వాళ్లు "డ్యాన్స్ బేబీ డ్యాన్స్ సెలక్షన్స్ కూడా నెక్స్ డే జరుగుతాయి. డ్యాన్స్ వస్తే రావచ్చు" అన్నారు. బేసికల్‌గా నేను క్లాసికల్ డ్యాన్సర్‌ని. కూచిపూడి వచ్చు. కోరాడ నరసింహారావుగారి వద్ద ఏలూరులో నేర్చుకున్నాను. డ్యాన్స్ వచ్చు కదా అని క్యాజువల్‌గా 'డ్యాన్స్ బేబీ డ్యాన్స్'లో పార్టిసిపేట్ చేశాను. హైదరాబాద్ వచ్చిన తర్వాత ఫైనల్ విన్నర్ అయ్యాను. అక్కడ 'డ్యాన్స్ బేబీ డ్యాన్స్' డైరెక్టర్ అనురాధ గారు నన్ను చూశారు. జెమినీకి రమ్మన్నారు. వెళ్లిన తర్వాత జి.కె.మోహన్‌గారు, కన్నాగారు, "ట్రింగ్ ట్రింగ్ టాప్‌టెన్ అని కాన్‌సెప్ట్ ఉందమ్మా... ఫోన్ ప్రోగ్రాం. జనంతో మాట్లాడాలి" అని చెప్పారు. "ఈ ప్రోగ్రాం నీకు మంచి పేరు తెస్తుంది" అని ఎంకరేజ్ చేశారు. ఎపిసోడ్ రిలీజ్ కాక మునుపు ప్రమోకే మంచి రెస్పాన్స్ వచ్చేసరికి ఎపిసోడ్ ఇంకా తొందరగా స్టార్ట్ చేశారు. అలా నాకు 'ట్రింగ్ ట్రింగ్ జాను' అనే ముద్రపడి పోయింది. తర్వాత 'డ్యాన్స్ బేబీ డ్యాన్స్'కు యాంకర్‌గా చేయమని అడిగారు. దాంతో అది కూడా చేశాను.

'డ్యాన్స్ బేబీ డ్యాన్స్'కి పార్టిస్పెంట్‌గా వచ్చాను. అదే షో కి యాంకర్ అయ్యాను.

'ట్రింగ్ ట్రింగ్ టాప్‌టెన్' 75 ఎపిసోడ్స్ తర్వాత ఆపి, 'అలనాటి టాప్‌టెన్' స్టార్ట్ చేశారు. ఓల్డ్ సాంగ్స్ గురించి, ఓల్డ్ మ్యూజిక్ డైరెక్టర్స్ గురించి హైలైట్ చేస్తూ చేసిన ప్రోగ్రాం అది. మీ 'హాసం' పత్రిక వల్లనే అది రన్ అయింది. అది చూసి 'ఒకరికి ఒకరు' సినిమాలో కిరణ్ గారు అవకాశమిచ్చారు. అందులో యాంకర్ జాహ్నవిగానే యాక్ట్ చేశాను.

**✦ ఆ ఐడియా వాళ్లకి ఎలా వచ్చింది?**

ఐడియా డైరెక్టర్ రసూల్ గారిది.... "జాహ్నవిని తీసుకుని ఏదో క్యారెక్టర్ చేయించే బదులు.. యాంకర్ జాహ్నవి ఆ ట్రైన్‌లో ఉన్నట్టు చేస్తే బాగుంటుంది" అని అన్నారాయన. ఆ తర్వాత 'యజ్ఞం'.

**✦ మీ చదువూ, సంధ్య....గురించి చెప్పండి...**

ఏలూరులో పుట్టాను. టెన్త్ వరకూ అక్కడే చదివాను. తర్వాత విజయవాడ కాలేజ్‌లో జాయిన్ అయ్యాను. ఇంజనీరింగ్ సీట్ కూడా వచ్చింది. అదే టైంలో యాంకర్‌గా అవకాశం వచ్చింది. ఫస్ట్ నుండి నాకు గ్లామర్ ఫీల్డ్ మీద ఇంట్రెస్ట్ ఎక్కువ. ఫేమ్ ఉంటే వెల్త్ ఉంటుంది, హెల్త్ ఉంటుంది. అన్నీ ఉంటాయని చెప్పి ఫేమ్‌నే సెలక్ట్ చేసుకున్నాను. 'ఈ ఇంజనీరింగ్ వద్దు నేను బి.కామ్ చదువుతాను' అని మమ్మీ వాళ్లను మాయ చేసి ఇది సెలెక్ట్ చేసుకున్నాను. ప్రస్తుతం మల్టీమీడియాతో పాటు బి.కామ్ చేస్తున్నాను.

**✦ షూటింగ్‌లో మీ క్యారెక్టర్ మీకు సంబంధించిన సెకండ్ సీన్‌తో మొదలయింది. కానీ ఫస్ట్ సీన్ వేరే ఉంది. ముందర సీన్ రియాక్షన్ తెలీకుండా ఈ సీన్ చేయటం...మీకు ఎలా అవగాహన అయింది?**

ముందు సీన్ అసలు నాకు తెలీదండి. 8 గంటలకు మేకప్ అయి స్పాట్‌కి వచ్చాను. జీప్ నుంచి దిగాలి. దిగి భయపడుతూ.. ముసుగేసుకుని ప్రక్కకి తప్పుకోవాలి. హీరోయిన్ ఫాదరంటే నీకు భయం అని చెప్పారు. తరువాత ఆయన 'ఏం మాట్లాడవేంటి? మూగదానివా' అని తిడుతూ ఉంటారు. అప్పుడు..ఆ షాట్ జరిగేటప్పుడు చెప్పారు... 'ఓసారి నువ్వు ఫోన్‌లో ఆయనతో రూడ్‌గా మాట్లాడతావ్...అందువల్ల ఆయనంటే భయపడతావు' అని.

అదీగాక ఆ రోజు జెమినీలో యాంకరింగ్ ఉంది. ఆ టెన్షన్ దానికి లక్కీగా యాడ్ అయింది. తర్వాత రోజున డైరెక్టర్, ప్రొడ్యూసర్ నా క్యారెక్టర్ నాకు వివరించటం జరిగింది. ఇమ్మీడియట్ షాట్ ధర్మవరపు సుబ్రహ్మణ్యం గారితో కామెడీ సీన్...అందులో డైలాగులున్నాయి. మూగదాన్ని అని చెప్పారు. మళ్లీ డైలాగులేమిటండి అంటే 'ఈయన తాగుతారు కాబట్టి ఎవరూ ఈయన మాట పట్టించుకోరు. ఈయన్ని ఏడిపిస్తూ వస్తుంది నీ క్యారెక్టర్' అన్నారు.

**✦ నిద్రలో నడిచే సీన్... ఫస్ట్ టెలిఫోన్ సీన్.. దాని గురించి....**

నిద్రలో నడిచే సీన్ అయితే నన్ను మరీ ఫ్రాడ్ చేశారండి ఒక్కమాటలో చెప్పాలంటే. నాకు అసలు ఏమీ చెప్పలేదు. ఇప్పుడు నిద్రపోయే సీన్ ఉంది. ఆ షాట్ రెడీ అవుతుంది అని చెప్పి స్క్రిప్ట్ తెచ్చి ఇచ్చేశారు. సుమీర, నేను బాగా క్లోజ్‌గా ఉండేవాళ్లం. అందులో సుమీర డైలాగ్స్ ఉన్నాయి కానీ, నా డైలాగ్స్ ఏమీ లేవు. నా డైలాగ్ ఏమీ లేదు కదా అని చెప్పి నేను కొంచెం రిలాక్స్‌డ్‌గానే ఉన్నాను. షాట్‌లోకి వెళ్లిన తర్వాత 'హీరో వస్తాడు. నీ బెడ్ దగ్గరకు వచ్చేసరికి సడెన్‌గా లేచి బాపూజీ పాట పాడాల'న్నారు. ఇది చూడటానికి కామెడీగా ఉండటమే కాకుండా చేసేవాళ్లకి కూడా నవ్వు వస్తుంది. అందులో అంత స్టిఫ్‌గా లేచి కూర్చుని సీరియస్‌గా 'బాబూజీ' అంటూ పాట పాడి పడుకోవాలంటే ఎంత కామెడీ వస్తుంది....!? ఆ షాట్ రిహార్సిల్స్ అప్పుడే అందరూ బాగా నవ్వారు. థియేటర్‌లో ఆ సీన్‌కి పగలబడి నవ్వేస్తున్నారు. ఆ తర్వాత అలా నడిచి వెళ్లటం.. ఫ్రిజ్ దగ్గరకు వెళ్లి వాటర్ తాగి పడుకోవటం... ఓ పక్క 'ఇదంతా హీరోయిన్ ఫాదర్‌కి చెప్పకు' అని అంటూ ఉంటాడు గోపీచంద్. అసలు అదేం పట్టించుకోకుండా అక్కడ ఉండాలి. రిహార్సిల్స్‌లో ఆయన అలా అన్నప్పుడు గబుక్కున డిస్టర్బ్ కావటం జరిగింది. తర్వాత స్టిఫ్‌గా ఉండాలి... ఎవరినీ పట్టించుకోకూడదు అని చెప్పడంతో అలా చేశాను.

టెలిఫోన్‌లో హీరోయిన్ ఫాదర్‌ని తిట్టే సీన్‌ని లాస్ట్ డే చేశారు. అలా తిట్టిన తర్వాత 'సార్ మొదటి రోజు జీపుదిగిన తర్వాత నేను చేసిన దానికి, ఇప్పుడు సీన్‌కి మ్యాచ్ అయిందా' అని అడిగాను. 'సెట్ అవకుండా చేస్తారా, అలా చేయరు' అని బాబూరావు గారు అన్నారు.

**✦ ఓల్డ్ సిటీ సీన్‌లో మీరు సీరియస్‌గా చేసిన సీన్‌ని కూడా జనం హ్యాపీగా ఎంజాయ్ చేశారు కదా... దాని గురించి చెప్పండి...**

ఓల్డ్ సిటీ ఎట్మాస్ఫియర్ అదీ ఉండాలని అక్కడే చేశారు. ఆ డైలాగ్ చెప్పేటప్పుడు కూడా నాకు నవ్వు వచ్చింది .... బేసికల్లీ ప్రతి చిన్నదానికి నవ్వుతాను నేను. అక్కడేమో నవ్వటానికి వీల్లేదు. పైగా జనాలను తోసుకుంటూ వచ్చి ఆ డైలాగ్ చెప్పాలి. ఓల్డ్‌సిటీ... క్రౌడ్ ఎక్కువ అయ్యారు. ఇక షాట్ రెడీ అయిపోయింది. 'జానూ షాట్‌కి వచ్చేయమ్మా' అన్నారు. షాట్‌కి వెళ్లిపోయాను. జనాల మధ్యన నుంచో పెట్టారు. రిహార్సిల్ ఓసారి చేద్దామన్నారు. రిహార్సిల్స్ అయిపోయిన తర్వాత 'ఫేస్‌లో అంత క్రోధం కనిపించటం లేదు. మళ్లా ఓ సారి చేద్దాం' అన్నారు. 'లేదు సార్ ఇంత మంది జనంలో చెప్పాలంటేనే నాకు ఓ రకమైన ఫీలింగ్ వస్తుంది. మీరు డైరెక్ట్ టేక్ చేయండి. ఒక వేళ నేను చేయలేకపోతే టెన్ టైమ్స్ రిహార్సిల్స్ చేసి చేస్తాను' అని చెప్పాను. డైరెక్టర్ గారు నన్ను నమ్మి 'డైరెక్ట్ టేక్' అన్నారు. ఫస్ట్ టేకే ఓకే అయిపోయింది.

**✦ రిలీజ్ అయిన తర్వాత రెస్పాన్స్ ఎలా ఉంది?**

రిలీజ్ అయిన రోజు నేను ఫస్ట్ షో చూశాను. నా ఫస్ట్ డైలాగ్ హైదరాబాద్‌కున్న పవర్ చెబుతున్న డైలాగ్... దాని గొప్పతనం చెబుతున్నప్పుడు... విపరీతమైన క్లాప్స్.. తర్వాత నా ప్రతి డైలాగ్‌కి ఆడియన్స్ రెస్పాన్స్ చూసినప్పుడు బాబూరావు గారు అన్న మాటలు గుర్తొచ్చాయి... 'ఏదో వచ్చాం, చేశాం, వెళ్లాం అని కాదమ్మా... నువ్వు చెప్పే డైలాగ్‌కి క్లాప్స్ పడినప్పుడే నువ్వు బాగా చేసినట్టు... అలా చేయగలిగితేనే యాక్టర్‌గా నువు ఎచీవ్ అయినట్టు' అన్నారు.

రిలీజ్ అయిన రోజు మార్నింగ్ షో అయిన తర్వాత గుంటూరు నుంచీ, విజయవాడ, బాపట్ల, నెల్లూరు... ఇలా చాలా చోట్ల నుంచీ ఫోన్లు వచ్చాయి. మా గ్రాండ్ పేరెంట్స్ మొదలుకుని అందరూ కంగ్రాట్స్ చేశారు. 'జానూ మా అమ్మాయి అని చెప్పుకుంటున్నాం. వి ఆర్ వెరీ ప్రౌడ్ ఆఫ్ యూ...' అని ఒక్కసారిగా అందరూ



## 'యజ్ఞం' లో జనం ఆదరిస్తున్న జాహ్నవి సన్నివేశాలు, డైలాగులలో కొన్ని...



అబె రెడ్డప్పా...ఏం మాట్లాడుతున్నావ్. నీది రాయలసీమ అయితే నాది రాయల్ సిటీ. ఓల్డ్ సిటీ. కుతుబ్‌షాహీ కీ ఖాన్‌దానీ. ఇమాన్‌దారి సే ఆమ్‌ధానీ. నకరాల్ చేసేవంటే నరాల్ తీస్తా బిడ్డా. తిక్క అంటావ్....నీది తిక్క.. నీ బాబుది తిక్క నీ తాతది తిక్క.... నీ ఖాన్‌దాన్ మొత్తం తిక్క... (అలా అంటుండగా హీరోయిన్ ఫోన్ తీసుకుంటుంది.. అప్పుడు హీరోయిన్‌తో) మిగతాది నువ్వు తిడతావ్...తిట్టు



'ఇక్కడ గుడులు ఉంటాయా... క్యా..'
'ఊరు అన్నాక గుడి, బడి ఉండదు క్యా..'
'అయితే మసీదు కిదర్ హై'
'వెళ్తే ఉదర్ హై'



"కొట్టు... కొట్టు నీ తల్లి... ఏ తొడైతే కొడతావో ఆ తొడ కండ పీకి తుకడాల్ తుకడాల్ చేసి చార్మినార్ చౌరస్తాలో చటాక్ చటాక్ లెక్కన అమ్ముతా బిడ్డా..."

కాంటాక్ట్‌లోకి వచ్చేశారు. ఇండస్ట్రీలో కూడా చాలామంది అప్రిషియేట్ చేశారు. అనురాధ గారు, జి.కె.మోహన్‌గారు, కిరణ్‌గారు, రసూల్ గారు, ముత్యాలసుబ్బయ్య గారు.... ఇండస్ట్రీలో నాకు తెలిసిన ప్రతి ఒక్కరూ అప్రిషియేట్ చేశారు. ఆఫీసుకు వెళ్లి బాబూరావు గారికి బొకే ఇచ్చి థాంక్స్ చెప్పి... 'జానూ ఇలా చేయగలదు అని ప్రూవ్ చేసింది మీరే...సార్' అన్నాను. దానికి బాబూరావు గారు 'నువ్ మా అమ్మాయివి. నీకు మంచి లైఫ్ ఉంది. నువ్ ఇండస్ట్రీలో సెటిల్ అవుతావు. ఏదయితే నీకు ఫస్ట్ డే ప్రామిస్ చేశానో అది నీ వరకూ వచ్చేట్లు చేశాను. నా బాధ్యత అయిపోయింది. ఇక నుంచీ నీ కెరియర్ నీ చేతిలోనే ఉంటుంది" అన్నారు. ఇవాళ చాలా మంది నన్ను జానూ అనడం మర్చిపోయి 'ఫాతిమా' అంటున్నారు. టోటల్‌గా నా డైలాగ్స్ అన్నిటికీ క్లాప్స్ వచ్చాయి.

**✦ మీ చేత డైలాగ్స్ చెప్పించటంలో నిర్మాత బాబూరావుగారి పాత్ర ఎంత ?**

నా డైలాగ్స్‌కి మాత్రం బాబూరావు గారు ఇలా చేయాలి, అలా చేయాలి అని చెప్పేవారు. ఆయన ఈ క్యారెక్టర్‌కు నన్ను ముందే అనుకున్నారేమో అనిపిస్తుంది. ఆయన ఇన్‌వాల్వ్‌మెంట్ కచ్చితంగా ప్రతిషాట్‌లో ఉంది. నిద్దరలో లేచే సీన్ మాత్రం ఆయన అక్కడ లేకపోతే నేను చేయలేకపోయేదాన్నేమో. ఎందుకంటే ఆయన అంతబాగా చెబుతారు. 'ఇది చేస్తే నీకు ప్లస్ అవుతుంది. నవ్వనేది ఎప్పుడూ అతిగా ఉండకూడదమ్మా.. మనం చేస్తున్నది కరెక్ట్ అవునా, కాదా అని మనల్ని మనం కంట్రోల్ చేసుకుంటేనే మన లైఫ్ బాగుంటుంది' అని చెప్పారు. వర్క్ మీద అంత కమిట్‌మెంట్, ఇన్‌వాల్వ్‌మెంట్, అథారిటీ ఉంది ఆయనకి. డిమాండ్ చేయగలరు దేన్నైనా....ఇన్నీ తెలిసిన ఓ వ్యక్తి మన పక్క ఉన్నప్పుడు మనం మౌల్డ్ అవుతాం. ఆయన అలా నన్ను మౌల్డ్ చేసుకుని నా చేత చేయించుకున్నారు.

**✦ సరే... మీ ఫ్యామిలీ బ్యాగ్రౌండ్ గురించి....**

ఫాదర్ పేరు ప్రసాద్. మదర్ పేరు వాణి. ఒక సిస్టర్.. ఇంటర్ కంప్లీట్ అయింది. ఒక బ్రదర్.. ఇంటర్ ఫస్టియర్. నేనే పెద్ద దాన్ని. మా నాన్నగారు సివిల్ కాంట్రాక్టర్. చెప్పానుగా మదర్ బ్యూటిషియన్. ఇప్పుడు నేను బిజీ అయ్యాను కాబట్టి నన్ను చూడటానికి మా అమ్మ ఆ యాక్టివిటీని వదిలేశారు. ఇంట్లో నాకు ఎవరూ నెగిటివ్ కాదు. నేనేది చేస్తానంటే...అదే చేయమనేవారు. డాడీ ఒకటే చెబుతారు... 'నీకు నచ్చితే చెయ్యి . నచ్చకపోతే చెయవద్దు. చేసే పని 100 శాతం అంకితభావంతో చెయ్' అని చెప్తారు. 'ఏదైనా సరే నీ వరకూ వస్తేనే తీసుకో, నీ వరకూ రాని దానికొరకు పాకులాడకు.. నీ లైఫ్ ఏమిటో మొదట నీకే అర్థం కావాలి అది అర్థం చేసుకుని పనిచేయమ'ంటారు.

**✦ ఇంత పరిపక్వత ధ్వనించే మీ మాటలు వింటే మీకు 19 ఏళ్లంటే ఎవరైనా నమ్ముతారా?**

24 గంటలూ క్లాసులు పీకే పేరెంట్స్ ఉన్నప్పుడు ఎవరైనా ఇలాగే మాట్లాడుతారు. అలా ఉంటేనే పిల్లలు డెఫినిట్‌గా డెవలప్ అవుతారు. ఏ పని చేసినా అందులో ఈ రాంగ్ ఉంది.... కేర్‌ఫుల్‌గా చేయ్ అని అనాలి అంతేగానీ పిల్లల అడుగులకు మడుగులొత్తే లాగా పేరెంట్స్ ఉండకూడదు. చేసే ప్రతిపనిలో తప్పొప్పులు చెప్పాలి. ఎప్పుడూ పిల్లల్ని పొగడకూడదు. ఎప్పుడూ హెచ్చరిస్తూనే ఉండాలి. అప్పుడే పిల్లలు పైకి వస్తారు. బయటి వాళ్లు ఎన్ని చెప్పినా కూడా అది మనల్ని సంతోష పెట్టడానికే ఉంటాయి. పేరెంట్స్ మనం లైఫ్ లాంగ్ హేపీగా ఉండటానికి చెబుతారు. సో... నేను ఎక్కువ పేరెంట్స్ మాటల్నే ఫాలో అవుతాను. ■

రచన: కులశేఖర్ **1** గానం: కె.కె, సుచిత్ర

ఆ:ఒమహ జియ్యా వాహి యాయా
ఒమహయాయా జియ్యామేమసయ్యా ॥హోమ॥
అ:చెలియ...చెలియా...చెలియ...చెలియా
అలల ఒడిలో ఎదురు చూస్తున్నా
తనువు నదిలో మునిగి ఉన్నా
చెమట జడిలో తడిసి పోతున్నా
ఆ:హోమజియ్యా హోహియాయా
హోహియాయా జియ్యామేమసయ్యా ॥హోమ॥
అ:చిగురు ఎదలో చితిగ మారినది
విరహజ్వాలే సెగలు రేపినది
మంచుకురిసింది-చిలిపి నీ ఊహలో
కాలమంతా మనది కాదు అని
జ్ఞాపకాలే చెలిమి కానుకని
వదిలిపోయావు న్యాయమా ప్రియతమా...
చెలియ...చెలియా...చెలియ...చెలియా
అలల ఒడిలో ఎదురు చూస్తున్నా
తనువు నదిలో మునిగి ఉన్నా
చెమట జడిలో తడిసి పోతున్నా...
తడిసిపోతున్నా...తడిసిపోతున్నా..
అ:శ్వాస నీవే తెలుసుకోవే
స్వాతి చినుకై తరలి రావే
నీ జతే... లేనిదే.. నరకమే.... ఈ....లోకం
జాలి నాపై కలగదేమే...
జాడ అయినా తెలియదేమే...
ప్రతిక్షణం... మనసిలా... వెతికెనే.. నీ...కోసం
ఎందుకమ్మా నీకీ మౌనం
తెలిసి కూడా ఇంకా దూరం
పరుగు తీస్తావు న్యాయమా ప్రియతమా... ॥చెలియ॥
ఆ:హోమజియ్యా హోహియాయా హోహియాయా.....
హోమజియ్యా హోహియాయా
హోహియాయా.....మియ్యాయేవతయ్యా
అ:గుండెలోన వలపు గాయం
మంటరేపే పిదపకాలం
ప్రణయమా....ప్రళయమా....తెలుసునా.... నీ...కైనా
దూరమైన చెలిమి దీపం
భారమైన బతుకు శాపం
ప్రియతమా...హృదయమా...తరలిరా... నే....డైనా
కలవు కావా నా కన్నుల్లో
నిమిషమైనా నీ కౌగిలిలో
సేద తీరాలి-చేరవా-నేస్తమా...ఆ...ఆ... ॥చెలియ॥

రచన: కులశేఖర్ **2** గానం: హరిణి

ఆ: అందగాడా అందగాడా అందాలన్నీ అందుకోరా...
అల్లుకోరా గిల్లుకోరా అందమంతా నీదిరా
మల్లెమొగ్గా మల్లెమొగ్గా రమ్మంటోందోయ్ అందగాడా
పూలపక్కా ఆకువక్కా అందుకోరా సుందరా
గోదారల్లే ... నాలో పొంగే కోరికమ్మా
నీదేలేరా... నోరూరించే ఆడబొమ్మా
ఆడుకోరా పాడుకోరా రాతిరంతా హాయిగా
అందగాడా అందగాడా అందాలన్నీ అందుకోరా...
అల్లుకోరా గిల్లుకోరా అందమంతా నీదిరా
గాలే తాకనీ నాలో సోకునీ
ఇన్నాళ్ళుంచానయ్యో నీకోసం
నా అందంచందం అంతా నీకోసం
తోడే.. లేదనీ కాలే కౌగిలీ
ఎప్పటి నుంచీ ఉందో నీకోసం
నా ప్రాయం ప్రాణం అంతా నీకోసం
ఎందుకో ...ఏమిటో... ఇంతకాలం ఎంతోదూరం
ముందరే ఉందిగా సొంతమయ్యే సంతోషం
అందగాడా అందగాడా అందాలన్నీ అందుకోరా...
అల్లుకోరా గిల్లుకోరా అందమంతా నీదిరా
జారే పైటకీ తూలే మాటకీ
తాపం పెంచిందయ్యో నీరూపం
ఏనాడు లేనే లేదు ఈమైకం
నాలో శ్వాసకీ రేగే ఆశకీ
దాహం పెంచిందయ్యో నీ... స్నేహం
గుర్తంటూ రానేరాదు ఈ లోకం
నీ జతే చేరితే మాయమయ్యే నాలో మౌనం
రాగమై సాగెనే అంతులేని ఆనందం....
మల్లెమొగ్గా మల్లెమొగ్గా రమ్మంటోందోయ్ అందగాడా
పూలపక్కా ఆకువక్కా అందుకోరా సుందరా
గోదారల్లే ... నాలో పొంగే కోరికమ్మా
నీదేలేరా... నోరూరించే ఆడబొమ్మా
కో: ఆడుకోరా పాడుకోరా రాతిరంతా హాయిగా...

రచన: కులశేఖర్ **3** గానం : శ్రీనివాస్

కో: కిసీ ఆషిక్ కా ఖయాల్ హై తేరీ ఆఖీ లెహరా ఛిచాల్ హై
ఏక్ ప్యారాసా సవాల్ హై ఏ తో బస్ హి కా మాల్ హై..హై..హై..
ఆ: భీగీ భీగీ సీ ఏ రాత్ హై...
హే తో ప్యార్ కా ఏ రంగ్ హై ॥భీగీ॥
హే రంగ్ హై తరంగ్ హై... ॥3॥
అ: ఏ చిలిపి కళ్ళలోన కలవో
ఏ చిగురు గుండెలోన లయవో ॥ఏ చిలిపి॥
నువ్ అచ్చుల్లోన హల్లువో
జడ కుచ్చుల్లోన మల్లెవో ॥నువ్ అచ్చుల్లోన॥
కరిమబ్బుల్లోన విల్లువో
మధుమాసంలోన-మంచు పూల జల్లువో ॥2॥ ॥ఏ చిలిపి॥
కో: హే రంగ్ హై తరంగ్ హై... ॥4॥
ఆ: భీగీ భీగీ సీ ఏ రాత్ హై... హే తో ప్యార్ కా ఏ రంగ్ హై ॥2॥

అ: ఈ పరిమళము...నీదేనా
నాలో పరవశము...నిజమేనా
బొండుమల్లి పువ్వుకన్న తేలికగు నీ సోకూ
రెండు కళ్ళు మూసుకున్న లాగు మరి నీవైపూ
సొగసులు చూసి పాడగా ఎలా
కనులకు మాట రాదుగా హలా
వింతల్లోను కొత్తవింత నువ్వేనా
ఆ అందం అంటే అచ్చంగానూ నువ్వే ॥ఏ చిలిపి॥
ఆ పలుకులలో......పరవళ్ళూ
తూలే కులుకులలో.........కొడవళ్ళూ
నిన్ను చూసి ఒంగుతుంది ఆశపడి ఆకాశం
ఆ మబ్బు చీర పంపుతుంది మోజుపడి నీకోసం
స్వరముల తీపి కోయిలా....ఇలా
పరుగులు తీయకే అలా....అలా
నవ్వుతున్న నిన్ను చూసి సంతోషం
నీ బుగ్గ సొట్టలోనె పాడె సంగీతం
ఏ చిలిపి కళ్ళలోన కలవో ఏ చిగురు గుండెలోన లయవో
నువ్ అచ్చుల్లోన హల్లువో
కో: నువ్ అచ్చుల్లోన హల్లువో
అ: జడ కుచ్చుల్లోన మల్లెవో
కో: జడకుచ్చుల్లోన మల్లెవో
అ: నువ్ అచ్చుల్లోన హల్లువో జడ కుచ్చుల్లోన మల్లెవో
కరిమబ్బుల్లోన విల్లువో
మధుమాసంలోన-మంచు పూల జల్లువో ॥3॥

రచన: కులశేఖర్ **4** గానం : సునీతాసారథి,ఫెబిమణి

ఆ: ఆడతనమా-చూడతరమా
ఆపతరమా-పూలశరమా ॥ఆడతనమా॥
నా-కోడె ఎదలో వేడితనమా
కుర్రాళ్ళ గుండెల్లో-కొంటె స్వరమా
కంటిపాపకి అందాల వరమా
కో: డ్యూ...రా... ఆ: సింగారం చిందులేసినా కన్నె ప్రాయమా
డ్యూ...రా... ఆ: వయ్యారం దాచిపెట్టకే దేహమా
డ్యూ...రా... ఆ: ఎదలోన కొత్త అల్లరే మౌన మోహమా
డ్యూ...రా... ఆ: పరువాలే పల్లవించే రాగమా
ఆడతనమా-చూడతరమా
ఆపతరమా-పూలశరమా.... ॥ఆడతనమా॥
ఆ: ఇంటిలో వాస్తు మొత్తం
కొత్తగా ఉంది నేస్తం
మార్చేశా మరి నీ కోసం
ఎదురుగా ఉంది అందం
తపనలే తీర్చు మంత్రం
చేస్తావా ఒడిలో యాగం
సలసల మంది కన్నరక్తం
కలబడమంది కాలచక్రం
కలవమంటేను-నీకు కలవరమా...?
ఆడతనమా-చూడతరమా
ఆపతరమా-పూలశరమా ॥ఆడతనమా॥
కో: పరువమా..పరువమా..పరువమా...పరువమా...హే..
ఆ: మనసులో మదనరూపం
తనువులో విరహతాపం
నాలో రేపె ఏదో దాహం
సరసమే మనకు సర్వం
సుఖములో చిలిపి స్వర్గం
పరువాలే పరిచింది దేహం
తలపడమంది-పూల తల్పం
తొరపడమంది-పాల శిల్పం
చిన్ని కలలోనె-ఇంత పరవశమా
నా-కోడె ఎదలో వేడితనమా
కుర్రాళ్ళ గుండెల్లో-కొంటె స్వరమా
కంటిపాపకి అందాల వరమా
కో: డ్యూ...రా... ఆ: సింగారం చిందులేసినా కన్నె ప్రాయమా
డ్యూ...రా... ఆ: వయ్యారం దాచిపెట్టకే దేహమా
డ్యూ...రా... ఆ: ఎదలోన కొత్త అల్లరే మౌన మోహమా
డ్యూ...రా... ఆ: పరువాలే పల్లవించే రాగమా
డ్యూ...రా... ఆ: మోహమా
డ్యూ...రా... ఆ: మోహమా
డ్యూ...రా... ఆ: మోహమా





రచన: కులశేఖర్ **5** గానం: దీప్తషాలిని సింగ్

అ: చెలిమను పరిమళం
మనసుకి తొలివరం
బతుకున అతిశయం
వాన..వాన చినుకులే..
ఇరువురి పరిచయం
తెలియని పరవశం
తొలి తొలి అనుభవం
పరువుకు పరుగులే
అ: నన్నే నన్నే చూస్తూ ....నా గుండెల్లో గుచ్చేస్తూ
నువ్వేదో...ఏదో...ఏదో.....ఏదో చెయ్యొద్దే
సోకుల గాలం వేస్తూ...నీ మాటల్లో ముంచేస్తూ
ఓయమ్మో...అమ్మో...ప్రాణం తియ్యొద్దే
కో: చికుబం చికుబం భం చికుబో..
ఆ: నీకో నిజమే చెప్పనా...నీకో నిజమే చెప్పనా
నా మదిలో మాటే చెప్పనా
ఎదలో ఏదో తుంటరి తిల్లానా
నాలో ఏదో అల్లరి
అది నిన్నా మొన్నా లేనిదీ
మరి ప్రేమో ఏమో ఒకటే హైరానా....ఓహువాహో....ఓహువాహో
ఏమిటంటారు- ఈ మా...యల్లి..ఓహువాహ..ఓహువాహ
ఎవరినడగాలి-ప్రే...మేనా అని అ : ॥నన్నే నన్నే॥
అ: ఇదివరకెరగని స్వరములు పలికెను
పగడపు జిలుగుల పెదాల వీణా
బిడియములెరగని గడసరి సొగసుకు
తమకము లెగసెను-నరాలలోనా హాలోనా
ఆ: ఏమైందో ఏమిటో-ప్రేమైందో ఏమిటో
నా వాటం మొత్తం ఎంతో మారిందీ
ఈ మైకం ఏమిటో-ఈ తాపం ఏమిటో
నా ప్రాయం మాత్రం నిన్నే కోరిందీ హో...హో...
నన్నే నన్నే మార్చి నీ మాటలతో ఏమార్చి
ప్రేమించే ధైర్యం నాలో పెంచావోయ్
కన్ను కన్ను చేర్చి నా కల్లోకే నువ్వొచ్చి
ఏకంగా బరిలోకే దించావోయ్ అ: ॥చెలిమను॥
అ: మనసున అలజడి వలపని తెలిపిన
జిలిబిలి పలుకుల-చలాకి మైనా
కలలను నిజముగ ఎదురుగ నిలిపిన
వరముగ దొరికిన-వయ్యారి జాణా జాణా
ఆ: ఈలోకం కొత్తగా....ఉందయ్యో బొత్తిగా
భూగోళం కూడా నేడే పుట్టిందీ
నీ వల్లే యింతగా...మారాలే వింతగా
నువ్వంటే నాకు పిచ్చే పట్టిందీ
లాలల్లా...లాలాల్లా.... అ: ॥ నన్నే నన్నే॥


కలైపులి. యస్.థాను సమర్పించు
శ్రీ గీతా ఇంటర్‌నేషనల్
పాటల పుస్తక ప్రియులకోసం
సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో
'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.
తారాగణం
వెంకటేష్, అసిన్,
సునీల్, తనికెళ్ళ భరణి,
ఆశిష్ విద్యార్థి, జీవన్,
డేనియల్ బాలాజీ
సాంకేతిక నిపుణులు
డ్యాన్స్ : బృంద
ఫైట్స్ : పీటర్ హేన్
ఆర్ట్ : రాజీవన్
ఎడిటింగ్ : ఆంథోని
కెమేరా : ఆర్.డి.రాజశేఖర్
పి.ఆర్.ఓ. : ఎల్.వేణుగోపాల్
ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్స్ : ఫోటాన్ ఫ్యాక్టరీ ప్రై.లి.
మాటలు-పాటలు : కులశేఖర్
సంగీతం : హేరిస్ జయరాజ్
నిర్మాతలు : ఎస్.థాను
సి.వెంకటరాజు
జి.శివరాజు
కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : గౌతమ్
సి.వెంకటరాజు
జి.శివరాజు
గౌతమ్
హేరిస్ జయరాజ్
కులశేఖర్
ఘర్షణ
THE FINAL BATTLE
గౌతమ్ కలైపులి. యస్.థాను సి.వెంకటరాజు జి.శివరాజు హేరిస్ జయరాజ్
హాసం
40





హాంకాంగ్‌లో పుట్టిన కోకో లీ వేదిక నెక్కి ఫక్తు పాశ్చాత్య గీతాలను అద్భుతంగా ఆలపిస్తుంటే అచ్చెరువొందనివారు వుండరు. 'చప్పిడి ముక్కున్న ఈ చైనా పిల్ల ఇంత చక్కగా పాడుతోందేమిటి చెప్మా!' అని అనుకోని మనసూ వుండదు. "నా పాటలు వినబోయేముందు వారి మనసుల్లో వున్న భావాల్ని, సంశయాల్ని తుడిచి వేయడమే నా తొలి విజయం. నా గొంతులోని వైవిధ్యమే ప్రేక్షకుల మనసుల్ని జయించేలా చేసింది" అంటోంది చైనా పాప్‌గాయని కోకో లీ.

చైనీయుల భాష మాండరిన్‌లో మాత్రమేకాదు ఆంగ్లంలోనూ అద్భుతంగా పాడి పాశ్చాత్యులను మెప్పించగల దిట్ట కోకో లీ. అయితే పాప్ గీతాలాపన తాను చిన్నతనం నుండి విన్న పాటల వల్ల అబ్బిందని, పాడే తత్త్వం తల్లి, తన అక్కల నుండి ఒంటబట్టిందని కోకో లీ చెబుతోంది. 1976లో హాంకాంగ్‌లో పుట్టినా కోకో లీ పెరిగింది మాత్రం శాన్ ఫ్రాన్సిస్కోలో. ముగ్గురు అక్కచెల్లెళ్ళలో కోకో ఆఖరి అమ్మాయి. తల్లి మెడికల్ డాక్టర్ మాత్రమేకాదు సంగీతపరిజ్ఞానం వున్న వ్యక్తి. అందువల్ల ఆ సంగీతపరిమళాలు కుమార్తెలకీ వారసత్వంగా అబ్బాయి. ముఖ్యంగా సంగీతాన్నే కెరీర్‌గా మలచుకునేలా తల్లి పిల్లలకు శిక్షణ ఇప్పించింది. కోకో అక్కయ్యలు స్థానికంగా ఏ పాటలపోటీలు జరిగినా వెళ్ళి పాల్గొనేవారు -తమ స్థాయిలో బహుమతులూ పొందేవాళ్ళు. అక్కల అడుగు జాడల్లో నడుస్తూనే కోకో తన కిష్టమైన విట్నీ హౌస్టన్,మడోన్నా,డెబ్బీ గిబ్సన్,జార్జ్

# ఊహాకందని గాత్రం కోకో లీ సొంతం



మైఖేల్ గీతాలను పాడుతూ వుండేది. పాటలు అలవోకగా పాడటం అలవాటైన తర్వాత పోటీలో పాల్గొని బహుమతులు గెలుచుకోవటం సర్వసాధారణమైంది కోకో లీకి. "తాను స్కూల్ లో ఓసారి పాట పాడినప్పుడు విద్యార్థులంతా లేచి కరతాళధ్వనులు చేసిన సంఘటనను ఇప్పటికీ మర్చిపోలేనని' కోకోలీ అంటూంటుంది. కెరీర్ ప్రారంభదినాలను తలుచుకుంటూ "యుక్తవయసులోనే ఫిషర్ మెన్స్ వఫ్ లోని కరాకే లో నా పాటని నేనే పాడి రికార్డ్ చేసుకున్నాను. దానికి నా స్నేహితురాలు ఆర్థిక సాయం చేసింది. ఆ టేప్‌ను నా స్నేహితురాలు పనిచేసే రెస్టారెంట్‌లో వినిపిస్తే విన్నవాళ్ళు కొందరు దానిని కొంటామని చెప్పారు. దాంతో నా గాత్రం మీద నాకు నమ్మకం కలిగింది. నా పాటల్నీ వినేవాళ్ళు-విని ఆనందించి క్యాసెట్స్ కొనేవాళ్లూ వున్నారన్న ఆనందంతో - గాయనిగా కెరీర్ కొనసాగించాలని నిర్ణయించుకున్నాను" అని చెప్పింది.

## వెండితెర వెనక - ముందు..

పాటలు పాడే అందమైన అమ్మాయి తెర వెనుకే కాదు - ముందు కూడా తమ ప్రతిభా పాటవాల్ని నిరూపించుకున్న సంఘటనలు గతంలో చాలానే వున్నాయి. యాక్షన్ హీరో జాకీ ఛాన్ తో 'ములన్' అనే చిత్రాన్ని డిస్నీ సంస్థ నిర్మించింది. మాండరిన్ భాషలోని అనువదితమైన ఈ చిత్రంలో ఓ ప్రధాన పాత్రకి కోకో లీ గాత్రదానం చేయటమే కాకుండా సినిమాలోని థీమ్‌సాంగ్‌ని పాడింది. ఇప్పుడు తాజాగా జాన్ లోన్ హీరోగా, లీజిన్ దర్శకత్వంలో రూపుదిద్దుకున్న 'బంబూ షూట్' చిత్రంలో కథానాయికగా నటించింది కోకో లీ. నటి కావాలనుకునే ఓ మధ్యతరగతి అమ్మాయిగా తానీ చిత్రంలో నటించాననీ,ఈ తరహా మంచిపాత్రలు లభిస్తే భవిష్యత్తులోనూ నటనను కొనసాగిస్తాననీ చెబుతోందీ గాయని. కోకో లీ నటించిన 'బాంబూ షూట్' చిత్రం ఈ ఏడాది వెనిస్ ఫిల్మ్ ఫెస్టివల్‌లో ప్రదర్శించే అవకాశం వుంది.

## కోకో లీ గురించి కొన్ని వివరాలు

| | |
|---|---|
| పేరు | : కోకో లీ |
| అసలు పేరు | : ఫెర్రెన్ లీ-కెల్లీ (జన్మనామం) |
| ఎత్తు | : 5' 7" |
| జాతీయత | : చైనీయురాలు |
| పుట్టిన తేది | : 17 జనవరి 1976 |
| జన్మస్థలం | : హాంకాంగ్ |
| వృత్తి | : గాయని |
| చదువు | : రౌల్ వాలెన్‌బర్గ్ ఆల్టర్నేటిన్ హైస్కూల్ (శాన్‌ఫ్రాన్సిస్కో) యూనివర్శిటీ ఆఫ్ కాలిఫోర్నియా, ఇర్విన్ (యు.సి.ఐ) |
| తల్లి | : డాక్టర్ |
| సోదరీమణులు | : ఇద్దరు అక్కలు, ఇద్దరూ గాయనీమణులే.. |
| పేరు తెచ్చిన పాట | : 'క్రౌచింగ్ టైగర్-హిడెడెన్ డ్రాగన్' చిత్రం కోసం పాడిన 'ఏ లవ్ బిఫోర్ టైమ్ ' గీతం. |



గాయనిగా వచ్చిన అవకాశాల గురించి చెబుతూ "హైస్కూల్, గ్రాడ్యుయేషన్ శలవలకు ఓ సారి హాంకాంగ్ వచ్చాను. అక్కడప్పుడు ఆసియా స్థాయిలో వార్షికగీతాల పోటీ జరుగుతోంది. సరదాగా నేనూ పాల్గొన్నాను. అప్పటికే పేరొందిన అనేకమంది ఇతర దేశాల గాయనీగాయకులు అక్కడ పాడారు. నాకు రెండో స్థానం దక్కింది. అంత మందిలో నేనొక్కదాన్నే ఇంగ్లీష్‌లో పాడేను. అదీ విట్నీ హూస్టన్ 'రన్ టు యు' గీతం. ఆ మర్నాడే స్థానికంగా వున్న ఓ మ్యూజిక్ కంపెనీ నాతో ఒప్పందం చేసుకోవటానికి వచ్చింది. ముందురోజు పాల్గొన్న ఆసియా గాయనీ గాయకుల్లో నా గొంతు ఎంతో విభిన్నంగా వుందని ఆ మ్యూజిక్ కంపెనీ వాళ్ళు చెప్పారు" అని కోకో లీ అన్నది.

"నేను గమనించిన నాలో ప్రత్యేకత ఏమిటంటే "ఆర్ & బి ఫీల్ ను నేను పాప్ సంగీతంలో మిళితం చేస్తాను. ఆసియాలో మెలోడీకి ఎక్కువమంది ప్రాధాన్యం ఇస్తారు. అయితే ఆ రకమైన సాఫ్ట్ మ్యూజిక్ ఇవాళ యూత్‌ను ఆకట్టుకోదు. అందుకనే చిన్నతనం నుండి నేను విన్న, పాడిన పాశ్చాత్యబాణీలను స్థానిక సంగీతంలో మిళితం చేయటంలో వీళ్ళకి కొత్తగా వుండి,హుషారును కలిగిస్తుంది. అదే నా మహా రహస్యం" అంది కోకోలీ.

1994లో కోకో లీ తొలి ఆల్బమ్ విడుదలైంది. ఇంతవరకూ పన్నెండు ఆల్బమ్స్ విడుదల చేసింది. అందులో ఎనిమిది సోనీ మ్యూజిక్ ద్వారా విడుదలైనాయి. 1996లో సోనీతో కోకో ఒప్పందం కుదుర్చుకుంది. కోకో పాడింది మాండరిన్‌లో అయినా,ఆంగ్లంలో అయినా, ఆసియాలో చైనీస్ మాట్లాడే ప్రాంతాల్లో ఈ ఆల్బమ్స్‌కి మంచి గిరాకే వుంది. ఇక్కడే కాదు అమెరికాలోనూ కోకో లీ విడుదల చేసిన 'జస్ట్ నో అదర్ వే' ఆల్బమ్‌కి విపరీతమైన స్పందన వచ్చింది.

త్వరలోనే కోకో లీ మరో ఇంగ్లీష్ ఆల్బమ్‌ను విడుదల చేసే పనిలో వుంది. ఈ ఏడాది సెప్టెంబర్‌లో ఆ అల్బమ్ విడుదల అవుతోందని కోకో చెబుతోంది.

పని విషయంలో తాను రాజీపడనని చెబుతూ "పని చేసేటప్పుడు నేను మరే విషయం గురించి ఆలోచించను. అనుకున్న పనిని నూటికి నూరు శాతం కరెక్ట్‌గా చేయాల్సిందే. ఈ విషయంలో మాత్రం 'జస్ట్ నో అదర్ వే' " అంటోంది కోకో లీ.

**- వి.అరుణ సత్యవతి**

జులై 29 సినారె పుట్టినరోజు సందర్భంగా...

కవిగా
సినీ కవిగా
అధ్యాపకునిగా
ఉపన్యాసకునిగా
పలు రకాల బాధ్యతలను ప్రభుత్వపరంగా కూడా నిర్వహించిన అధికారిగా
రాష్ట్రం నుండి అంతర్జాతీయ స్థాయి వరకూ ఎన్నెన్నో సాంస్కృతిక సంస్థలకు హితైషిగా
సి.నారాయణరెడ్డి గారి స్థానం,
పొందిన గౌరవాలు
అపూర్వం... అనితర సాధ్యం...!!
ప్రతిభ, పరిశ్రమ, ప్రవర్తన ఈ మూడూ
ఆయన్ని అంటిపెట్టుకుని ఉంటాయి...
అందుకే విజయం ఆయన వెన్నంటే ఉంటుంది ఎప్పుడూ...!!
'సినీకవిగా ఆయనదో శకం' అనిపించుకున్న
సినారెతో నేటి సినిమా పాటపై కొన్ని అభిప్రాయాలను 'హాసం' పంచుకోవటం జరిగింది
అదే...

# సినీ గీతం - సినారె మనోగతం



చిత్తగించండి...

"సినిమా సంగీతానికి ఒక అసాధారణ ప్రతినిధి - 'హాసం'.

సంగీతజ్ఞుడు అంటే రాగజ్ఞుడు, స్వరజ్ఞుడు అయిన మా రాజా ఈ 'హాసం' పత్రికను నడపటంలో చూపుతున్న ఔచిత్యాన్ని నేను ఎన్నోసార్లు అభినందించాను. ఎన్నెన్నో రవ్వల్లాంటి నాటి ఉత్తమ గీతాలను, నేడు వెలువడుతున్న పాటల్లో రవ్వలేవో, గవ్వలేవో మీరే తేల్చుకోండి అన్నట్లుగా వాటిని అనేక సంఖ్యలో ఇస్తున్నందుకు సంతోషిస్తున్నాను. చక్షురక్షర సంయోగం అనే మాట ఒకటుంది. అంటే... ఓ పాట సినీ గీతం కావచ్చు, ఆకాశవాణి గీతం కావచ్చు. ముందు రాసింది స్వరపరిస్తే శ్రవ్యం అవుతుంది. సినిమాలో చిత్రీకరిస్తే అది దృశ్యమవుతుంది. కాబట్టి దృశ్య శ్రవ్య మాధ్యమానికి సినీ గీతం చాలా అద్భుతంగా సరిపోతుంది.

ఇటీవల వెలువడుతున్న ఇప్పటి సినిమాలలోని పాటలను.. సాధ్యమైనంత వరకూ సేకరించి అతడు ఈ 'హాసం' పత్రికలో ఇస్తున్నాడు. అంటే పాటలో ఏముందో... గీత రచయిత ఏం రాశాడో అని తెలుసుకోవడానికి ఈ చక్షురక్షర సంయోగ మాధ్యమం ఉపయోగపడుతుంది. అంటే చక్షువులతో అక్షరాలను ఆకళించుకోవటం. చక్షువులు.. అంటే కళ్లు. వీటికి అక్షరాలతో సంయోగం..అంటే వినే పాటను చూసి చదువుకునేటట్లు చేస్తున్నాడు. ఇది ఎవరూ చేయనిది. సినిమా పత్రికలలో, కొన్ని సమీక్షల సందర్భంలో పంక్తులిచ్చినవి ఉన్నాయి కానీ ఇట్లా పాటలకు పాటలే, పుటలకు పుటలుగా అందించటం అనేది 'హాసం' ప్రత్యేకత.

అంతేకాదు ఈ గీత రచయిత ఎవరు, సంగీత దర్శకుడు ఎవరు అనేది విశ్లేషణలతో కూడా ఇస్తున్నాడు. ఇదికాక కొంత మంది ప్రముఖులతో కొన్ని విశేషాలతో కూడిన వ్యాసాలు, కథలు రాయిస్తున్నాడు. సింగీతం శ్రీనివాసరావు ఉన్నాడు. గొప్ప దర్శకుడు. మామూలు కమర్షియల్, వాణిజ్యాత్మక దర్శకుడు కాదు. వాణీయ మూల్యాలు తెలిసినటువంటి దర్శకుడు. ఆయన రాస్తున్న ఆ సీరియల్ కథలు చదువుతుంటే.... ఆశ్చర్యమేస్తుంది నాకు. అలాగే వేటూరి సుందరరామమూర్తి గారి స్వగతాలు, సినీరంగంలో ఆయన అనుభవాలు... అవి కూడా మంచి సాహిత్య స్థాయిలో ఉన్నాయి. మిగతావి చెప్పటానికి చాలా ఉన్నాయి. 'హాసం'లో హాస్యం ఉంది సంగీతం ఉంది. హా అంటే హాస్యం. సం అంటే సంగీతం అనుకుంటే ఈ చమత్కారం బాగా కాయిన్ అయింది.

ఇక ఇటీవలి తెలుగు సినీ గీతాల గురించి మీ అభిప్రాయమేమిటని చాలా మంది అడుగుతుంటారు...అప్పుడప్పుడు..! ఒక్క విడతగా చెప్పడం కష్టం. ఆనాటి సినిమా పాటల గురించి చెబితే తప్ప నేటి సినిమా పాటల గురించి విశ్లేషించి చెప్పలేం. సూక్ష్మంగా చెప్తాను.

నాతో పాటు... నాకన్నా ముందు... తెలుగు సినిమాలలో గీతరచన చేసిన గీత రచయితలు కేవలం సినీగీత రచయితలు కాదు. ఆధునికాంధ్ర సాహిత్యంలో అగ్రశ్రేణి కవులు. కొందరు నాటక కర్తలు కూడా గీత రచయితలుగా రాణించారు. ప్రధానంగా ఆ నాటకరచయితల పట్టికలో పింగళి నాగేంద్రరావు గారు మొదలుకుని ఆత్రేయగారి వరకూ వస్తారు. వీళ్లు ఇటు సంభాషణల రచయితలు, అటు గీత రచయితలు. సముద్రాల రాఘవాచార్యులు గారు రాసిన 'చార్మినార్' అనే కావ్యం నా విద్యార్థి దశలోనే చదివాను. అందులో ఆయన అద్భుతమైన పద్యాలు రాశారు. ఇప్పుడు ఎవరికీ తెలీదు. తరువాత గీత రచయితగా, కథారచయితగా, సంభాషణల రచయితగా ఆయన ఒక అగ్రపీఠం. ఆయనొక యుగం. ఆయనొక శకం. కానీ సముద్రాల రాఘవాచార్యులు గారు ఒక మహాకవి కావలసిన వాడు కాలేదు. కారణం... ఆయన రాయటం మానేశారు.



ప్రాథమిక దశలోనో, తొలి దశలోనో రాసినటువంటి 'చార్మినార్'లాంటి కొన్ని పద్యాలు ఉండవచ్చు. సాహిత్య జిజ్ఞాసకుడ్ని కాబట్టి దానిని నేను చూశాను. నా ఇంటర్‌మీడియట్ ఏజ్‌లో ఏదో లైబ్రరీలో చూశాను. తరువాత మళ్లీ ఆయన పద్యాలు చూడలేదు. సినిమాల్లో రాసిన పద్యాలు కొన్ని ఉన్నాయి. సరే సంభాషణలు, గీతాలు... అయితే ఏమయిందీ... ఆయన గీత రచయితగా ఉండి పోయాడు తప్ప మహాకవిగా ఎదగలేదు.

పింగళి నాగేంద్రరావు గారు 'వింధ్యరాణి' లాంటి నాటకాలు రాసి సంచలనం కలిగించిన గొప్ప నాటక రచయిత. నాటక రచయితగా ఉన్నవాడు సినిమాల్లోకి వచ్చాడు. మాంఛి చమత్కారభరిత సంభాషణలు, వక్రోక్తులు, ఛలోక్తులు..నూతన పదసృష్టి చేసి సినిమా సంభాషణల రచనకు ఒక కొత్త ఒరవడి దిద్దినవాడు. పాటలు కూడా చాలా తమాషాగా రాశాడాయన. కవిత్వంపాలు తక్కువ. గ్రమిటిక్‌గా, చమత్కారభరితంగా ఉంటాయి. సందర్భోచితంగా...అంటే కథా వస్తువుకి అనుగుణంగా సంభాషణలు రాసినా వాటిని పాటలుగా తీర్చి, పల్లవులుగా చేశాడాయన. కథా రచయిత అతనే, సంభాషణల రచయితకూడా అతనే కాబట్టి ఆయన పాటలు కథకు బాగా సన్నిహితంగా ఉంటాయి.

ఆత్రేయ గారి దగ్గరకు వచ్చేసరికి ఆధునిక నాటక రంగ చరిత్రలో ఆయనదొక ప్రత్యేకమైన ప్రకరణం. ఒక ఆశ్వాసం...! నాటకరచయితగా, తరువాత సినీరంగ చరిత్రలో సంభాషణల రచయితగా, గీత రచయితగా ఆయన ప్రకరణాలున్నాయి. మొట్టమొదట ఆయన లబ్ధప్రతిష్ఠుడైనది నాటక రచయితగా. సరికొత్త, అపూర్వమైన స్థాయిలో ఆయన రాశారు. ఆ తరువాత ఆయన సినిమా రంగానికి వచ్చారు. తమాషా ఏమిటంటే... డి.వి.నరసరాజుగారు కూడా మంచి నాటక రచయితగా ఉండి సినిమాల్లోకి వచ్చారు. ఈ ఉభయులు కూడా సినిమా రంగంలోకి ప్రవేశించిన తర్వాత ముప్ఫయ్, నలభై ఏళ్ల కాలంలో ఒకటో రెండో నాటకాలు రాసుంటారు. కానీ గొప్పగా రాసిన నాటకాలన్నీ సినిమా రంగానికి రాక ముందువే. అంటే ఏమైంది...సినిమా రంగంలోకి ప్రవేశించిన తరువాత ఒక మౌలిక సాహిత్య ప్రక్రియారచన మందగిస్తుందని తాత్పర్యం.

అయితే కవులుగా ప్రవేశించిన వారున్నారు. శ్రీశ్రీ, ఆరుద్ర...ఇలా....! క్రియా వైవిధ్యం కలిగినా, కవులుగానే ప్రసిద్ధులు వీరు. కొసరాజు కూడా అంతే. ఆయన పాటల రచయితే మొదటి నుంచి. సినిమా రంగానికి ప్రవేశించిన తరువాత శ్రీశ్రీ సాహిత్యసృష్టి కవిగా అంతకు ముందున్నంత లేదు. అప్పుడప్పుడు రాశాడు. ప్రాస్తావికంగా రాశాడు. ఆరుద్ర పరిశోధన రంగంలోకి వెళ్లి పోయాడు. ఎప్పుడు వెళ్లిపోయాడు సినిమా రచన ఎప్పుడైతే సన్నగిల్లిందో...అప్పట్నించి సమగ్రాంధ్ర సాహిత్య సంపుటులు రచించటంలోకి వెళ్లిపోయాడు. అది మహా యజ్ఞం. ఏ విశ్వవిద్యాలయంలోని తెలుగు శాఖ చేపట్టదగినటువంటి కార్యక్రమం. అది ఒక వ్యక్తి చేపట్టాడు. చాలా అపూర్వమైన విషయం. ఆరుద్ర 'త్వమేవాహం' కవిగా అప్పుడు.. తర్వాత గీత రచయితగా... ఇప్పుడు ...చివరకి గుర్తుపెట్టుకునేటప్పుడు మాత్రం సమగ్రాంధ్ర సాహిత్య సంపుటల రచయిత గానే... పరిశోధకుడిగానే ... మిగిలిపోతాడు.

ఇక నేను, దాశరథి సమకాలికంగా వచ్చాం. దాశరథి కవిగా, మహాకవిగా అంతకు ముందు అనేక రచనలు చేశాడు. తర్వాత చేస్తూ వచ్చాడు. అయితే దాశరథి పూర్తిగా గీతరచయిత కాలేదు. ఒక వృత్తి తనది, ఆ వృత్తిని కాపాడుకుంటూ... దానిని నిర్వహిస్తూ గీత రచన చేశాడు.

విచిత్రమేమిటంటే ఇంత అత్యధిక సంఖ్యలో మూడువేల గీతాలు రాసిన నేను కూడా వృత్తి పరంగా సినీ గీత రచయితను కాను. అంటే ప్రొఫెషనల్ లిరిసిస్ట్‌ను కాను. లెక్చరర్‌గా ఉన్నప్పుడు 'గులేబకావళి కథ' ద్వారా ఎన్టీఆర్ నన్ను సినీరంగ ప్రవేశం చేయించారు. అంతకుముందు 'విశ్వనాథ నాయకుడు', 'కర్పూర వసంతరాయలు', 'నాగార్జున సాగరం'లాంటి కావ్యాలు వచ్చి నా పేరును ఎప్పుడో పైకి తీసుకువెళ్లాయి. వాటి కొనసాగింపే తర్వాత వచ్చిన 'విశ్వంభర', 'ఋతుచక్రం', 'మట్టి-మనిషి - ఆకాశం' లాంటి కవితా సంపుటులు, కావ్యాలు. కాబట్టి ఆగిపోలేదు నేను. ప్రతి సంవత్సరం ఒక కవితా సంపుటి వస్తూనే ఉంది. అయితే సినీగీత రచయితగా నేను ప్రవేశించి...అప్పటికి, అప్పుడప్పుడు రాస్తున్న ఇప్పటికి... నేను గీత రచయితను వృత్తిపరంగా కాలేదు. నాకు పదవి ఉంది కాబట్టి లెక్చరర్‌గా ప్రారంభమైన దశ నుండి రీడర్, ప్రొఫెసర్, అధికార భాషాసంఘం అధ్యక్షుడు, వైస్ ఛాన్సలర్ ఓపెన్ యూనివర్శిటీ, వైస్ ఛాన్సలర్ తెలుగు యూనివర్శిటీ, ఎడ్వయిజర్ టు గవర్నమెంట్, భాషా సాంస్కృతిక వ్యవహారాలకు ఎడ్వైజర్... మధ్యలో రాష్ట్రపతి నామినేట్ చేసిన రాజ్యసభ సభ్యత్వం...రేపు 20వ తారీఖు వరకూ నేను 7 సంవత్సరాలుగా రాష్ట్ర సాంస్కృతిక మండలి అధ్యక్షునిగా... ఉన్నాను.

మొదట అధికార భాషాసంఘం, చివరన ఇది రెండూ క్యాబినేట్ మంత్రి హోదాలో ఉన్నవి. మధ్యలో వైస్ ఛాన్సలర్ సరే. కాబట్టి ఇన్ని పదవుల్లో ఉంటూ కూడా నేను సినిమా పాట రాయడం మానుకోలేదు. సంఖ్యలో తేడా ఉంది. సత్తాలో లేదు. ఇప్పటికీ అదే రాస్తాను. అప్పటి నారాయణరెడ్డి..ఇప్పటి నారాయణరెడ్డి - ఒకటే సినీకవిగా! అయితే అప్పుడు నాచేత పలికించే రామభద్రుడు (పోతన మాట తీసుకున్నాను) ఒక ఎన్టీఆర్... అలాగే ఒక దాసరి... ఒక బాపు... ఒక విశ్వనాథ్... ఈ రకంగా చాలామంది ఉన్నారు. మొత్తం అందరికీ రాశాను. వీరందరూ ఇది నారాయణరెడ్డే రాయాలనుకుని కథంతా వినిపించేవారు. వినిపించి సన్నివేశం వివరించిన

తర్వాత ఈ సన్నివేశానికి ఏం రాయాలి... ఇలా రాస్తే బాగుంటుంది అంటూ తమ అభిప్రాయాలను ప్రకటించేవారు. **వాటిని మన మనసును అద్దే వాళ్లే తప్ప రుద్దే వాళ్లు కాదు.** అప్పుడు నాలోని కవి మేల్కొనేవాడు. గీత రచనా మాధ్యమం కూడా తెలుసు కాబట్టి అలవోకగా అరగంటలో రాసిన గీతాలున్నాయి, గంటలో రాసిన గీతాలున్నాయి. చరిత్రాత్మకమైన 'చరణకింకిణులు ఘల్లు ఘల్లుమన....' పాట గంటలో రాసిందే. ఇంచుమించు ఆశుకవిత్వం అది. కొత్తేం కాదు. కొన్ని సందర్భాలలో 'నారాయణరెడ్డి గారూ ఇందులో మీ ఇష్టమొచ్చినట్టు రాయండి...' అంటే రాసినవి గొప్పగా ఉన్నవి... 'మాయదారి సిన్నోడు నా మనసే లాగేసిండు...' తెలంగాణ నుడికారం అద్దుతూ రాసిన ఆ పాటను రమేష్‌నాయుడు అద్భుతంగా ట్యూన్ చేశారు. ఉదాహరణకు చెప్పాను నేను. ఇటీవలి 'ప్రేమించు' సినిమాలో మంచి సాంగ్ రాశాను.... 'కంటేనే అమ్మ అని అంటే ఎలా....' దానికి నంది అవార్డు వచ్చింది. తమాషా నంది అవార్డు... పదేళ్ల క్రితం నాకు జాతీయ స్థాయి అవార్డు వచ్చే అవకాశం ఉన్నా 'వద్దు బాబూ' అన్నారు... ఎందుకు తెలుసా అప్పట్లో నాకు జ్ఞానపీఠ అవార్డు వచ్చింది. 'జ్ఞానపీఠ అవార్డు వచ్చిన వారికి ఫిలిం సాంగ్ రైటర్‌గా ఎందుకండి...ఆయన హోదాకు వేరు. ఇంకొక సినీ గీత రచయితకు ఇస్తే సంతృప్తి పడతాడు...బాగుంటుంది. ఎలివేషన్ వస్తుంది'. అన్నట్టుగా పక్కన పెట్టినవి ఉన్నాయి. ఎందుకో ఈ నంది తప్పలేదు. సరే అది అలా వదిలిపెట్టండి.

అసలు పాట ఎలా ఉండాలి...? పల్లవి తీసుకుంటే ఆ పల్లవిలోని అభిప్రాయాలకు చరణాలు తొడుగుల్లా ఉండాలి. పల్లవి శిరస్సు అయితే చరణాలు అవయవాలు లాంటివి. అలా పాట ఒక సమగ్రమైన రూపంలో నడిచేది కాబట్టి పల్లవిలోని అభిప్రాయానికి చరణాలు ముడివేసేటట్టుగా ఉండేవి - ఎప్పుడో నృత్యగీతాలలో తప్ప! మీరు ఆశ్చర్యపోతారు యుగళగీతాలలో కూడా దుక్కిపాటి మధుసూదనరావు లాంటి వారు కథ చెప్పేవారు. 'ఈ కథలో ఈ పాయింట్సుండి... ఇవి డ్యూయెట్‌లో రావాలి' అనేవారు. అలా కథాత్మకమైన యుగళగీతాలు కూడా ఉన్నాయి. రానురాను కాల గతిని బట్టి... సమకాలీనుల అభిరుచిని బట్టి గీత స్వరూపం మారింది.



తరువాత నాతరం అయిన వెంటనే వేటూరి సుందరరామమూర్తి శకం. అతను పద్యకవిగా ప్రాచుర్యం పొందలేదు కానీ అద్భుతంగా పద్యాలు రాస్తాడు. పుస్తకరూపంలో వచ్చాయో లేదో తెలీదు. ఈ మధ్య వస్తే సన్మానసంపుటిలో ఉండొచ్చు. సంగీత రూపకాలు రాశాడు. ఆయన బి.ఎ. విద్యార్థిగా ఉన్నప్పుడు నేను ఎస్.ఆర్.ఆర్. అండ్ సి.వి.ఆర్. కాలేజీలో నన్ను వక్తగా పిలిచారు. అప్పుడు విశ్వనాథ సత్యనారాయణ గారు అధ్యాపకునిగా ఉండేవారు. అక్కడ నేను ఉపన్యసించాను. ఈయన నా మీద పద్యాలు రాసాడట. ఆ పద్యాలు పాడితే నేను మెచ్చుకుని 'కాబోయే మహాకవి ఇందులో కనిపిస్తున్నాడు' అని ప్రకటించాను. అతను పద్యరచన అంటూ చేస్తే లేక గేయకావ్య రచన అంటూ చేస్తే మరికొన్ని ఎత్తులు, మరికొన్ని శిఖరాలు అధిరోహించేవాడు. కానీ ఎప్పుడైతే సినిమా రంగ ప్రవేశం చేశాడో ఆయన చేతులకు సినిమాల సంకెళ్ల పడ్డాయి. ఎలాంటి సంకెళ్లంటే "కౌగిటి చెరసాలలో నన్ను చేరనీ'' అంటావేం అలాంటి సంకెళ్లు... అంటే ఇష్టమైన వన్నమాట. దాంట్లో రాణించాడు. ఆయనదొక శైలి, ఒక శకం. కవిత్వం రంగరించి పోశాడు, చమత్కారాలు పోశాడు. శృంగారం కొంచెం కట్టుదాటుతుందా అన్నంత వరకూ వెళ్లాడు. ఏదైతేనేం బాగా అత్యంత ప్రజాదరణ పొందినటువంటి గీతాలు రాశాడు. మౌలికంగా అతను ఒక కవి. తర్వాత గీత రచయిత అయ్యాడు. తరువాత ఎవరెవరో వచ్చారు.

అందులో సీతారామశాస్త్రి నా దృష్టికి వచ్చిన వాళ్లలో ఉన్నాడు. మా తరువాతి తరం క్రిందే లెఖ్ఖ. సీతారామశాస్త్రి పుస్తక రచన చేశాడో లేదో తెలియదు. రాసినట్టు తెలిసింది. కొన్ని పద్యాలు, గేయాలు... ఎక్కడెక్కడో ఒకటి రెండు సందర్భాలలో చూశాను. కానీ అతనిలో కూడా ప్రధానంగా ఒక కవి ఉన్నాడు. ఆ కవి గీతాలలో అప్పుడప్పుడు మందహాసం చేస్తుంటాడు. శబ్దం, అర్థం సరితూకంలో వేయటంలో సమర్థుడు సీతారామశాస్త్రి. అతను మంచివి చాలా గీతాలు రాశాడు. ప్రస్తుతం సీతారామశాస్త్రితో ఇక్కడ ఆగుతాను.

**(తర్వాత వచ్చిన సినీకవుల రచనల గురించి గాయనీగాయకులు పాడే విధానం గురించి సినీ గీతం తిరుగుతున్న మలుపుల గురించి వచ్చే సంచికలో...)**

జులై 19 రాజేంద్రప్రసాద్ పుట్టినరోజు సందర్భంగా....

# జంధ్యా మారుతం





## హాస్యంలో పిసినారితనం చూపించని

## అహ నా పెళ్ళంట





'మాయాబజార్'ని ఒక్కసారి గుర్తుకు తెచ్చుకోండి. (అసలు మరిచిపోతే కదా!) అందులో ఘటోత్కచుడు... శశిరేఖలోకి పరకాయ ప్రవేశం చేసి 'అహనా పెళ్ళంట... ఓహోనా పెళ్ళంట.. మీకు నాకు చెల్లంట' అని పాడుతూ చేసిన అల్లరి మనల్ని ఎంతలా న(క)వ్వించింది!

తెలుగు తెరపై నవ్వుకి మహారాజయోగం పట్టించిన జంధ్యాలకి ఈ పాట మీద ఎనలేని మక్కువ. అందుకేనేమో ఆ పాట పల్లవిని తన రెండు సినిమాలకి టైటిల్స్‌గా ఉపయోగించుకున్నారు. అందులో మొదటిదే 'అహ నా పెళ్ళంట'. ఆ పాటలో వున్న చమత్కారం, చిలిపితనం, వలపుదనంకు తెలుగుతనం దట్టించి 'అహ నా పెళ్ళంట' పేరుతో వెండితెర మాయాబజార్‌లో నవ్వుల పారాహుషార్ కలిగించారాయన.

రామానాయుడుకి ఓ మంచి కామెడీ సినిమా అర్జంటుగా తీయాలనిపించింది. వెంటనే జంధ్యాలకు కబురంపారు. 'పల్లకి' వార పత్రికలో రచయిత ఆదివిష్ణు రాసిన 'సత్యం గారి ఇల్లు' సీరియల్ జంధ్యాల మనసులో ముద్రపడి పోయింది. 'సత్యం గారి ఇల్లు' గురించి రామానాయుడుతో చెప్పారు జంధ్యాల. ఉన్నపళాన ఆదివిష్ణుని పిలిపించి, ఈ కథను తమ పెద్దబ్బాయి సురేష్‌బాబుకి చెప్పమన్నారు రామానాయుడు. సురేష్‌కి ఆషామాషీ కామెడీలు నచ్చవని ఇంతకు ముందే ఆదివిష్ణుకి ఎవరో చెప్పడంతో ఆయనకి కొంచెం టెన్షన్ అనిపించింది. అయితే కథను బాగా రిసీవ్ చేసుకున్నారు సురేష్.

తర్వాత రోజు రామానాయుడికి కథ వినిపించారు ఆదివిష్ణు. కథ రామానాయుడికి బాగా నచ్చేసింది. ఈ సినిమా వెంటనే చేస్తున్నట్టు రామానాయుడు ప్రకటించారు. సత్యం అనబడే ఓ పిసినారి కథే 'సత్యంగారి ఇల్లు'. ఆ పాత్ర చుట్టూ ఓ ప్రేమ కథను అల్లారు. పూర్తి స్క్రిప్ట్‌ని షూటింగ్‌కి ముందే సిద్ధం చేసేసారు.

తెలుగు సినీ నిర్మాణ రంగంలో ఓ 'ఐ.ఎస్.ఐ' మార్కులాంటి నిర్మాత డా॥ దగ్గుబాటి రామానాయుడు ఏరికోరి తన సంస్థలో జంధ్యాలతో నవ్వులపంట పండించుకున్నారు. "ఈ సినిమా కోటి రూపాయల దాకా వసూలు చేసింది. రామానాయుడు స్టూడియో కట్టడానికి పునాదిగా నిలిచిన సినిమాలలో ఇదొకటి" అని తెలిపారాయన. జంధ్యాల ఈ సంస్థలో 'మండే గుండెలు', 'కక్ష', 'అగ్నిపూలు', 'రాము' చిత్రాలకు సంభాషణలు సమకూర్చారు. దర్శకుడిగా రామానాయుడి గారి కోసం చేసిన సినిమా 'అహ నా పెళ్ళంట'. జంధ్యాలకిది 21 వ చిత్రం కాగా, డి.రామానాయుడిగారి కిది 55వ చిత్రం. రాజేంద్రప్రసాద్‌కి 87వ చిత్రం.

1987 జూన్ 23న మద్రాసు ఎ.వి.యం. స్టూడియోలోని ఆర్.ఆర్.రికార్డింగ్ థియేటర్‌లో పాటల రికార్డింగ్ జరిగింది. 'అందమా ఇదా నీ చిరునామా' అనే పాటను రమేష్ నాయుడు స్వరకల్పనలో ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, సుశీల ఆలపించగా తొలి పాటగా రికార్డు చేసారు. ఈ పాటను కొత్త రచయిత చిమ్మపూడి శ్రీరామమూర్తి రాసారు. అయితే ఎందుకనో సినిమాలో ఈ పాటను ఉపయోగించలేదు.

ఇందులో మొత్తం ఐదు పాటలున్నాయి. వేటూరి, జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు, ఎం.ఆర్.ఎస్. శాస్త్రి రచయితలు. వెన్నెలకంటితో కూడా ఇందులో పాట రాయించాలనుకున్నారు గానీ, కుదర్లేదు.

ఇది సురేష్ ప్రొడక్షన్ ప్రయివేట్ లిమిటెడ్ బేనర్‌లో నిర్మితమైంది. 'కలియుగ పాండవులు' తర్వాత ఈ బేనర్‌లో నిర్మించిన రెండో చిత్రమిది. రామానాయుడు నిర్మించిన మిగతా చిత్రాలన్నీ ఎక్కువగా సురేష్ ప్రొడక్షన్స్ బేనర్‌లోనే నిర్మితమవుతుంటాయి.

రామానాయుడి సంస్థలో జంధ్యాలకే కాదు, కథానాయకుడుగా రాజేంద్రప్రసాద్‌కి,సంగీత దర్శకుడుగా రమేష్ నాయుడికి ఇదే తొలి చిత్రం. అలాగే ఈ సంస్థలో రూపొందిన తొలి హాస్యచిత్రమిది.

జూలై 6న హైదరాబాద్‌కి ముప్ఫయి కిలోమీటర్ల దూరంలో వున్న దేవర యామిజాల గ్రామంలో ఈ చిత్రం షూటింగ్ ప్రారంభమైంది. గతంలో ఈ గ్రామంలోనే 'చండశాసనుడు' మొదలైన చిత్రాల షూటింగ్‌లు జరిగాయి. "డబ్బు మంచి సేవకుడు, చెడ్డ యజమాని లక్ష్మీపతి గారూ! డబ్బు మన అందుబాటులో వుండాలి. దానికి మనం లొంగిపోకూడదు" అని రాజేంద్రప్రసాద్, కోట శ్రీనివాసరావు తో చెప్పడాన్ని



తొలి డైలాగ్‌గా చిత్రీకరించారు.

హైదరాబాద్ పరిసర ప్రాంతాల్లోనే ఈ చిత్రం షూటింగ్ జరిగింది. మూడు పాటల్ని మాత్రం కేరళ పరిసరాల్లో చిత్రీకరించారు.

'రెండు మనసుల కలయిక ప్రేమ' అనే నిజాన్ని రుజువు చేయడానికి కోటీశ్వరుడైన తండ్రిని ఎదిరించి, సాదా మనిషిగా తన లక్ష్యాన్ని ఎదిరించడమే ఇందులో కథానాయకుని ధ్యేయం. ఈ ధ్యేయ సాధనలో సాగే కథకు పూర్తిగా హాస్యాన్ని రంగరించారు. హీరో మొదలుకుని ఇందులోని అన్ని పాత్రలూ ముఖ్యమైనవే. సందర్భోచిత హాస్యానికి ఇందులో పెద్దపీట వేసారు జంధ్యాల.

ఇందులో నూతన్ ప్రసాద్,రాజేంద్రప్రసాద్ తండ్రీ కొడుకులు. వీరిద్దరూ మాట్లాడుకునే తీరు, ప్రవర్తన చాలా విడ్డూరంగా అనిపిస్తాయి. రాజేంద్రప్రసాద్ అయితే ఆదివిష్ణుని ఈ పాత్రలని ఎలా సృష్టించారని చాలాసార్లు అడిగారు. చివరికి నిజం చెప్పక తప్పలేదు ఆదివిష్ణుకి. అసలు విషయమేమిటంటే ఈ కథకి ఆయన నిజ జీవితమే ఇన్‌స్పిరేషన్‌ట. ఆదివిష్ణుకి వాళ్ళ రెండో అబ్బాయికి రోజూ ఇదే తంతు అట. ఆ కుర్రాడి మీద వళ్ళు మండితే ఆయన తిట్టరు, కొట్టరు. ఆ కోపాన్ని ఇంటి తలుపుల మీదా,కిటికీల మీదా ప్రదర్శిస్తారట. ఆ కుర్రాడేమో రేడియో,టీవీ సెట్లను విసిరి కొడతాడట.

ఈ కథంతా విన్న రాజేంద్రప్రసాద్ ఆదివిష్ణు ఇంటికెళ్ళి ఆ కుర్రాడితో చాలా సేపు ముచ్చటించారు. 'మీ నాన్న రాసిన సినిమాలో నీ వేషం నేను వేస్తున్నాను' అనంటే 'నా వేషమా'? అని కుర్రాడు బిక్క మొహం పెట్టాడు.

ఫస్ట్ కాపీ వచ్చింది. ప్రివ్యూ వేస్తున్నారు. ఆదివిష్ణు రెండో అబ్బాయిని ప్రత్యేకంగా పిలిచేరు రాజేంద్రప్రసాద్. ప్రివ్యూ పూర్తయ్యాక 'నీ వేషం నేనెలా చేసాను?' అనడిగారు. అతనేమో మెలికలు తిరిగిపోతూ 'నాకంటే బాగా చేసారు' అని కాంప్లిమెంట్ ఇచ్చాడుట.

రాజేంద్రప్రసాద్ అంటే ఆదివిష్ణుకి చాలా ఇష్టం. 'తను ఓ కమిట్‌మెంట్ వున్న నటుడు. తాను చేసే వేషాన్ని అనేక కోణాల నుంచి పరిశీలించి అవసరమైన అధ్యయనం చేసి చక్కటి రిజల్ట్ ఇచ్చే నటుడు. చార్లీ చాప్లిన్ మనలో వున్నాడనే ధీమా కలుగుతుంది'అని ప్రశంసిస్తారాయన.

'అహ నా పెళ్ళంట' రాజేంద్రప్రాద్ నటజీవితంలో ఓ ఆణిముత్యంలా నిలిచిపోయింది. తన కెరీర్‌ని మలుపు తిప్పిన 'టాప్‌టెన్' చిత్రాల్లో ఆయన 'అహ నాపెళ్ళంట', కే అగ్రతాంబూలమిస్తారు. "అహ నా పెళ్ళంట' సినిమా - పెట్టిన పెట్టుబడికి 32 రెట్లు కలెక్ట్ చేసింది. ఈ సినిమాని చూసిన వాళ్ళెవరైనా సరే కచ్చితంగా పడిపడి నవ్వి తీర్తారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తమ హాస్యచిత్రంగా నంది అవార్డుని ఇచ్చింది. ఆ అవార్డు పొందిన చిత్రం అంతకు ముందూ లేదు, ఆ తర్వాత లేదు". అని సగర్వంగా



చెబుతారు రాజేంద్రప్రసాద్. ఇందులో రాజేంద్రప్రసాద్ తరచుగా ఉపయోగించే మాట 'ఎక్స్‌పెక్ట్ చేసా'.

అంతకు మునుపు సురేష్ ప్రొడక్షన్స్ నిర్మించిన 'ముందడుగు' చిత్రంలో రాజేంద్రప్రసాద్ కీలకమైన పాత్ర పోషించారు. అయితే ఆ చిత్ర శతదినోత్సవ షీల్డును మాత్రం ఆయన అందుకోలేకపోయారు. అప్పటినుంచి సురేష్ ప్రొడక్షన్స్ సంస్థ నుంచి ఎలాగైనా శతదినోత్సవం షీల్డుకు అందుకోవాలన్నది రాజేంద్రప్రసాద్ కోరికలలో ఒకటైంది. 'అహ నా పెళ్ళంట' చిత్రం రాజేంద్రప్రసాద్ కోరిక నెరవేర్చటమే కాకుండా, సురేష్ ప్రొడక్షన్స్‌లో సిల్వర్‌జూబ్లీ ఆడిన సినిమా హీరోగా ఓ గుర్తింపును మిగిల్చింది.

జంధ్యాల గురించి టాపిక్ వస్తే చాలు నూతన్‌ప్రసాద్ మనసు తలుపులు వెనువెంటనే తెరుచుకుని జ్ఞాపకాల ప్రవాహం వెల్లువెత్తుతుంది. "నవరసాల్లో శృంగారానికే అగ్రతాంబూలం. మనిషి పుట్టుకకి శృంగారం ప్రధాన కారణం కాబట్టే ప్రథమస్థానం ఇచ్చి వుంటారు. ఆ తర్వాతి స్థానం మాత్రమే హాస్యానిది. మనిషికి ఆనందాన్ని, సంతోషాన్ని కలిగించి, ఆరోగ్యాన్ని అందించి జీవితాన్ని ఒక అనుభూతిగా మలిచే శక్తి హాస్యానిది. త్రిమూర్తుల్లో విష్ణుమూర్తికి ఎంత గొప్ప స్థానముందో, నవరసాల్లో హాస్యానికి అంత గొప్ప స్థానముంది. ఒకానొక దశలో హాస్యానికి జబ్బుచేసి మంచాన పడితే 'శ్రీవారికి ప్రేమలేఖ' అనే మందుతో హాస్యానికి ఆరోగ్యాన్నిచ్చారు జంధ్యాల. కొన్నేళ్ల తర్వాత హాస్యం మళ్లీ అనారోగ్యం బారిన పడినప్పుడు 'అహ నా పెళ్ళంట' తీసి హాస్యాన్ని సంపూర్ణ ఆరోగ్యవంతం కావించారు జంధ్యాల. అప్పట్నుంచీ ఇప్పటివరకూ హాస్యం మంచాన్న పడలేదంటే జంధ్యాల మందు ఎలా పనిచేసిందో అర్థమవుతుంది" అని చెబుతారు నూతన్ ప్రసాద్.

ఈ పాత్ర పోషణకు ముందు నూతన్ ప్రసాద్, ఆదివిష్ణుని అడిగి 'సత్యం గారి ఇల్లు' నవలను అడిగి తీసుకుని క్షుణ్ణంగా చదివి తన పాత్ర తీరుతెన్నుల్ని అర్థం చేసుకున్నారు.

ఇందులో నూతన్ ప్రసాద్, రాజేంద్రప్రసాద్‌లు విచిత్రమైన తండ్రీకొడుకులు. ప్రపంచంలో ఇంత గాఢంగా ప్రేమించుకునే

రాజేంద్రప్రసాద్ : అదేమిట్రా,మగపెళ్ళి వాళ్ళంతా బిందెలు,చెంబులతో దిగుతున్నారేంటి?

వినోద్‌బాల : హైదరాబాద్‌లో నడివేసవిలో నీళ్ళెక్కడ దొరుకుతాయిరా, కావాలంటే ఓ లక్ష కట్నం ఎక్కువ ఇస్తాం. మీ మంచి నీళ్ళు మీరే తెచ్చుకోవాలని ఆడపెళ్ళివాళ్ళు కండీషన్ పెట్టారు. అందుకే వాళ్ళ వాళ్ళ ఊళ్ళ నుంచి నీళ్ళు తెచ్చుకుంటున్నారు.

రాజేంద్రప్రసాద్ : (రజని తో) దాహం ఎంత దారుణంగా వుంటుందో నాకు తెలుసండి. రైల్వే స్టేషన్‌లో స్టేషన్‌మాస్టరు తప్పు చేస్తే వాళ్ళకి పనిష్మెంట్‌గా కొండల్లోనో, అడవుల్లోనో వుండే స్టేషన్‌కి ట్రాన్స్‌ఫర్ చేస్తారు చూడండి. అలాగే క్రితం జన్మలో నీళ్ళు విచ్చలవిడిగా వృథా చేసిన వాళ్ళని ఆ దేవుడు హైదరాబాద్‌లో పుట్టిస్తాడని నా నమ్మకం.

రాళ్ళపల్లి : (నూతన్‌ప్రసాద్‌తో)అయ్యగారూ! మీ ఉప్పు-పులుసు తిని పెరిగిన శరీరం ఇది. ఆ సాల్ట్‌కి- సాంబారుకి అన్యాయం చేయలేను.

రాజేంద్రప్రసాద్ : గుడి చుట్టూ సైకిల్ మీద ప్రదక్షిణలు చేసేవాడిలా ఆ ఫేసేమిటి?

రాజేంద్రప్రసాద్ : మగవాళ్ళు రాస్తే ఆకాశరామన్న అని రాయాలి. ఆడవాళ్లు అయితే ఆకాశ సీతమ్మ అనాలి.

రాజేంద్రప్రసాద్ : మామూలుగా బిల్లు కట్టని వాళ్ళ చేత మీ హోటల్లో పిండి రుబ్బించటం, టేబుల్స్ క్లీన్ చేయించడం ఇలాంటి కార్యక్రమాలేమైనా నిర్వహిస్తుంటారా?

జెన్నీ : మీ ప్రశ్నకు నేనే ఉదాహరణ సార్. ఓసారి ఈ హోటల్లో భోజనం చేసి బిల్లు కట్టలేకపోయా. ఆరేళ్ళుగా ఇక్కడ పనిచేస్తున్నా.

కోట : లుంగీలు కట్టడం, తడపడం, ఆరేయడం...నీళ్ళ ఖర్చు,సబ్బు ఖర్చు,ఈ పేపర్ లుంగీ ఓ అద్భుతమైన ఆలోచన. అసలు పేపరు చీర ఎలా వుంటుందా అని ఆలోచిస్తున్నానిపుడు.

కోట : జానకీ...ఇళ్ళూ, పిల్లలు జాగ్రత్త. నా శవానికి కట్టెలెక్కువ వాడకండి. తద్దినాలకి,శార్దాలకి డబ్బులు ఎక్కువ ఖర్చు చేయకండి. నీ మంగళసూత్రం, గొలుసు బొంబాయిలోనే అమ్మండి. అక్కడ బంగారానికి రేటెక్కువ పలుకుతుంది.

రాజేంద్రప్రసాద్ : ఒక్కపూట సరిగ్గా పట్టెడన్నం, ఒక కూరముక్క, కందిగింజంత పచ్చడి,ఆరు మజ్జిగ చుక్కలు. ఇది మా మెనూ. అంతే.

కోట అలాగా! మరి చికెనూ,మటనూ తినేవాళ్ళు...?

రాజేంద్రప్రసాద్ : అవి మేమూ తింటామండి. తింటామంటే పీక్కుతినాలా చెప్పండి. ఓ కోడినో,మేకనో గుమ్మానికి కట్టేసి దానివంకే చూస్తూ లొట్టలేసుకుంటూ ఉట్టి అన్నం తింటుంటే.. ఉంటుంది ...అచ్చం చికెన్ తింటున్నట్టే వుంటుంది.

బ్రహ్మానందం : వాష్ బేసిన్‌లో చేపలు పట్టేవాడిలా ఆ ముఖం చూడు.

**సినిమాలోని హైలైట్ డైలాగ్స్‌లో కొన్ని...**

తండ్రీకొడుకులు ఎవరూ ఉండరు. అలాగే చిన్న పిల్లలకన్నా అన్యాయంగా దెబ్బలాడు కుంటుంటారు. తండ్రీకొడుకులిద్దరూ మహా తిక్కమనుషులు. తండ్రి పది సామాన్లు పగలగొడితే, కొడుకేమో ఇరవై సామాన్లు పగలగొడతాడు అని ముందే చెప్పుకున్నాం కదా... ఇందులో తన పాత్ర గురించి నూతన్ ప్రసాద్ చెబుతూ

"నా యాక్సిడెంట్‌కి ముందు 365 సినిమాల్లో నటించాను. ఆ 365 సినిమాల్లో కష్టతరమైన పాత్రలు మూడో, నాలుగో ఉంటే వాటిలో 'అహ నా పెళ్ళంట' చేరుతుంది. విచిత్రమైన తండ్రి వేషం. ప్రేమ, హాస్యం పండించడంతో పాటు తిక్క తిక్కగా కూడా ప్రవర్తించాలి. డిఫరెంట్ షేడ్స్ ఉన్న పాత్ర ఇది. జంధ్యాల స్కూల్ ప్రకారం చాలా నేచురల్‌గా ఈ పాత్రను పోషించడం జరిగింది. 'షోలే' లో అమితాబ్ బచ్చన్, ధర్మేంద్ర, గబ్బర్ సింగ్‌లు ఎవరి దారిలో వాళ్లు అదరగొడితే, సంజీవ్‌కుమార్ చాలా కామ్‌గానే ఆ పాత్రలో ఎక్స్‌ట్రార్డినరీగా నటించారు. నాకు తెలిసి ఇండియన్ స్క్రీన్ మీద టఫెస్ట్ క్యారెక్టర్ అది. ఓ పక్క రాజేంద్రప్రసాద్, ఇంకో పక్క కోట శ్రీనివాసరావు, మరో పక్క బ్రహ్మానందం, ఇంకో పక్క నేను పోటాపోటీగా నటించాం. ఆ ఏడాది బెస్ట్ సపోర్టింగ్ యాక్టర్‌గా ఐదు సంస్థల నుండి అవార్డులు అందుకున్నాను. నాకు బాగా


నూతన్ ప్రసాద్

తృప్తినిచ్చిన పాత్ర ఇది" అని అంటారాయన తన పాత్రను విశ్లేషిస్తూ....

ఆదివిష్ణు 'సత్యం గారి ఇల్లు' లోని పిసినారి సత్యం పాత్రను సినిమాకోసం లక్ష్మీపతిగా మార్చారు. ఆ పాత్రలో కోట శ్రీనివాసరావు నిజంగా జీవించారనే చెప్పాలి.

లక్ష్మీపతి పాత్రను తొలుత రావుగోపాలరావు చేత వేయించాలనుకున్నారు. లుక్ పరంగానూ, నేటివిటీ పరంగానూ ఆయన కరెక్ట్ కాదేమోనని ఎవరో సందేహం వెలిబుచ్చటంతో, జంధ్యాల కోటను ఎన్నుకున్నారు.


కోట శ్రీనివాసరావు
వీరభద్రరావు
డబ్బింగ్ జానకి

అప్పటికి కోట సినిమా ఫీల్డ్‌కొచ్చి రెండేళ్లే అవుతుంది.

సినిమాల్లో ప్రవేశించడానికి ముందు కోట స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియాలో జాబ్ చేస్తూ, తీరిక దొరికినప్పుడల్లా నాటకాలు ప్రదర్శిస్తూ ఉండేవారు. జంధ్యాల 'అమరజీవి' సినిమా చేస్తున్నప్పుడు సరదాగా కోటతో ఓ వేషం వేయించారు. అక్కినేని ఇంటి ఓనర్ పాత్రలో కనిపిస్తారాయన. కోటకి నటునిగా తొలిచిత్రం 'ప్రాణం ఖరీదు'. ఆ సినిమా తరువాత చాలా గ్యాప్‌తో 'అమరజీవి'లో నటించారు. తరువాత 'బాబాయ్ అబ్బాయ్'లో కూడా ఓ పాత్ర పోషించారు.

ఇక 'అహ నా పెళ్ళంట' విషయానికొస్తే... ఎయిర్‌పోర్ట్‌లో కనబడ్డ రామానాయుడు 'అహ నా పెళ్ళంటలో జంధ్యాల గారు నీతో పెద్ద వేషం వేయించాలనుకుంటున్నారు' అని చెప్పడంతో కోట తెగ ఆనందపడిపోయారు.

లక్ష్మీపతి పాత్ర కోసం చిన్న క్రాఫ్ చేయించుకోవాలి. అప్పటికి వేరే సినిమాల్లో బిజీగా ఉండటం వల్ల ఈ క్రాఫ్ సమస్య అవుతుందని కోట కొంచెం డైలమాలో పడ్డారు. తరువాత ఆయా దర్శక నిర్మాతల దగ్గరకు వెళ్లి విగ్గు పెట్టుకుంటానని ఒప్పించారు.

ముతక పంచె- బనీను, పగిలిన కళ్ళద్దాలతో కోట ఈ సినిమాలో కనిపిస్తారు. ఈ గెటప్‌ని జంధ్యాలే స్వయంగా డిజైన్ చేశారు. ఈ గెటప్‌లో

## పాత్రలు -పాత్రధారులు

| | |
|---|---|
| కస్తూరి కృష్ణమూర్తి | - రాజేంద్రప్రసాద్ |
| పద్మ | - రజని |
| లక్ష్మీపతి | - కోట శ్రీనివాసరావు |
| గోవిందం | - బ్రహ్మానందం |
| కస్తూరి సత్యనారాయణ | - నూతన్ ప్రసాద్ |
| పీనాసి సంఘం అధ్యక్షుడు | - వేలు |
| వెంకట్రావు | - వీరభద్రరావు |
| కుక్కుటేశ్వరరావు | - శుభలేఖ సుధాకర్ |
| అప్పన్న | -రాళ్ళపల్లి |
| రాజ్యం | - సుమిత్ర |
| సుందరం | -విజయ్ |
| సీత | -సంధ్య |
| హాస్టల్ వార్డెన్ | - శకుంతల |
| పెళ్లికొడుకు | - గౌతంరాజు |
| బేరర్ | - జెన్ని |
| ఆర్టీసీ బస్ డ్రైవర్ | - బాబూ మోహన్ |
| హోటల్ మేనేజర్ | - అశోక్‌కుమార్ |

మరియు గుండు హనుమంతరావు,విజయ్ (అమెరికా), వినోద్‌బాల,చౌదరి, విశ్వాస్, చిట్టిబాబు, నత్తిబాబు, వరదరాజు, శశికుమార్,శ్యాంబాబు, శ్రీరాజు, రామారావు, తిలక్, రాజు, మధు, చిరంజీవి రాజు, సుబ్బరాయశర్మ, జానకి, ఝాన్సీ, వీణ, కుయిలీ, అనూజ, సజన్, దుర్గా ప్రసాద్, రాజ్‌కుమార్, మాస్టర్ ప్రశాంత్,మాస్టర్ జి.వి.రెడ్డి,బేబీ గాయత్రి,జ్యోతిశ్రీ తదితరులు.

కోట కొంచెం రఫ్‌గా కనపడాలనే ఉద్దేశ్యంతో మట్టిలో దొర్లించారు. ఇందులో మొదట మామూలు కళ్లద్దాలే అనుకున్నారు. షూటింగ్ స్పాట్‌కి వచ్చాక పగిలిన కళ్లజోడు ఉంటే బాగుంటుందని భావించి జంధ్యాల ఆ కళ్లజోడును తనే చిన్న రాయి పెట్టి పగులగొట్టారు. 20 రోజుల పాటు ఆ పగిలిన కళ్లజోడుతోనే నటించారు కోట. "చాలా మంది 'పగిలిన కళ్లజోడు పెట్టుకోవటం కష్టం కదా' అని అడిగారు. ఆ వేషం మీద ఉన్న మోజులో ఏ కష్టమూ తెలీలేదు" అని చెప్పారు కోట.

షూటింగ్ జరుగుతుండగా కోటతో "నీ వేషం కనుక సక్సెస్ అయితే ఈ సినిమా కచ్చితంగా సూపర్ డూపర్ హిట్ అవుతుంది" అనేవారు రామానాయుడు.

ఇందులో కోట ఎవరికైనా సమాధానం చెప్పాలన్నా, ఏమైనా మాట్లాడాలన్నా 'నాకేంటి' అని అరచేతులతో తప్పెట కొడుతున్నట్టు కొడుతూ అడుగుతుంటాడు. బతికున్న కోడిని ఎదురుగా వేలాడదీసుకుని వట్టి అన్నం తింటూ చికెన్ తింటున్న ఫీలింగ్ ఇచ్చి తన పిసినారి తనాన్ని పీక్ లెవెల్‌లో ప్రదర్శించారు.

ఈ పాత్ర మీద కోటకు ఎనలేని మక్కువ ఉంది. "ఒక సామెతలాగా మిగిలిపోయిన పాత్ర ఇది. గయ్యాళి అనగానే సూర్యకాంతం గుర్తొచ్చినట్టుగానే, పిసినారి అనగానే 'అహ నా పెళ్లంట'లో నా పాత్ర గుర్తొస్తుంది. ఈ సినిమాలో బ్రహ్మానందం ఓ చోట 'పిసినారి తనానికి పరాకాష్ఠ ఇది' అని అంటాడు.



నిజంగా అలాంటి పాత్రే ఇది. పిసినారి పాత్రలు ఎన్ని వచ్చినా కానీ ఈ పాత్రదే అగ్రస్థానం" అని చెప్పారు కోట శ్రీనివాసరావు.

కోట అసిస్టెంట్ నత్తి గోవిందంగా అరగుండుతో బ్రహ్మానందం అదరగొట్టేశారీ చిత్రంలో... బ్రహ్మానందం కెరీర్‌కి ఈ సినిమా తిరుగులేని పునాది వేసింది. బ్రహ్మానందంకిది ఏడవ చిత్రం. తాతావతారం, సత్యాగ్రహం, చక్రవర్తి, వనివాడి ప్రాణం, స్వయంకృషి, రుద్రవీణ చిత్రాల్లో ఆయనవి 'చిరు' పాత్రలే. 'అహనాపెళ్ళంట' లో మాత్రం బాగా మెరుగైన పాత్ర. కెరీర్‌కి మెరుపు తెచ్చిన పాత్ర. బ్రేక్ నిచ్చిన పాత్ర. మళ్ళీ 'బ్రేక్' వేయాల్సిన అవసరం లేకుండా వేగంగా ముందుకు దూసుకుపోయే బలాన్ని, నమ్మకాన్ని ఇచ్చిన పాత్ర.



రాజేంద్రప్రసాద్, రజని

అసలు బ్రహ్మానందం ఈ సినిమాలోకి ఎలా ఎంటరయ్యారంటే... ఆదివిష్ణు, బ్రహ్మానందం మంచి మిత్రులు. వేసవి సెలవులకి అత్తిలి నుంచి హైదరాబాద్ వచ్చిన బ్రహ్మానందంకి ఆదివిష్ణు ద్వారా దూరదర్శన్‌లో పనిచేసే ఎం.సి.వి. శశిధర్ పరిచయమయ్యారు. ఆయన బ్రహ్మానందంతో దూరదర్శన్‌లో 'పకపకలు' పేరుతో కామెడీ స్కిట్స్ చేయించారు. అలాగే వేజెళ్ళ సత్యనారాయణకు రికమెండ్ చేసి 'శ్రీతాతావతారం' లో చిన్న వేషం ఇప్పించారు. ఆ తర్వాత జంధ్యాలకి పరిచయమయ్యారు బ్రహ్మానందం.

జంధ్యాలతో తనకెలా పరిచయమైందో బ్రహ్మానందం వివరిస్తూ -"దూరదర్శన్‌లో 'పకపకలు' ప్రోగ్రామ్ చూసి బాగా నచ్చడంతో జంధ్యాల



తనను కలవాల్సిందిగా కబురు చేశారు. అప్పుడు జంధ్యాల ఒక సినిమా షూటింగ్ కోసం హైదరాబాద్ వచ్చి అశోకా హోటల్‌లో బస చేసి ఉన్నారు. అక్కడికి వెళ్లి కలిశాను. ఆ సమయంలో జంధ్యాల స్నేహితులు ఆదివిష్ణు, బి.వి.పట్టాభిరామ్, జర్నలిస్ట్ రాజా(ఇప్పుడు 'హాసం' సంపాదకులు) తదితరులు అక్కడే ఉన్నారు. నన్ను నేను పరిచయం చేసుకున్నాను. ఆయన కోరిక మేరకు మిమిక్రీ చేశాను. నా ప్రతిభ నచ్చి జంధ్యాల అప్పట్నుంచీ తన వెంట తోడుగా ఎక్కడికి వెళ్లినా తీసుకెళ్లేవారు. తన కొత్త చిత్రం 'సత్యాగ్రహం'లో గుండు కొట్టించి ఒక కేరెక్టర్ ఇచ్చారు" అంటూ చెప్పుకొచ్చారు.

చల్లా రామకృష్ణారెడ్డి హీరోగా, సరిత హీరోయిన్‌గా చేస్తున్న 'సత్యాగ్రహం' లో విలన్ గుంటూరు శాస్త్రికి అసిస్టెంట్‌గా వేషం వేశారు బ్రహ్మానందం. ఆ సినిమా బిజినెస్ కాకపోవడంతో ఆలస్యమైంది. దాంతో జంధ్యాల, రామానాయుడిని కలిసి సురేష్ మూవీస్ ద్వారా ఈ సినిమాని రిలీజ్ చేసి పెట్టమని కోరారు. అందుకోసం రామానాయుడు 'సత్యాగ్రహం' సినిమాని చూసారు. అందులో బ్రహ్మానందం పాత్ర రామానాయుడిని బాగా ఆకట్టుకుంది.

'అహనాపెళ్ళంట' లో నత్తి గోవిందం పాత్ర కోసం మొదట సుత్తివేలుని సంప్రదించారు. అంతా ఓకే అనుకున్నాక, ఆయన డేట్స్ దొరకడం కష్టమైంది. చివరి నిమిషం వరకూ వేలు కోసం ప్రయత్నించిన రామానాయుడికి ఆ సమయంలో 'సత్యాగ్రహం'లో చేసిన బ్రహ్మానందం గుర్తుకొచ్చాడు.

అత్తిలిలో లెక్చరర్‌గా పనిచేస్తున్న బ్రహ్మానందానికి ఆ ఆదివారం మధ్యాహ్నం మద్రాసు నుంచి ట్రంకాల్ వచ్చింది. ఫోన్ చేసింది అప్పట్లో జంధ్యాల దగ్గర దర్శకత్వ శాఖలో పనిచేస్తున్న ఈనాటి ప్రముఖ దర్శకుడు ఇ.వి.వి.సత్యనారాయణ. 'అహ నా పెళ్ళంట' లో మెయిన్ కేరెక్టర్‌కి సెలెక్ట్ అయ్యారని చెప్పారాయన. వెంటనే మద్రాసు బయలుదేరారు బ్రహ్మానందం. అక్కణ్ణుంచీ ఇవివి తో కలిసి చార్మినార్ ఎక్స్‌ప్రెస్‌లో హైదరాబాద్ చేరుకున్నారు.

ఇందులో బ్రహ్మానందంది యజమాని దగ్గర భయభక్తులతో ఉండే వెర్రి వెంగళప్ప పాత్ర. అది కాస్త వెరైటీగా ఉండాలన్న ఉద్దేశ్యంతో జంధ్యాల అరగుండును ప్రవేశపెట్టారు. పాత్రకనుగుణంగా బ్రహ్మానందంకి సగం గుండు చేయించారు. కోట

శ్రీనివాసరావు సినిమా మొత్తం బ్రహ్మానందంని 'అరగుండు వెధవ' అని తిడుతుంటాడు. ఈ సినిమా నుంచి బ్రహ్మానందం పేరు ముందు 'అరగుండు' పేరు చేరింది. చాలా సినిమాల్లో ఆయన పేరు అలాగే వేసేవారు.

బ్రహ్మానందం మంచి మిమిక్రీ ఆర్టిస్ట్. నత్తిగా మాట్లాడుతూ అతను చేసిన కొన్ని ఎపిసోడ్స్ జంధ్యాలకు బాగా నచ్చాయి. అందుకే గోవిందం పాత్రకు నత్తి పెడితే బాగుంటుందని అప్పటికప్పుడు నిర్ణయించుకున్నారు జంధ్యాల. ఓ పక్క అరగుండు, ఇంకోపక్క నత్తితో గోవిందయ్య పాత్రలో అద్భుతంగా ఇమిడిపోయారు బ్రహ్మానందం.

మొదటి రోజు షూటింగ్‌లో రామానాయుడు, బ్రహ్మానందంను పిలిచి 'ఇందులో నీది చాలా పెద్ద క్యారెక్టర్. చాలా జాగ్రత్తగా చేయాలయ్యా' అని భుజం తట్టారు.

విద్యాసాగర్ దగ్గర కట్నం డబ్బులు ముందే తీసేసుకుని, తీరా పెళ్లి సమయానికి మళ్లీ డబ్బులు గుంజాలని ప్రయత్నించిన కోటని అసహ్యించుకుని, 'నీ దగ్గర పనిచేసేకన్నా పందులు కాసుకోవటం మేలు' అని డైలాగ్ చెప్పాలి బ్రహ్మానందం. కానీ ఈ డైలాగ్‌కు ముందు కోట డిప్పమీద చిన్నగా జెల్ల కొట్టాలి. కోట అప్పటికే సీనియర్ ఆర్టిస్ట్. దాంతో బ్రహ్మానందం భయపడిపోయి ఆ సీన్ చేయటానికి ఐదు టేకులు తిన్నారు. జంధ్యాల కోప్పడ్డారు. దాంతో బ్రహ్మానందం మనసు రాయి చేసుకుని కోట డిప్పమీద పెళ్లున కొట్టి, టకటకా డైలాగులు చెప్పేసారు. తన డిప్పమీద అంత దెబ్బ కొడతాడని ఊహించని కోట నిజంగానే బిత్తరపోయారు. దాంతో ఆ షాటు ఓకె అయిపోయింది. యూనిట్ సభ్యులంతా క్లాప్స్ కొట్టారు. బ్రహ్మానందం భయంభయంగా కోట దగ్గరకు వెళ్లి 'సారీ' చెప్పారు. కోట నవ్వేసి బ్రహ్మానందం నెత్తిమీద ముద్దుగా మొట్టికాయ వేసి 'నీకు మంచి భవిష్యత్తు ఉంటుందోయ్' అని ఆశీర్వదించారు.

పదిరోజుల షెడ్యూల్ జరిగింది. తన వర్క్ పూర్తి కావడంతో తిరిగి అత్తిలి వెళ్లిపోయారు బ్రహ్మానందం.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| బేనర్ | : సురేష్ ప్రొడక్షన్స్ (ప్రై)లిమిటెడ్ |
| కథ | : ఆదివిష్ణు |
| పాటలు | : వేటూరి, జొన్నవిత్తుల, ఎం.ఆర్.ఎస్.శాస్త్రి |
| నేపథ్య గానం | : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పి.సుశీల, వాణీజయరామ్, నాగూర్ |
| కళ | : రవి |
| ఆపరేటివ్ కెమెరామెన్ | : శ్రీనివాసరెడ్డి |
| కెమెరా సహాయకులు | : విజయకుమార్, రసూల్ |
| దర్శక సహకారం | : బత్తుల రామకృష్ణ, జె.పుల్లారావు |
| అసోసియేట్ డైరెక్టర్ | : ఇ.వి.వి. సత్యనారాయణ |
| నృత్యాలు | : తార-రఘు |
| ఎడిటింగ్ | : కె.ఎ. మార్తాండ్ |
| సంగీతం | : రమేష్ నాయుడు |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : ఎస్.గోపాలరెడ్డి |
| నిర్మాత | : డి.రామానాయుడు |
| రచన -దర్శకత్వం | : జంధ్యాల |

ఆయన 'అరగుండు' ని చూసి అక్కడ స్టూడెంట్స్, తోటి లెక్చరర్స్ తెగ ఆశ్చర్యపోయారు. 20 రోజుల తర్వాత మళ్లీ హైదరాబాద్ నుంచి పిలుపు. చిన్న క్లోజప్ షాట్ బ్యాలెన్స్ వుందట. అప్పటికే బ్రహ్మానందం జుట్టు మామూలుగా వచ్చేసింది. వెంటనే హైద్రాబాద్ చేరుకుని సురేష్ ప్రొడక్షన్స్ ఆఫీస్ పక్కనే వున్న బార్బర్ షాప్ కెళ్ళి 'అరగుండు' చేయించుకొచ్చి ఆ షాట్‌లో పాల్గొన్నారు బ్రహ్మానందం. "అప్పుడు నా ఫేస్ చూసి జంధ్యాల గారు తెగ ఎంజాయ్ చేయటం నాకు ఇప్పటికీ గుర్తుంది" అని ఆనాటి రోజుని జ్ఞప్తికి తెచ్చుకుని తెలిపారాయన 'హాసం'తో.

తర్వాత మద్రాస్‌లో ప్రివ్యూ వేశారు. థియేటర్‌లో ఎవరూ పెద్దగా నవ్వకపోవడంతో బ్రహ్మానందంకి దిగులు పట్టుకుంది. 'మామూలు సినిమా థియేటర్‌లో లాగా ఇక్కడ అంత బైటపడి ఎంజాయ్ చేయరు. చేసినా బయటపడరు. చూస్తూండు... ఈ సినిమాలో నీకెంత పేరు వస్తుందో' అని ధైర్యం చెప్పారు జంధ్యాల.

రిలీజ్ రోజున ప్రేక్షకుల మధ్య కూర్చుని సినిమా చూసారు. ఈ అరగుండుగాడెవడో చాలా బాగా చేసాడని ప్రేక్షకులు అనుకోవడంతో బ్రహ్మానందంకు తన కల నిజమయిందనిపించింది. ఆ సినిమా పోస్టర్ చూసుకోవడం కోసం అత్తిలి నుంచి తాడేపల్లిగూడెం వెళ్ళేవారు. మూడోవారం కోటతో తన సోలోపోస్టర్ అత్తిలిలో అతికించేసరికి ఇక బ్రహ్మానంద భరితులైపోయారాయన.

ఈ చిత్రం రిలీజ్ అవగానే బ్రహ్మానందంకి 14 చిత్రాల్లో ఆఫర్స్ వచ్చాయి. "ఈ సినిమా తర్వాత నువ్వు చాలా బిజీ ఆర్టిస్ట్‌వి అవుతావ్' అని నన్ను ఆశీర్వదించిన జంధ్యాల, రామానాయుడు, ఆదివిష్ణుల మాటలు నిజమయ్యాయి. ఈ సినిమా నా నటజీవితానికి బలమైన పునాది వేసింది" అని మెరిసే కళ్ళతో చెప్పారు బ్రహ్మానందం.

ఇందులో అరగుండు పాత్రకు ఐదు వేల రూపాయల పారితోషికం అందుకున్న బ్రహ్మానందం 'అహ నా పెళ్ళంట' మొదలుకుని జంధ్యాల దర్శకత్వం వహించిన అన్ని చిత్రాలలోనూ (ఒక్క 'అఆఇఈ' సినిమా తప్ప) ప్రధాన పాత్రలనే పోషించారు.

ఈ సినిమాలో క్లైమాక్స్ అంటే బ్రహ్మానందంకు చాలా ఇష్టం. ముఖ్యంగా తన పాత్రకు, చెవిటి పాత్ర వేసిన గుండు హనుమంతరావుకు మధ్య జరిగిన సంభాషణలను గుర్తు తెచ్చుకుని పదే పదే నవ్వుకుంటారాయన. "గుండుకు చెవుడు. నాకు నత్తి. నేను మామూలుగా మాట్లాడినప్పుడు ఏం వినబడలేదంటాడు. నేను నత్తిగా మాట్లాడినప్పుడు మాత్రం 'అవునా..అలాగా...' అంటాడు. ఈ సీన్ చేస్తున్నప్పుడు యూనిట్‌లో అందరూ బాగా ఎంజాయ్ చేశారు. చాలా బాగా చేశానని రామానాయుడు గారు కూడా మెచ్చుకున్నారు" అని చెప్పారు బ్రహ్మానందం.

'నత్తి గోవిందం' పాత్రకి డేట్స్ అడ్జస్ట్ కాక మిస్ చేసుకున్న సుత్తివేలుతో ఇందులో ఓ అతిథి




**1987లో ఉత్తమనటునిగా దిలీప్‌కుమార్ నుండి రాజేంద్రప్రసాద్ అవార్డ్ తీసుకుంటున్న దృశ్యం ఫోటోలో టి.సుబ్బిరామిరెడ్డి కూడా ఉన్నారు**

| | |
|---|---|
| రిలీజ్ | : 27-11-1987 |
| నిర్మాణవ్యయం | : సుమారు 16 లక్షలు |
| నిర్మాణప్రాంతాలు | : హైదరాబాద్, దేవరయామిజాలగ్రామం |

## పాటలు

స్వాగతం ఈ దినం
రాజేంద్రప్రసాద్,కుయిలీ

తిక్కన పాడింది భారతం
రాజేంద్రప్రసాద్,రజనీ

ఇది శృంగార గంగావతారణం
రాజేంద్రప్రసాద్,రజనీ

కస్తూరి రంగయ్య కరుణించవేమయ్యా
రాజేంద్రప్రసాద్,రజనీ

బట్టలు కట్టే విషయంలో వేమన
యోగికి వారసులం
రాజేంద్రప్రసాద్,కోట,బ్రహ్మానందం,
వేలు తదితరులు

పాత్ర చేయించుకున్నారు జంధ్యాల. 'అఖిల భారత పీనాసి సంఘం' అధ్యక్షునిగా ఓ పాటలో కూడా పాల్గొని ఉన్న కాసేపు నవ్వించారు వేలు. "నమస్కారం... మీకాన్త ఆలస్యంగా కనిపిస్తున్నాను, ఏమీ అనుకోకండి" అని సుత్తివేలు తన ఇంట్రడక్షన్‌లో డైలాగ్ చెప్పడం సందర్భోచితంగా కుదిరింది.

కోట శ్రీనివాసరావు పీనాసితనానికి బట్టలు చించుకుని వెర్రివాడిగా మారే పాత్రలో సుత్తి వీరభద్రరావు చిక్కటి హాస్యంతో చిందులు వేసారు.

సుత్తివీరభద్రరావు - సుత్తివేలు జంటలాగా మిక్కిలి ప్రాచుర్యం పొందిన హాస్యజంట కోట శ్రీనివాసరావు - బాబూమోహన్. ఈ సినిమా నాటికి బాబూమోహన్ చిన్న చిన్న పాత్రలే చేస్తున్నారు. పతాక సన్నివేశాల్లో ఆర్‌టిసి బస్ డ్రైవర్‌గా ఇందులో కనిపిస్తారాయన. 'బస్సులు తెమ్మంటారా'అంటూ కోటని బెదిరిస్తూ ఓ డైలాగ్ కూడా చెబుతారు. ఆయనకు డబ్బింగ్ వేరే ఎవరో చెప్పారు.

నేటి రెబెల్ పాత్రల తెలంగాణా శకుంతల ఇందులో హాస్టల్ వార్డెన్‌గా చిన్న పాత్రే చేసినా, బాగానే కామెడీ సృష్టించారు.

గాయం,నువ్వు-నేను మొదలైన ఎన్నో విజయవంతమైన చిత్రాలకు ఫోటోగ్రఫీ సమకూర్చడమే గాక, ఇటీవలే 'ఒకరికి ఒకరు'తో దర్శకునిగా మారిన రసూల్ ఈ చిత్రానికి కెమెరా అసిస్టెంట్‌గా పని చేసారు.

హైదరాబాదులోని నీటి సమస్యను ఆనాడే ఊహించి రాజేంద్రప్రసాద్‌తో మంచి డైలాగ్ చెప్పించారు జంధ్యాల. బస్టాప్‌లో నిలబడ్డ రజనీకి సోడా అందిస్తూ రాజేంద్రప్రసాద్ చెప్పిన ఆ డైలాగ్ ఇప్పుడు విన్నవారు 'జంధ్యాలకి మంచి ముందుచూపు వుందే' అని అభినందించకుండా వుండలేరు.

ఇందులో ప్రతి పాత్రా ఓ కార్టూన్ సీరియలే. తన గురించి తెలియదన్న ప్రతివారికి తన ఆటోబయోగ్రఫీ గురించి చెబుతూ బుర్రతినే పాత్రలో నూతనప్రసాద్ తనదైన శైలిలో హాస్యాన్ని పండించారు. నూతనప్రసాద్ తన ఆటోబయోగ్రఫీని వివరించే సమయంలో ఉపయోగించిన రీ - రికార్డింగ్ బిట్ బాగుంటుంది. నాటకంలాగ నూతన్‌ప్రసాద్ చనిపోయినట్టు నటించే సన్నివేశంలో సింబాలిక్‌గా బాల్చీ తన్నేయడం లాంటి సీన్లు బాగుంటాయి.

పెళ్ళి చూపుల్లో శుభలేఖ సుధాకర్,అతని ఇద్దరూ బ్రదర్స్ టిఫిన్స్ తినేముందు వినాయక ప్రార్థన చేయడం, అన్నదమ్ములిద్దరూ సుధాకర్‌కి పినరంత ప్రసాదంలా పెట్టి మొత్తం లాగించేయడం. వాళ్ళలా తింటుంటే, కోట వాళ్ళని తినేసేలా చూస్తూ తెగ తిట్టుకోవడం... ఇవన్నీ నవ్వబుల్‌గా ఉంటాయి. ఆ సీన్‌లో ఆవకాయని టిఫెన్‌లా తింటూ మొత్తం జాడీని ఖాళీ చేసిన ఓ వ్యక్తి పేరు విజయ్. అమెరికాలో ఉంటారాయన. తర్వాత ఇతను జంధ్యాల తీసిన 'పడమటి సంధ్యారాగం' సినిమాలో తిండిపోతుగా నటించారు. అతనితో కోటకి 'మీ క్షుత్తుకు జోహార్లు' అనే డైలాగ్ ఒకటుంది. 'క్షుత్తు' అన్న పదం అంతకు ముందు తెలుగు సినిమాల్లో ఎక్కడా ఎవరూ ఉపయోగించలేదు. మనం 'క్షుద్బాధ' అని వాడుతుంటాం చూడండి ఆ సమాసం - ఈ 'క్షుత్తు' అనే పదం నుండి పుట్టినదే! క్షుత్ అంటే ఆకలి. ఇటువంటి అరుదైన ప్రయోగం చేసినందుకు కొందరు సినీ సాహిత్య పరిశీలకులు తనని అభినందిస్తుంటే తెగ ఉప్పొంగి పోయేవారు జంధ్యాల.

కోటని బ్రహ్మానందం మనసులో తిట్టుకున్నప్పుడల్లా చిన్న పాజ్ ఇచ్చి డైలాగ్స్ వెనకనుంచి వినిపింప చేయటం భలే గమ్మత్తుగా అనిపిస్తుంది.

తండ్రికి తన ప్రేమను తెలియజెప్పడం కోసం రాజేంద్రప్రసాద్ తన ప్రేయసి రజనీతో కలిసి తిరుగుతున్నప్పుడు ఓ క్యాంటీన్‌లో ఉన్న రేడియోనుంచి వచ్చే పాటలు, మధ్యమధ్య వచ్చే వాణిజ్య ప్రకటనలకు అనుగుణంగా ఆడటం జంధ్యాల మార్క్ తమాషా థాట్. 'ఇది శృంగార గంగావతరణం' అనే పాట, నిర్మా సోప్ వాణిజ్య ప్రకటన, 'ప్రేమనగర్' తమిళపాట, లైఫ్ బాయ్ సోఫ్ వాణిజ్య ప్రకటన,'మేరీ అంగ్‌నేమే, హిందీ పాట, క్రేన్ వక్కపొడి ప్రకటన 'అహనా పెళ్ళంట' పాట....వీటన్నిటినీ కలిపి మిక్చర్ సాంగ్ అందించి భలే కామెడీని క్రియేట్ చేసారు జంధ్యాల.

'అహ నా పెళ్ళంట' తర్వాత చిత్రాలలో హాస్యరస ప్రాధాన్యం విపరీతంగా పెరిగిపోయింది. హాస్యనటులకి డిమాండ్ పెరిగింది.

పౌరాణికాల్లో 'మాయాబజార్'లాగా, సాంఘికాల్లో 'మిస్సమ్మ'లాగా, హాస్యరస చిత్రాల్లో 'అహ నా పెళ్ళంట' ప్రధానంగా నిలిచిపోయిందని నూతన్ ప్రసాద్ అన్న మాటల్లో అతిశయోక్తి లేదని తెలుగు ప్రేక్షకులే సవినయంగా అంగీకరించారు.

## కథాంశం

శ్రీమంతుడైన కస్తూరి సత్యనారాయణకి ఒక్కగానొక్క కొడుకైన కృష్ణమూర్తి స్నేహితుని పెళ్ళిలో పద్మని చూసి ప్రేమిస్తాడు. తన ప్రేమ విషయాన్ని తండ్రికి చెబుతాడు. తన భార్య కిచ్చిన మాట ప్రకారం ప్రేమ వివాహం తనకిష్టం లేదని చెబుతాడు సత్యనారాయణ. వెంకటాపురానికి చెందిన మహా పిసినారి లక్ష్మీపతి కూతురే పద్మ అన్న సంగతి తెలుస్తుంది సత్యనారాయణకి. అందుకే పద్మని మరిచిపొమ్మంటాడు. కోటీశ్వరుడు కొడుకునని చెప్పకుండా మూడు నెలల్లోగా లక్ష్మీపతిని ఒప్పించి పద్మని పెళ్లి చేసుకోమని పందెం కాస్తాడు సత్యనారాయణ. తండ్రితో ఛాలెంజ్ చేసి వెంకటాపురానికి వచ్చిన కృష్ణ లక్ష్మీపతి ఇంట్లోనే అద్దెకు దిగుతాడు. వజ్రాన్ని వజ్రంతోనే కోయాలన్నట్టుగా కృష్ణ కూడా మహా పిసినారిలా నటించి లక్ష్మీపతికి బాగా దగ్గరౌతాడు. ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించి కూతురికి పెళ్ళిచూపులు ఏర్పాటు చేయిస్తాడు లక్ష్మీపతి. తన తెలివితేటలతో ఆ పెళ్ళి జరగకుండా చూస్తాడు కృష్ణ. కృష్ణ వీర పీనాసితనానికి మురిసిపోయి తన కూతురునిచ్చి పెళ్ళి చేస్తానంటాడు లక్ష్మీపతి. ఈలోగా సత్యనారాయణ వెంకటాపురం వచ్చి లక్ష్మీపతి ఇంట్లోనే చేరతాడు. కృష్ణను లక్ష్మీపతి అవమానిస్తుంటే అడ్డుకుంటాడు సత్యనారాయణ. పద్మని పెళ్ళిచేసుకుంటామని కన్యాశుల్కమిస్తానని చాలామంది వరులు వస్తే వాళ్ళందరికీ లక్ష్మీపతి హామీ యిస్తాడు. భార్య జానకి, కూతురు పద్మ అతని మీద తిరగబడతారు. చివరికి కృష్ణపద్మల పెళ్ళికి అంగీకరిస్తాడు లక్ష్మీపతి.

'మాయాబజార్' లోని 'అహ నా పెళ్ళంట' పాటతోనే టైటిల్స్ ప్రారంభించించి మొదట్నుంచి జంధ్యాల ఓ మూడ్ క్రియేట్ చేయగలిగారు.

సినిమా చివర్లో 'శుభం' కార్డుకు బదులు 'నవ్వండి-నవ్వించండి- నవ్వు ఆరోగ్యకరం' అని వేసి జంధ్యాల మరోసారి తన సమయస్ఫూర్తి, చతురతను నిరూపించి ప్రేక్షకులకు గుర్తుండేలా ఫినిషింగ్ టచ్ ఇచ్చారు.

ఈ సినిమాలో పిసినారి తనాన్ని నభూతో నభవిష్యతి అన్న రీతిలో తెరకెక్కించిన జంధ్యాల తన బలం, జీవం, ప్రాణమైన హాస్యరసంలో మాత్రం పిసినారితనం చూపకుండా, నవ్వులను వంచిపెట్టడంలో విచ్చలవిడితనాన్ని ప్రదర్శించారు. కాకపోతే ఆ నవ్వులమీద వడ్డీ హక్కులన్నింటినీ తెలుగు ప్రేక్షకులకే వదిలేసారు - శాశ్వతంగా...!!

-పులగం చిన్నారాయణ

# తాతా ధిత్తై తధిగిణతోం

సీరియల్ 17

- జీడిగుంట రామచంద్రమూర్తి

| పాత్రలు | నటీనటుల సజేషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.



**జరిగిన కథ**

విష్ణుమూర్తి అనే బిజినెస్‌మెన్ కూతురు అశ్విని. తనతోపాటు కాలేజీలో చదువుతున్న పల్లెటూరి యువకుడు శ్రీరామ్‌ను ప్రేమించింది. తండ్రంటే భయపడే అతనికి ధైర్యం నూరిపోసింది. విష్ణుమూర్తి స్వయానా వెళ్లి అడిగినా అవమానించి పంపిన తండ్రితో పోట్లాడి శ్రీరామ్ తన పంతం సాధించుకుంటాడు. ఈ లోగా విష్ణుమూర్తి ఇంటికి బావమరిది హనుమంతు కొడుకు గోపాలంతో సహా వచ్చి అమెరికానుండి వచ్చామని కోతలు కోస్తాడు. అశ్వినిని గోపాలానికి ఇవ్వడానికి విష్ణుమూర్తి నిశ్చయిస్తాడు. కానీ అశ్విని ఆత్మహత్యకు ప్రయత్నించడంతో మనసు మార్చుకుంటాడు

**- ఇక చదవండి**




"ఆ విషయం చెప్పాలనే వచ్చాను.. అమ్మాయి ఆత్మహత్య చేసుకోవాలనుకుందంటే -ఆ కుర్రాణ్ణి అదెంతగా ప్రేమించిందో అర్థం చేసుకున్నాను..... అదృష్టం బావుంది, అది నాకు మళ్లీ దక్కింది...నీకు తెలుసుగా, దాన్ని నేనెంత అల్లారుముద్దుగా పెంచానో..? దాని ముద్దు ముచ్చట్లు తీర్చటం కన్నతండ్రిగా నా బాధ్యత...వాళ్ల అమ్మే బ్రతికుంటే ఎలా పెంచేదో...ఈ పరిస్థితిలో ఎలా నచ్చచెప్పి ఒప్పించేదో....? నేను మాత్రం దాని మనసు నొప్పించలేను...అందుకే దాన్ని ఆ శ్రీరామ్ కిచ్చి పెళ్ళి జరిపిస్తాను.."

షాక్ నించి తేరుకోలేక అలాగే చూస్తూ, వింటున్నాడు హనుమంతు.

విష్ణుమూర్తి సోఫాలోంచి లేచి అతన్ని చేరుకుని- రెండు చేతులూ పట్టుకుని మళ్లీ చెప్పేడు.

"గోపాలానికిచ్చి చేయాలని ఆశపడిన మాట వాస్తవం... కానీ ఇప్పుడు ఈ పరిస్థితుల్లో ఆడిన మాట తప్పవలసొస్తోంది... ఏమీ అనుకోకు...! మీరు ఇప్పుడూ, ఎప్పుడూ నావాళ్లే..! మీ గోపాలం అల్లుడు కాలేకపోతున్నాడన్నమాటే గానీ - నాకు మేనల్లుడే!.. మీరు ఇక్కడే వుండవచ్చు... గోపాలం నా కంపెనీ వ్యవహారాలు చూడచ్చు... ఈ విషయం చెప్పాలనే వచ్చాను!" -అంటూ, హనుమంతు సమాధానికి కూడా ఎదురు చూడకుండా ఆ గదిలోంచి బయటకు నడిచాడు.

* * *

వసారా గదిలో వాతావరణం గంభీరంగా వుంది..! చేతులు వెనకాలకు పెట్టుకుని...వసారా అంతా అటూ ఇటూ కాలుకాలిన పిల్లిలా కలయ తిరుగుతున్నాడు వీరభద్రం.

వంటింటి గుమ్మం దగ్గర..గోడవారగా నిలబడి, చేటలో బియ్యం బాగుచేస్తోంది పార్వతమ్మ...

గదిలో మధ్యగా వున్న చెక్క కుర్చీలో తలవంచుకుని కూర్చున్నాడు శేషగిరి...రెండు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి..ఆ తర్వాత, వీరభద్రం వచ్చి శేషగిరికి ఎదురుగా కూర్చున్నాడు.

"తానొకటి తలిచిన దైవమొకటి తలచునన్నమాట అక్షర సత్యమని ఇప్పుడు రుజువైనది శేషగిరీ!" అన్నాడు వీరభద్రం గాఢంగా నిట్టూర్చి.

"మీరు తలచుకుంటే ఆ దైవాన్ని కూడా ఎదిరించగలరు బావగారూ! ఈ ఇంట్లో మీ మాటకు తిరుగులేదని నాకు తెలుసు!..మీ పట్ల పిల్లలు ఎలాంటి భయభక్తులు ప్రదర్శిస్తారో కూడా చాలాసార్లు గమనించాను.. ఈ నాలుగేళ్ళనించీ మీకు దూరంగా టౌన్లో వుండి చదువుకున్నాడు కనుక ..'ప్రేమా..గీమా'అంటూ శ్రీరామ్ కొంచెం చొరవగా మాట్లాడివుండచ్చు! ..అంత మాత్రం చేత మొదట్నించీ అనుకున్న సంబంధాన్నీ... మన బాంధవ్యాన్నీ ఒదులుకోవటం భావ్యమంటారా చెప్పండి? ...అయినా మీరు గట్టిగా కళ్ళెర్ర చేసి చెప్తే శ్రీరామ్ మీ మాటను కాదనడన్న నమ్మకం నాకుంది బావగారూ!" ప్రాధేయపూర్వకంగా చూస్తూ చెప్పేడు శేషగిరి.

నిజానికి 'బావగారూ' అని వీరభద్రం చేత శేషగిరి పిలిపించుకోవాలి....కాని వీరభద్రం పట్ల వున్న భయభక్తుల కారణంగానో తనకు మొదట్నించీ ఆస్తిపాస్తుల్లేని కారణంగానో శేషగిరి, వీరభద్రాన్ని 'బావగారూ' అని మర్యాద పూర్వకంగా పిలుస్తూంటాడు.....

అతను చెప్పిన మాటవిని ఆలోచిస్తూండి పోయిన వీరభద్రాన్ని గమనించి శేషగిరి మళ్లీ అన్నాడు.

"ఆనాడు మీ చెల్లిలి కిచ్చిన మాట తప్పుతారని నేను ఏనాడు అనుకోలేదు బావగారూ!"

"నిజమే శేషగిరీ! నా సోదరికి ఆనాడు మాట ఇచ్చిన సంగతి వాస్తవమే! ఇచ్చిన మాట తప్పుట మా రావుబహద్దర్ల వంశమున లేదు గాక లేదు.. పిల్లల ఆలోచనా విధానాల్లో ఈనాడు మార్పులు సంభవిస్తున్నాయి.. ఒకప్పుడు తల్లితండ్రుల మాటను పిల్లలు శిరోధార్యంగా గౌరవించేవారు. కానీ ఇప్పుడు.. పిల్లల మాటను పెద్దలే వినవలసిన పరిస్థితి ఏర్పడింది. వినకున్నచో .... ఇల్లు విడిచిపోవటం, ఆత్మహత్యలకు పాల్పడటం వంటి దుష్కృత్యములకు పాల్పడుతున్నారు. అందుకే మా కుమారుడి మాట మన్నించవలసి వచ్చింది!" చెప్పాడు వీరభద్రం.

శేషగిరి నిస్సహాయంగా చూశాడు..ఇలా జరుగుతుందని అతను ఊహించకపోవటం వల్ల ఒకవైపు బాధ, మరోవైపు ఉక్రోషం అతని



మనసును అల్లకల్లోలం చేశాయి. ఇంత కాలంగా, తాను తెగిన గాలిపటంలా తిరుగుతున్నా.. తనకున్న ఒక్కగానొక్క కూతురికీ భవిష్యత్తులో ఓ మంచి ఆసరా దొరుకుతుందన్న నిశ్చింతలో వున్నాడు.. ఇప్పుడు 'ఈ సంబంధం కాకపోతే తన కూతురు భవిష్యత్తు ఏం కావాలి..?' ఆ ఆలోచనను అతను భరించలేక పోతున్నాడు... పక్కనే వున్న పార్వతమ్మ దగ్గరకు నెమ్మదిగా నడిచాడు..

“మీరైనా నా బాధను అర్థం చేసుకోండి అక్కయ్యగారూ..! ” అన్నాడు అర్థింపుగా..

“మా ప్రయత్నాలు మేం చేసిన తర్వాతనే మీకు కబురుపెట్టాం తమ్ముడుగారూ..తను ప్రేమించిన అమ్మాయితో పెళ్లి జరిపించక పోతే.. మమ్మల్నీ ఈ ఇంటినీ విడిచిపోతానంటూ బెదిరించాడు మా వాడు! ..ఇంటికి పెద్దవాడు..రేపు మరింత వయస్సు మళ్ళిం తర్వాత మమ్మల్ని చూసుకోవాల్సిన వాడు... వాణ్ణి ఎలా వదులుకోగలం చెప్పండి..? ....అందుకే మేం తలవంచక తప్పలేదు... అయినా మీ అమ్మాయికి మా వాడు కాకపోతే...మరో కుర్రాడే దొరక్కపోతాడా..? త్వరలోనే ఓ మంచి సంబంధం చూసి...ఆ ముచ్చట కూడా జరిపిద్దాం.. అందుకు మీ బావగారు కూడా నడుం కట్టుకుంటారు! మీరు నిశ్చింతగా వుండండి..!” అని చెప్పి వంటింట్లోకి వెళ్లిపోయింది పార్వతమ్మ.

శేషగిరి నిశ్చేష్టుడై మిగిలిపోయాడు..

వీరభద్రం అతని దగ్గరగా వచ్చి భుజం మీద చేయివేసి చెప్పాడు..

“అయినా వివాహాలు స్వర్గంలో జరుగుతాయని చెప్తూంటారు శేషగిరీ..! ఆ భగవంతుడు ఎవర్ని ఎవరికి ముడివేసి వుంచునో మానవమాత్రులం.. మనకు తెలియదు కదా...! పీటల వరకూ వచ్చిన వివాహములు సైతం ఆగిపోతున్న సందర్భములు నీకు తెలియనివి కావు...పెళ్లి జరిగిన పిదప కూడా కొంతకాలము కాపురంచేసి, పిల్లల్ని కని, విడిపోవుచున్న జంటల గురించి మనం రోజూ పేపర్లో చదువుతున్నాం. కనుక...”అంటూ ఇంకా ఏదోచెప్పబోతున్న వీరభద్రం వైపు చురుక్కున చూసి ..ఇంక ఆపమన్నట్టు చెయ్యి అడ్డుపెట్టాడు శేషగిరి.

“ఇంకేం చెప్పకండి..! మీ వంశమూ, మీరు మాటకు కట్టుబడేవారన్న నమ్మకంతో నా కూతురికి వేరే సంబంధం చూడాలన్న ఆలోచనలే నా మనసులోకి రానీయలేదు. కట్నకానుకలు తీసుకునే వాడివి కాదు కదా..! అనే నమ్మకంతో దానిపెళ్లికోసం..నాలుగు డబ్బులు కూడ వెనకేసుకోకుండా ...ఉన్న ఆస్తినంతా కళాసేవ పేరుతో నాటకాల కోసం ధార పోసుకున్నాను. అందుకు తగిన శాస్తి నాకు జరిగింది!” ఆవేదనా, ఆవేశం అతని మాటల్లో ధ్వనించాయి.

“విచారించకు శేషగిరీ! మీ కుమార్తెకు ఏ




లోటు కలుగదు...ఆమెకు అన్నివిధాల యోగ్యుడైన వరుణ్ణి అన్వేషిద్దాం... మా 'సంఘం' కట్టుబాట్లను అనుసరించి పైసా కట్నం లేకుండా ఆమె వివాహాన్ని నేను దగ్గరుండి జరిపిస్తాను!” ధైర్యం చెప్పాడు వీరభద్రం...

తన భుజం మీద నున్న వీరభద్రం చేతిని విసురుగా లాగేసి -రోషంతో ఊగిపోతూ చెప్పాడు శేషగిరి.

“ఆపండి మీ ఛాదస్తం!.... పార్లమెంటులో చేస్తున్న చట్టాలకే విలువివ్వని ప్రజలు ఈ పల్లెటూర్లో ఓ సంఘం విధించిన ఆంక్షల్ని లెఖ్ఖ చేస్తారనుకోవటం మీ మూర్ఖత్వం.. మిమ్మల్ని నమ్ముకుని నా పిల్ల పెళ్లికి ఎలాంటి ప్రయత్నాలు చేయక పోవటం నా మూర్ఖత్వం..! ఇప్పటికైనా నాకళ్లు తెరిపించారు!”

వీరభద్రం, అతన్ని చేరుకుంటూ ఏదో చెప్పాలని ప్రయత్నించాడు.. కానీ అప్పటికే శేషగిరి ఆ ఇంటి గడపదాటేడు...!

* * *

రామభద్రం మెమోరియల్ పాఠశాల... ఉదయం తొమ్మిది గంటల వేళ...! క్లాసు రూముల్లో మాస్టర్లంతా..పిల్లలకు పాఠాలు చెప్పటంలో నిమగ్నమై వున్నారు.

వీరభద్రం తన గదిలో కూర్చుని 'అటెండెన్సు రిజిస్టరు' పరిశీలిస్తున్నాడు.. అందులో డ్రిల్లు మాస్టరు..అనంతం సంతకం కనిపించలేదు.

“డ్రిల్లు మాస్టారు ఇంకా రాలేదా?....లేక శలవు పత్రము పంపినారా?” పక్కనే వున్న గురవయ్యను చూసి అడిగేడు.

“అలాంటిదేం రాలేదండి..!”గురవయ్య వినయంగా చెప్పాడు..

“మన అకౌంటెంట్‌గారికి చెప్పి..డ్రిల్లు మాస్టరికిచ్చే శాలరీలో ఒక రోజు వేతనం 'కటింగ్' చేయమను...! అలాగే ఆలస్యానికి సంజాయిషీ కోరుతూ వారికి మెమో ఇవ్వమనండి!”.

సరిగ్గా అదే క్షణంలో అనంతం మాస్టారి గొంతు వినిపించింది.

“మన్నించండి మహాప్రభో! నేను వచ్చేశాను!”

అటెండెన్సు రిజిష్టరు మూసేస్తూ గుమ్మం వైపు చూశాడు వీరభద్రం.. నమస్కారం చేస్తూ లోపలకు ప్రవేశించాడు అనంతం.

“ఇది పాఠశాల అనుకుంటున్నారా? లేక పాకశాల అనుకుంటున్నారా?ఇంత ఆలస్యమా?” .... మండిపడ్డాడు వీరభద్రం.

“చిత్తం!నిన్న టౌనుకి వెళ్లానండి...అక్కడ శుభలేఖల ప్రింటింగు పూర్తయ్యేసరికి బాగా పొద్దు పోవటంతో లాస్టు బస్సు మిస్సయింది... అందుకని పొద్దున్న ఫస్టు బస్సులో బయల్దేరి వచ్చేసరికి ఈ వేళయింది...ఇంటికి కూడా వెళ్ళకుండా ఏకాఏకి ఇక్కడికే పరుగెత్తు కొచ్చేశానండి!”

**-(ఇంకావుంది)**



## కొంటెకొశ్నెన్లు - తుంటరి జవాబులు




**బి. మెక్షానందం, ఉప్పలపాడు**

ప : తప్పు చేసేదొకరు, శిక్ష అనుభవించేదొకరు... ఉదాహరణ ?

జ : కొట్టేది కన్ను అయితే, రాలేవి పళ్ళు కావడం.

**వి. ముంజరాణి, హైదరాబాద్.**

ప : తాళజ్ఞానం లేని వారినేమనుకోవాలి?

జ : ఆటో మేటిక్ లాక్ సిస్టమ్ ఉన్న వాళ్లనుకోవాలి.

**సి.హెచ్. రమేష్‌బాబు, ఆదిలాబాద్.**

ప : వారంలో లేని వారం?

జ : చత్వారం, యవ్వారం.

## డబుల్ రోల్




ఏమిటీ.. ఆ **గో**రు తోనే మీరు టా**గో**రు బొమ్మ గీసారా?

**-రిషభ్ చందన్, పుణె**

ఈ జ్వరం నుంచి **వీడు కో**లుకుంటేనే ఎల్లుండి వాళ్లకు **వీడుకోలు** చెప్పగలడు.

**-బి.వి.ఆర్., చందానగర్**



## షార్ట్‌కట్స్




| | |
|---|---|
| మామిడి తపస్విని | - మాత |
| పిలల్ల తరుణ్ | - పిత |
| తాట్రాజు తమ్మన్న | - తాత |
| అవసరాల చిన్న | - అన్న |
| వడ్డాది దివ్య నళిని | - వదిన |
| అమ్ముల శోభక్క | - అక్క |
| బాణాల వరహాలు | - బావ |
| చెన్నమనేని మల్లి | - చెల్లి |
| మాదాల మణి | - మామ |

**-తెలికిచెర్ల రామకృష్ణ, విజయనగరం**

## ఈ రూటే వేరు




| | |
|---|---|
| Pole Son | - ధృవ కుమార్ |
| Leaf Stone | - ఆకురాయి |
| 100 ద్దీన్ | - నూరుద్దీన్ |
| 10 లం | - పదిలం |
| Salt son | - లవణ కుమార్ |

**-కె.పి.ఆర్. శర్మ, కర్నూలు**

## పేరు - రిపేరు




'చిలిపి' భార్య : ఏమండీ ఆవిడ వచ్చింది
భర్త : ఒట్టు ఈ అమ్మాయెవరో తెలీదు
'చిలిపి' భార్య : ఏమండీ మళ్లీ పెళ్లి చేసుకోండి
భర్త : ఆ ఒక్కటీ అడక్కు -అసలే పెళ్లయిన వాణ్ణి
'చిలిపి' భార్య : అవును నిజమే.... ఐతే ఏంటి?

* * * *

మరదలు : బావగారూ! బాగున్నారా
బావ : ఓసి నా మరదలా- నీ ప్రేమ బంగారం గాను-
నేను పెళ్లికి రెడీ

**-కె.పి.ఆర్. శర్మ,కర్నూలు**

## చిలిపి కవిత



మానిటర్‌కు మౌస్ జోడి
ఈ మౌస్‌కి అసలు మౌస్ ఓ పెద్ద రౌడీ
మానిటర్‌కు ఫ్లాపీ మ్యాచ్
వైరస్ సోకిందా ప్రోగ్రామ్ హాచ్ హాచ్ హాచ్

**-కె.పి.ఆర్. శర్మ,కర్నూలు**

## చిలిపి లిపి




Ray ప Tea = రేపటి
Chin త = చింత

**-పి.వి. పవన్ కుమార్, హైదరాబాద్.**

May క = మేక
O డ్డు = ఒడ్డు

**-జి . శశిధర్,నెల్లూరు.**

## పేరడీ పెరేడ్



ఓహో కుస్తీ దొరసాని
బాగా సుస్తీ చేసింది
ఐనా అందంలో ఆవిడగారు
పంది లా ఉంది...ఓహో కుస్తీ దొరసానీ...
కొత్త పెళ్లి కూతురిలాగ
ఉండాలనుకుంటుంది
మత్తు నిచ్చు డ్రింకులపైనా
మనసు మార్చి చూసింది ॥కొత్త॥
హోయ్.....డైటింగ్ ఎంతో చేసింది
ఫైటింగ్ పూర్తిగ మానింది
ఐనా అందంలో ఆవిడగారు
పందిలా ఉంది
ఓహో కుస్తీ దొరసాని
బాగా సుస్తీ చేసింది
ఐనా అందంలో ఆవిడగారు
పందిలా ఉంది..ఓహో కుస్తీ దొరసానీ....

('అభిమానం' సినిమాలోని 'ఓహో బస్తీ దొరసాని...' పాటకు పేరడీగా..)

**- ఎం.శ్రేష్ఠ, హైదరాబాద్**

## ఝలక్




తాగుబోతుల్ని చిన్న చూపు చూడకండి !
దేశంలోని చాలా రాష్ట్రాల్లో
ఆర్థిక వ్యవస్థ అస్తవ్యస్తం కాకుండా కాపాడేది వీళ్ళే !!

**- కె.ఆర్. నారాయణరాజు, ఫిలిం జర్నలిస్ట్, హైదరాబాద్**

**ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన ఎం.శ్రేష్ఠ (హైదరాబాద్) ఝలక్ నిచ్చిన కె.ఆర్.నారాయణరాజు (హైదరాబాద్) గార్లకి సోహన్ మ్యూజిక్ వారు 'సత్యం' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.**

SOHAN MUSIC



# 'హాసం' క్లబ్ కార్యక్రమ విశేషాలు

## హైదరాబాద్

26 జూన్ సాయంత్రం నారాయణగూడ లోని ఆంధ్రబాలానందం సంఘం ప్రాంగణంలో 'హాసం క్లబ్' నాల్గవ కార్యక్రమం జరిగింది. నుమారు 40 మంది ఔత్సాహికులు, అనుభవజ్ఞులు పాల్గొన్న ఈ హాస్య, సంగీత కార్యక్రమం మూడు గంటలపాటు సదస్యులను ఆకట్టుకుంది. జోక్స్ నుండి మిమిక్రీ దాకా, త్యాగరాజు కీర్తనలు, జానపదగేయాలు,



సినీగీతాలనుండి ప్యారడీపాటలదాకా అనేక వైవిధ్యభరితమైన ఐటమ్స్‌తో జరిగిన ఈ కార్యక్రమంలో నాలుగేళ్ల శ్రీవల్లినుండి డెబ్బై ఏళ్ల రంగస్థల నటీమణి రాజలలితవరకు పాల్గొనడం విశేషం.

జూన్‌నెలలో మరణించిన సంగీతదర్శకులు సుబ్బరామన్, మహదేవన్ బాణీలు సమకూర్చిన పాటలు చాలామంది పాడడం గమనించదగ్గ మరో అంశం. వ్యాఖ్యాతగా వ్యవహరించిన క్లబ్ కన్వీనరు ఎస్.వి.రామారావు వీరి వివరాలు తెలపడంతోబాటు ఇదేనెలలో మరణించిన జంధ్యాల సినిమా డైలాగులు చదివి వినిపించారు. ఈ 28 న పుట్టినరోజు జరుపుకుంటున్న హాస్యరచయిత ముళ్లపూడి



వెంకటరమణ వ్యక్తిగత విశేషాల గురించి ఆయన సాహితీ సర్వస్వానికి సంపాదకత్వం వహిస్తున్న 'హాసం' పత్రిక మేనేజింగ్ ఎడిటర్ ఎమ్బీయస్ ప్రసాద్ ప్రసంగించారు. రమణ, బాపు తొలిరచనలు వారి 'బాల'లోనే ప్రచురితమయ్యాయని బాలానందసంఘం ప్రతినిధి పూర్ణచంద్రరావు తెలిపారు. సభను విశేషంగా ఆకట్టుకున్న రమణకుమారి, నవ్య, లక్ష్మి (యు.ఎస్), లహరి, సుబ్రహ్మణ్యం, చైత్ర, సాయికృష్ణ, సుధాకర్‌లకు హాసం ద్వారా, సురభి మ్యూజిక్ ద్వారా బహుమతులు అందజేయబడ్డాయి.

కార్యక్రమంలో తొలిగీతంగా సుబ్బరామన్ సంగీతం కూర్చిన 'ప్రేమే నేరమౌనా' (లైలామజ్ను) పాడిన చిరంజీవి చైత్ర చివరిలో 'నిదురించే తోటలోకి' (ముళ్లపూడి రమణ రచించిన 'ముత్యాల ముగ్గు' సినిమాలో పాట)పాడడం ఓ విశేషం. పాటలపుస్తకంలో పడే అచ్చు తప్పుల వల్ల ఎలాటి తమాషాలు ఉద్భవిస్తాయో డా॥ పురుషోత్తమాచార్య సోదాహరణంగా పాడి వినిపించారు. అమెరికానుండి అతిథులుగా విచ్చేసిన సోదరీమణులలో ఒకరు 'చెలియలేదు చెలిమిలేదు' పాడగా, మరొకరు ప్యారడీపాట పాడి నవ్వించారు. 29 యేళ్లక్రితం అదే రోజున విధించిన ఎమర్జన్సీని గాయకుడు కిశోర్ కుమార్ ధైర్యంగా ఎదుర్కొన్న వైనాన్ని ఎమ్బీయస్‌ప్రసాద్ సభాసదులకు గుర్తు చేశారు. ఈ కార్యక్రమాన్ని 28 జూన్ నాటి 'కళాంజలి' లో ఈటీవీ 2 ప్రసారం చేసింది. కార్యక్రమాన్ని చూసి ముగ్ధులైన 'డెక్కన్ క్రానికల్' ప్రతినిధి 30-06-04 నాటి సంచికలో 'హాసం క్లబ్' గురించి తమ పాఠకులకు తెలిపారు.

జూలై నెల కార్యక్రమం 31 న సాయంత్రం 6-30 గం॥లకు బాలానంద సంఘంలోనే జరుగుతుందని కన్వీనరు రామారావు తెలిపారు.

### Club for a hearty laugh

*Brings out Haasam magazine in State*

FROM OUR BUREAU

**Hydria, June 29:** Want to consume two healthy tonics to fight back depression and tension? Visit to the Haasam Club instead. No membership hassles, no formalities, just walk in.

Every fourth Saturday in some places and every third Sunday at others, people of all ages gather to have a merry time. Since Ugadi this year, six such clubs at Hyderabad, Vizag, Rajahmundry, Eluru, Palasa and Jaggampeta have come up in the State and several more are on the cards. The club has also brought out a Telugu fortnightly *Haasam*. It is a collection of songs, poems, jokes, personal profiles that are sure to give you a hearty laugh and relieve you of all your worries.



*Members browse through the contents of the Haasam magazine at the club premises* DC Photo



బోరు మీదున్నాను తుమ్మెదా
యీ బోరెవరి కోసమే తుమ్మెదా
యిల్లిల్లు తిరిగాను తుమ్మెదా
నా యిల్లు మరిచేను తుమ్మెదా
జుట్టు కత్తిరించాను తుమ్మెదా
బొట్టు బిళ్ళ తీశాను తుమ్మెదా
పాంటు,షర్టు వేశాను తుమ్మెదా
తాళి బొట్టు దాచాను తుమ్మెదా
పేరెపుడో మార్చాను తుమ్మెదా
యింకేమీ చెయనే తుమ్మెదా ॥బో॥
ఫిజాలు, బర్గర్‌లు తుమ్మెదా
ప్రియమార తిన్నాను తుమ్మెదా
ఒళ్ళు పెరిగిందమ్మ తుమ్మెదా
బ్లౌజు పట్ట లేదమ్మ తుమ్మెదా
కుట్లెన్నో విప్పాను తుమ్మెదా
యింకేమి చేయనే తుమ్మెదా ॥బో॥
తొలిచూలు పండింది తుమ్మెదా
అత్తగారొచ్చారు తుమ్మెదా
ఆరడీ చేశారు తుమ్మెదా
ఎన్నెన్నో అన్నారు తుమ్మెదా
శ్రీవారు నమ్మారు తుమ్మెదా
యింకేమి చేయనే తుమ్మెదా ॥బో॥
యిరుగమ్మ పొరుగమ్మ తుమ్మెదా
హౌ ప్రెటీ అన్నారు తుమ్మెదా
తెల్లవారితో కలిపి తుమ్మెదా
వింత నవ్వు నవ్వాను తుమ్మెదా
కన్నవారితో కూడ తుమ్మెదా
ఇంగ్లీష్ పలికేను తుమ్మెదా ॥బో॥
ఇండియాకు ఓ ట్రిప్ తుమ్మెదా
ఫ్యామ్లీతో వేశాను తుమ్మెదా
పెర్ఫ్యూమ్స్ విరివిగా తుమ్మెదా
ప్రియమార యిచ్చాను తుమ్మెదా
లాప్‌టాప్‌లు, వాక్‌మన్‌లు తుమ్మెదా
లేవంటూ అలిగారు తుమ్మెదా ॥బో॥
పెళ్ళి పట్టుచీరలు తుమ్మెదా
పదిలంగా దాచాను తుమ్మెదా
బంగారు నగలన్ని తుమ్మెదా
బ్యాంక్‌లో దాచాను తుమ్మెదా
నకిలీలు తొడిగాను తుమ్మెదా
యింకేమీ చెయనే తుమ్మెదా ॥బో॥
డ్రైవింగ్ నేర్చాను తుమ్మెదా
జాబ్ చేస్తున్నాను తుమ్మెదా
పిల్లలూ పెరిగారు తుమ్మెదా
శ్రీవారు మారారు తుమ్మెదా
ఎవరేమి అన్నను తుమ్మెదా
చిరునవ్వు నవ్వేను తుమ్మెదా ॥బోరు॥

**- సరస్వతి భట్టార్, U.S.A**

## ఏలూరు

జూన్ 20 న డి.రామకృష్ణారావు గారింట జరిగిన 'హాసం క్లబ్ నాల్గవ కార్యక్రమం ఎప్పటిలాగానే జోక్స్, పాటలతో అహ్లాదకరంగా సాగింది. మొగల్తూరు, భీమడోలు నుండి కూడా 'హాసం' అభిమానులు వచ్చి పాల్గొన్నారు. అన్నమాచార్య కీర్తనలు పాడి ఇప్పటివరకు మూడు గోల్డుమెడల్స్ గెలుచుకున్న చి॥ బి.కె.బిందు ఈ సభలో అన్నమాచార్య కీర్తన ఒకటి పాడి మొదటి స్థానం గెలుచుకుంది. మోతే నారాయణరావు, ఎనిశెట్టి నారాయణరావు, టి.ఆర్.సుబ్బారావు, వి.బందా, ఎన్. మురళీమోహన్, డా॥బియస్.ప్రసాద్ లతోబాటు అనేకమంది స్త్రీలు కూడా పాల్గొని జోక్సు చెప్పారు. వచ్చేనెల కార్యక్రమం జూలై 18 సాయంత్రం మోతే నారాయణరావు గారింట జరుగుతుంది.



బి.కె.బిందు

## స్కిట్

ఎస్.ఐ. : ఇదిగో కానిస్టేబుల్, ఇందాకా రోడ్డుమీద ఓ మనిషి వెళుతూంటే నిన్ను అతన్ని వెంబడించి వెళ్లమన్నాను కదయ్యా..,

కాని : అవును సార్, అతను నిఘా వేయవలసిన మనిషి, తెలియకుండా వెంటాడు అని చెప్పారు కదండీ..

ఎస్ఐ : చెప్పాను కదా, మరి ఇక్కడే ఉన్నావేం?

కాని : భలేవారండి, మీరు చెప్పగానే అతని వెనక్కాలే పడిపోయానండి, లక్డీకాపూల్ వెళ్లాడండి

ఎస్ఐ : వెళ్లి ఎవర్నైనా కలిశాడా?

కాని : లేదండి, ఓ కిళ్లీకొట్టు దగ్గర ఆగి, మిఠాయికిళ్లీ కట్టించాడండి.

ఎస్ఐ : మరి నువ్వేం చేశావ్?

కాని : అతను గమనించకుండా నేనూ ఓ మిఠాయికిళ్లీ కట్టించానండి. ఆ తర్వాత ఆటో ఎక్కాడండి.

ఎస్ఐ : ఎక్కడికి వెళ్లాడు?

కాని : నాంపల్లి స్టేషన్ దగ్గర రాయల్ హోటల్ దగ్గర ఆపి ఓ స్టాల్‌లో న్యూస్ పేపరు కొన్నాడండి

ఎస్ఐ : మరి నువ్వూ నాంపల్లి వెళ్లావా?

కాని : వెళ్లాను కదండీ, అందుకేగా న్యూస్ పేపరు పైనం తెలిసింది. నేనూ అదే స్టాల్ కెళ్లి వాడిలాగే ఈనాడు పేపరు కొన్నానండి.

ఎస్ఐ : మళ్లీ ఆటో ఎక్కాడా?

కాని : ఎక్కాడండి. ఎక్కి, రామకృష్ణా థియేటర్ దగ్గర దిగిపోయాడండి. బుకింగ్ కౌంటరు కెళ్లి టిక్కెటు కొని లోపలకి వెళ్లాడండి.

ఎస్ఐ : మరి నువ్వూ సినిమాకి వెళ్లలేదేం?

కాని : ఏం చూస్తామండీ, చెత్త సినిమా! కితం వారం చూసినప్పుడే ఏడ్చుకున్నాను. మళ్లీ ఎవడు చూస్తాడండి? అందుకే తిన్నగా స్టేషన్‌కి వచ్చిపడ్డాను!

**- డి.వి.రామకృష్ణారావు**



## గిన్నిస్ బుక్కులో ఎక్కడమెలా..?

## స్కిట్

భార్య : 'వాసంతసమీరంలా నులివెచ్చని గీతంలా' (పాట)
(దృఢంగా) ఏమైనా సరే సాధించాలి

భర్త : (ఆమెను కట్ చేస్తూ) ఎవర్ని నన్నా? పొద్దున్నే మొదలుపెట్టావ్..

భా : (మళ్లీ పాట) అమావాస్యలో తారలా ..

భ : అమ్మా, భార్యామణీ (వెటకారంగా) సాధించడానికి ఎవరు మిగిలారమ్మా?

భా : అదేనండి వారెవరో 24 గంటలు శాస్త్రీయసంగీతం పాడి గిన్నీసు బుక్‌లోకి ఎక్కారట

భ : ఎక్కారో, దిగారో, నీకెందుకు మధ్య?

భా : ఇంకోరెవరో 24 గంటలపాటు భరతనాట్యం చేసి గిన్నీసు బుక్కులో..

భ : గిన్నెలెక్కి డాన్సు చేశారో, గిన్నిస్ బుక్కులో కెక్కారో నీకెందుకు?

భా : నేను కూడా - వారి స్ఫూర్తితో 24 గంటలపాటు..

భ : (అదుర్దాగా) ..ఏం చేద్దామని?

భా : టైటిల్‌సాంగ్స్ పాడి ఆ బుక్కులో ఓ పేజీ సొంతం చేసుకుందామని సంకల్పించానండీ..

భ : ఓ పేజీ సొంతం చేసుకుందామనుకుంటే చింపి దాచుకో, అంతే కానీ ఇలా పాటూ అవీ...



స్కిట్ వ్రాసి రాజమండ్రి హాసం క్లబ్‌లో ప్రదర్శించిన హనుమంతరావు, విజయలక్ష్మి

భా : (వినిపించుకోకుండా) అంతరంగాలూ - అనంతమానస చదరంగాలూ..(పాటలు మొదలుపెడుతుంది)

భ : నువ్వు పాటలాపి కాఫీ ఇవ్వకపోతే నేను చెదపట్టిపోతాను

భా : (పాట) ఎండమావులే - నీ మనసులోని ఆశలూ -

భ : అదేంటే తల్లీ బయటి ఎండలు చాలవూ- ఓ కప్పు కాఫీ కూడా ఎండమావేనా? కడుపులో ఎలుకలు పరుగులు పెడుతున్నాయే బాబూ

భా : (పాట)మెట్టెల సవ్వడి - ఆ, ఆ, మెట్టెల సవ్వడి

భ : ఎలుకలు మెట్టెలు పెట్టుకోవే బాబూ, త్వరగా వంటచేసి చావకపోతే నేను పైకెళ్లిపోవడం ఖాయం

భా : (పాట) మేఘాలలో ఏమున్నదో తొంగిచూదామా

భ : అక్కణ్నుంచి చూస్తే ఆకలితో మలమలలాడి చచ్చిన నా బొందె కనబడుతుంది. నిన్ను చూస్తూంటే ఇవాళ వంటచేస్తావన్న నమ్మకం కలగటం లేదు

భా : (పాట) నమ్మకం, నమ్మకం

భ : ఛ, ఛ నీకంటె ఓ మూగదాన్ని కట్టుకుని ఉంటే ప్రాణం హాయిగా ఉండేది. బుద్ధి పొరబాటై నిన్ను కట్టుకున్నాను.

భా : (పాట) నా మొగుడు నాకు సొంతం
ఇక భరించలేని భర్త ఓ దణ్ణం పెడతాడు

## జోక్

విదేశాల్లో మ్యాచ్‌కు బయలుదేరుతూండగా సచిన్ టెండూల్కర్ భార్య హెచ్చరించింది - "బాగా ఆడి కప్పు గెలుచుకుని రండి. ఓడిపోయి వచ్చారో మీకు ఆడవేషం వేసి నా వెంట విశాఖ వీధుల్లో తిప్పుతా" అని. దురదృష్టవశాత్తూ మ్యాచ్ పోయింది. సచిన్ భార్య అన్నమాట నిలబెట్టుకుంది. జగదాంబ సెంటర్లో పైటలో మొహం దాచుకుంటూ వెళుతూంటే ఒకావిడ పలకరించింది - "హలో సచిన్" అని. కాసేపోసి చీర కట్టి, కొప్పు పెట్టినా ఈవిడ ఎలా కనుక్కుందాని ఆశ్చర్యపడుతూ "ఎలా గుర్తుపట్టారు మేడమ్?" అడిగాడు సచిన్ సిగ్గుతో సగం చితికిపోతూ.

ఆవిడా సిగ్గుపడింది - "నేను సౌరభ్ గంగూలీని, బ్రదర్" అని.

**- వైజాగ్ హాసం క్లబ్**

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం



| | తెలుగు | తమిళం |
|---|---|---|
| చిత్రం | : మిస్సమ్మ | మిస్సియమ్మ |
| రచన | :పింగళి నాగేంద్రరావు | తంజై రామయ్యాదాస్ |
| సంగీతం | : యస్.రాజేశ్వరరావు | యస్.రాజేశ్వరరావు |
| గానం | :ఎ.ఎం.రాజా, పి.లీల | ఎ.ఎం.రాజా, పి.లీల |
| అభినయం | :ఎన్.టి.రామారావు, సావిత్రి ఎస్వీరంగారావు ఋష్యేంద్రమణి | జెమిని గణేష్, సావిత్రి, ఎస్వీ రంగారావు ఋష్యేంద్రమణి |

విజయవారి చిత్రాలలోని వెన్నెల పాటలలో 'రావోయి చందమామా' పాట స్థానం ప్రత్యేకమైనది. 'మిస్సమ్మ' చిత్రంలోని ఆ పాటలో 'చందమామ' పాత్ర విజయా వారి తక్కిన వెన్నెల పాటలలోని చందమామ పాత్ర కన్నా వేరైనది. నాయకుడికి తన మనసులో మాట నాయికకు తెలుపవలసిన అవసరం ఏర్పడింది. నాయకుడు తన గురించి చెబుతున్న అభిప్రాయాలకు నాయిక సమాధానం చెప్పదలుచుకొంది.

నాయికానాయకులిద్దరూ తమ అవసరాలకొద్దీ భార్యాభర్తలుగా నటించి ఉద్యోగాలు చేస్తున్న వారే. భార్యాభర్తలుగా నటించడానికి పూనుకొన్న ఆ ఇద్దరికీ -తమకు ఉద్యోగాలు ఇచ్చిన గోపాలం నాయుడు అనే పెద్దమనిషి కుటుంబం కారణంగా చిత్రవిచిత్రమైన పరిస్థితులు ఎదురవుతూ ఉంటాయి. దాంతో నాయికకు అసహనం పెరగడమూ, ఆ కారణంగా ఆమె ఒప్పందం మాటమరిచి ప్రవర్తించడమూ జరుగుతూ ఉంటాయి.

'మిస్సమ్మ' చిత్రంలోని కొన్ని పాటలలో అంతర్లీనంగా నాయికా నాయకుల మధ్య సంవాదం సాగుతూనే ఉంటుందని ఇదివరకే ప్రస్తావించుకొన్నాము. 'రావోయి చందమామా' పాటలో ఈ సంవాదం ఉధృతంగా సాగుతుంది.

నాయికకు నాయకుడి మీద ప్రేమ. అయితే ఆమె ఆ సంగతి బయట పెట్టదు. నాయకుడు తమకు ఉద్యోగం ఇచ్చిన పెద్దమనిషి రెండవ కూతురికి పాట నేర్పడం ఆమెకు నచ్చదు. సెలవు కావాలని చీటీ ఇచ్చేసి తమ బసకు చేరుతుంది. చీటీ చూసి గోపాలరావునాయుడు నాయకుడు మీద మండిపడి అతన్నీ, తన భార్యనూ వెంటబెట్టుకొని నాయికానాయకుల బసకు వస్తాడు.

నాయికకు నచ్చజెప్పలేక నాయకుడు ఆకాశంలో కనిపిస్తున్న చందమామతో తన గోడు చెప్పుకోవడం మొదలు పెడతాడు. అన్యాపదేశంగా తన గురించే నాయకుడు పాడుతున్నాడని నాయిక గ్రహించి -అందుకు సమాధానం చెప్పడానికి ప్రయత్నిస్తుంది. అంతే. వాళ్ల సంవాదం ఊపందుకొంటుంది. చందమామతో చెప్పుకుంటున్నట్టు పరస్పరం మాటా మాటా పాట రూపంలో అనుకుంటారు. కాకపోతే తెరమీది చందమామది కూడా ప్రేక్షకుడి పాత్రే!

'మిస్సమ్మ'లోని 'రావోయి చందమామ'పాట చోట 'మిస్సియమ్మ' తమిళ చిత్రంలో 'వారామో వెణ్ణిలావే' అనే పాట ఉంది.

ముందు తెలుగు పాట:

అ: రావోయి చందమామా
మా వింత గాథ వినుమా
రావోయి చందమామ
సామంతము గల సతికి
ధీమంతుడనగు పతినోయ్
సతి పతి పోరే బలమై
సతమతమాయెను బతుకే ॥రావోయి॥

ఆ: రావోయి చందమామా
మా వింత గాథ వినుమా
రావోయి చందమామా...
ప్రతినలు పలికిన పతితో
బ్రతుకగ వచ్చిన సతినోయ్
మాటలు బూటకమాయె
నటనలు నేర్చెను చాలా ॥రావోయి॥

అ: రావోయి చందమామా
మా వింత గాథ వినుమా...
తన మతమేమో తనది
మన మతమసలే పడదోయ్
మనమూ మనదను మాటే
అననీయదు తాననదోయ్ ॥రావోయి॥

ఆ: రావోయి చందమామా
మా వింత గాథ వినుమా
నాతో తగవులు పడుటే
అతనికి ముచ్చట లేవోయ్
ఈ విధి కాపుర మెటులో
నీవొక కంటను కనుమా ॥రావోయి॥










ఈ పాట సన్నివేశంలో ఒకటి రెండూ చమత్కారాలు కనిపిస్తాయి. నాయికను ,నాయకుడినీ ఒప్పించడానికి వచ్చిన గోపాలరావు నాయుడు, (ఎస్.వి. రంగారావు) ఆయన భార్యా (ఋష్యేంద్రమణి) పాట మొదలు కాగానే చల్లగా అక్కడినుంచి జారుకుంటారు. నాయకుడు పల్లవీ, తొలి చరణం పాట ముగించాక పాట మొదలు పెట్టబోయింది. తన స్వరానికి

బదులు నాయిక స్వరం వినబడటంతో గొంతు పట్టుకొని పరిశీలించుకోవడం తమాషాగా ఉంటుంది!

ఒక్క పింగళి మాత్రమే ఇటువంటి పాట రాయగలరు అన్నంత గొప్పగా రాశారు ఆయన. కథ ప్రకారం నాయిక మేరీ క్రైస్తవుల యింట పెరిగింది. నాయకుడు హిందువు. తమది ఉద్యోగాలకు సంబంధించిన ఒప్పందమే తప్ప జీవితానికి సంబంధించిన బంధం కాదని నాయకుడు నాయికను ఒప్పించి తీసుకువచ్చాడు. ఆమె అభిప్రాయం ప్రకారం అతను మాట తప్పాడు. ఆమెతో తగవులు పడుతున్నాడు.

గోపాలరావునాయుడికీ ఆయన భార్యకూ సంబంధించినంత వరకు నాయికా నాయకులు భార్యా భర్తలు. పాటలో సతి,పతి,కాపురం అనే మాటలను పింగళి ఎంతో సార్థకంగా వాడారు. నాయికా నాయకులిద్దరూ కలిసి నటించడానికి ఒప్పుకున్నారు. కనుక ఇద్దరూ కలిసి 'మనం'గా వ్యవహరించాలి. అయితే నాయిక 'మనం' అని గానీ 'మనది' అని గానీ అనదనీ నాయకుడి అభియోగం. ఆమెకు తన అభిప్రాయం (మతం)తో తప్ప నాయకుడి అభిప్రాయంతో నిమిత్తం లేదట. పాటలో 'మతం' అనే మాటను పింగళి ఎంతో చమత్కారంగా వాడారు. నాయికా నాయకులిద్దరూ భార్యా భర్తలుగా నటిస్తున్నవారే. మరి అటువంటప్పుడు ఆ నటన అంతవరకే పరిమితం కావాలి. కాని నాయిక దృష్టిలో అతను చాలా 'నటన' నేర్చాడు. నటనగా మొదలయిన తమ బంధం నిజం కావాలన్నది ఆమె అభిప్రాయం. 'ఈ విధి కాపుర మెటులో' అనడంలో-తమ బంధం గురించి ఆమెకు ఉన్న కలలూ, అపోహలూ అన్నీ ధ్వనిస్తున్నాయి. 'ఒక కంట కనిపెట్టమనడం ' తెలుగుకే ప్రత్యేకమైన నుడికారం.

ఇక్కడ 'మిస్సియమ్మ' తమిళ చిత్రంలోని గీతాన్ని చూద్దాం.

ఆ: వారాయో వెణ్ణిలావే
కేళాయో ఎంగళ్ కదైయే
అహంబావం కొండ సదియాళ్
అరివాల్ ఉయర్న్దిడుం పదినాన్
సదిపది విరోద మిగవే
సిదైందదు ఇదం తరుం వాళ్వే
ఆ: వారాయో వెణ్ణిలావే
కేళాయో ఎంగళ్ కదైయే
వాక్కురిమై తంద పదియాల్
వాళ్న్దిడవే వంద సదినాన్
నంబిడ సెయ్యార్ నేశం
నడిప్పు దెల్లాం వెళి వేషం
అ: వారాయో వెణ్ణిలావే
కేళాయో ఎంగళ్ కదైయే
తన్ పిడివాదం విడాదు
ఎన్ మనం పోల్ నడక్కాదు
నమక్కెన ఎదువుం శొల్లాదు
నమ్మైయుం పేశ విడాదు
ఆ: వారాయో వెణ్ణిలావే
కేళాయో ఎంగళ్ కదైయే
అనుదినం సెయ్యార్ మోడి
అహమగిళ్వార్ పోరాడి
ఇల్లరం ఇప్పడి నడందాల్
నల్లరమామో నిలవే ॥వారాయో॥



తంజై రామయ్యాదాస్ రాసిన ఈ తమిళ గీతంలో నాయకుడికీ నాయికకూ మధ్య జరిగిన సంవాదం ఇది.

అ: రావోయి చందమామా
వినవా మా కథనే
అహంభావం కలిగిన సతి (ఆమె)
బుద్ధిచేత ఉన్నతుడనైన పతినేను
సతిపతి విరోధం హెచ్చి
చెదిరింది హితమైన జీవితమే
ఆ: రావోయి చందమామా
వినవా మా కథనే
మాట ఇచ్చిన పతివల్ల
జీవించడానికి వచ్చిన సతినేను
నమ్మేలాగ చేస్తారు స్నేహం
నటించేదంతా బయటికి వేషం
అ: తన (మంకు) పట్టుదల విడవకు
నా మనసుకు తగ్గట్టు నడవదు
మనకంటూ ఏదీ చెప్పదు
మననూ మాటాడనివ్వదు
ఆ: రోజూ చేస్తారు మాయ
సంతోషిస్తారు పోరాడి
కుటుంబం ఇలా సాగితే
ఉత్తమ ఆదర్శం కాగలదా జాబిలీ

తెలుగు పాటలోని చమత్కారాలు తమిళగీతంలో కనిపించవు. తెలుగు గీతంలో సార్థకంగా వాడిన 'మనం','మతం' వంటి మాటలు తమిళ గీతంలో లేవు. 'సామంతము గల సతి' అంటే 'స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన స్త్రీ' అని చెప్పుకోవాలి. కాని తమిళంలో ఆ భావం 'అహంభావంగల స్త్రీ'గా పరిణమించింది. 'ధీమంతుడు' అనే మాటలో ఉన్న సొగసు 'బుద్ధిచేత ఔన్నత్యం కలవాడు' అనడంలో లేదు. తమిళంలోని 'వాక్కురిమై' అనే మాటకు కాలక్రమాన ఓటు హక్కు అనే అర్థం వచ్చినా- ఈపాట నాటికి 'మాట ద్వారా ఇచ్చిన హక్కు' (ఇచ్చిన మాట)అని అర్థం చెప్పుకోవాలి. తెలుగు పాటలో నాయకుడు తమ ఇద్దరి గురించీ కాక నాయిక తన గురించే ఆలోచిస్తుందని అటుంటే -తమిళ గీతంలో నాయకుడు తాను ఆమె కన్నా గొప్పవాడిననే అహంకారం చూపుతున్నట్లు అనిపిస్తుంది. వాళ్లిద్ధరిదీ నటనల కాపురం అయినపుడు 'నా మనసుకు తగ్గట్టు నడుచుకోదు' అనడం సమంజసం కాదు. 'ఇల్లరమే నల్లరం' అనేది తమిళ సూక్తి. 'కుటుంబ జీవనమే ఉత్తమమైన ధర్మం' అని ఆ సూక్తికి అర్థం. ఈ సూక్తిని పాట కోసం రెండు భాగాలుగా వాడుకోవడం ఒక్కటే తమిళగీతంలోని ప్రత్యేకతగా చెప్పుకోవాలి.

**- పి.ఎస్.గోపాలకృష్ణ**



ఒంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే
ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...

పిల్లల కోసం ప్రత్యేకం...



బాల్యపు
లేతదనం
మళ్ళీ కోరుకునే
పెద్దలకు
మరీ మరీ
ప్రత్యేకం

# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ
ఎమ్బీయస్ ప్రసాద్

చిత్ర పరిచయం 9

సమన్వయం
మంజీర

### జరిగిన కథ

జాన్ డూలిటిల్‌కు చిన్నప్పుడు జంతువుల భాష అర్థమయ్యేది. క్రమేపీ ఆ శక్తి పోయింది. పెరిగి డాక్టరయ్యాక ఆ శక్తి తిరిగివచ్చింది. ఖంగారుపడి భార్యతో సహా ఎవరికీ చెప్పలేదు. అనుకోకుండా జంతువులకు వైద్యం చేయడం మొదలుపెట్టాడు. కానీ జంతువుల భాష అతనికి అర్థం అవుతుందని తెలియని, నమ్మని అతని సన్నిహితులు అతన్ని మతిభ్రష్టుడిగా జమకట్టి ఓ హాస్పటల్‌లో జేర్పించారు. జీవితమంతా అక్కడే గడపవలసివస్తుందని భయపడిన జాన్ ఇక జంతువుల జోలికి పోకూడదని నిశ్చయించుకుని అక్కడి అధికారికి ఆ మాట చెప్పి ఇంటికి తిరిగివస్తాడు. ఇంటివద్ద పెంపుడుకుక్క లక్కీ పలకరించబోయినా వినబడనట్టు, అర్థం కానట్టు నటిస్తాడు. (- ఇక చదవండి)

క్లినిక్‌కు వస్తూ రావడంతోనే జాన్ హడావుడిగా అటూ, ఇటూ తిరగసాగేడు. కనబడ్డవాళ్లకి ఆదేశాలిచ్చేస్తూ, పేషెంట్ల ఎపాయింట్‌మెంట్స్ ఏమయ్యాయో కనుక్కుంటూ, రిపోర్టులు ఎక్కడున్నాయని అడుగుతూ జాన్ చకచక తిరగడం చూసి నర్స్ తెల్లబోయింది. 'యస్ డాక్టర్', 'ఓకే డాక్టర్' తప్ప మరోమాట పెగలడం లేదు.

జాన్ దండయాత్ర నర్స్‌తో ఆగలేదు. మార్క్, జీన్ ఉన్న కాబిన్లోకి దూసుకువచ్చి వాళ్లకీ ఆదేశాలు ఇవ్వసాగాడు. పిచ్చిఆసుపత్రికి పద్దు రాసేసిన మనిషి ఇలా పిడుగులా వచ్చి పడడం వాళ్లకు మతి పోగొట్టింది. కళ్లప్పగించి చూస్తూ ఉండిపోయారు.



జాన్ కొత్తగా చేసుకున్న తీర్మానం సంగతి తెలియని ఓ పావురం కిటికీ అంచుమీద వాలి "హాయ్ డాక్టర్, పళ్లు కాస్త సీకుతున్నాయి. చూపించుకుంటే మంచిదంటావా?" అని పలకరించింది.

జాన్ దానికేసి నిరసనగా ఓ చూపు పారేసి, 'హూష్' అని ఎగరగొట్టేశాడు. అంతేకాదు, బయటకు వెళ్లిపోతూ మార్క్‌తో "మెయిన్‌టెనెన్స్ వాళ్లకు చెప్పి పావురాయి గూళ్లు ఉంటే తీయించేమను. కిటికీలకు తెరలవీ కట్టి ఇలాటి అక్కుపక్షులు లోపలకి రాకుండా చూడమను. ఇదేమైనా ఆసుపత్రా? లేకపోతే జూనా?" అంటూ విరుచుకుపడ్డాడు.

కానీ మార్క్కేమీ నొచ్చుకోలేదు. "హమ్మయ్య, జాన్ మామూలు మనుషుల్లో పడ్డాడు. టేకోవరు జరగడం, మనకు కుప్పలుతిప్పలుగా డబ్బు రావడం ఖాయం." అంటూ మురిసిపోయాడు.

జంతువులంటే పడిచచ్చే జాన్ చిన్నకూతురు మాయా తన గదిలో జాన్ తండ్రి ఆర్చర్‌తో కూచుని కబుర్లు చెబుతోంది. తను పెంచుతున్న గినీపిగ్ రోనీకై తను ఎన్ని ఏర్పాట్లు చేసిందో తాతకు వివరిస్తోంది. "ఇదిగో, ఇది దాని బోను కదా, దీంట్లోనే అది ఎక్సర్‌సైజ్ చేసేందుకు ఇది పెట్టానన్నమాట" అంటూ ఓ చక్రం చూపించింది. 'ఓహో, మనం ట్రెడ్‌మిల్ బెల్టు మీద పరుగుపెట్టినట్టు నీ ఎలుక ఆ చక్రం మీద పరిగెడుతుందన్నమాట. బాగుంది, మరి ఏరోబిక్స్ చేస్తుందా, మీ రోనీ?" అంటూ నవ్వాడు తాత.



ఇంతలో జాన్ గదిలో ప్రవేశించాడు. టేకోవరు తాలూకు ప్రెస్ కాన్ఫరెన్సుకు వెళ్లేందుకు తయారవుతున్నాడు. "ఇదిగో, మనందరం త్వరగా బయల్దేరాలి. అది ఓ మూలపడేసి నువ్వు త్వరగా తెములు" అని కూతురుని హెచ్చరించి, "నాన్నా, నువ్వు కాస్త దానికి హెల్ప్ చేస్తావా?" అని తండ్రిని రిక్వెస్టు చేశాడు.

"రోనీ కూడా వస్తానంటోంది నాన్నా.." అంది మాయా బ్రతిమాలుతూ.

"నథింగ్ డూయింగ్, ఇదేమైనా పత్రికా సమావేశమనుకున్నారా? పశువుల సంతనుకున్నారా?"

"ఆ ముక్కేదో నువ్వే చెప్పు రోనీకి. తనూ వస్తానని మారాం చేస్తోంది. నువ్వు చెప్తే అర్థం చేసుకుని వింటుంది." అంటూ రోనీని జాన్‌కు ముఖానికి ఎదురుగా పెట్టబోయింది.

జాన్ రోనీకేసి చూడనైనా చూడలేదు. "నేను చెప్పడమేమిటి నాన్సెన్స్!

"ఎలకలకీ, పిల్లులకీ నచ్చచెప్పే వాడిలా కనబడుతున్నానా నేను!?" అని చికాకు పడ్డాడు.

మాయా మనసు గాయపడింది. ముఖం మాడ్చుకుంది. జాన్ ఏం చేయలేక తన తండ్రికేసి చూసి "కాస్త దాని సంగతి చూద్దూ" అనేసి పక్కనున్న తన గదికి వెళ్లిపోయాడు.



మాయా తాతగారి చెయ్యి పట్టుకుని "తాతా, నీకో రహస్యం చెప్పనా?" అంది.

ఆయన మంచం మీద కూచుంటూ "చెప్పు తల్లీ" అన్నాడు.

"నేను క్యాంప్‌లో ఉండగా అమ్మ ఫోన్ చేసి నాన్నకి ఇలా జరిగిందని చెప్పినపుడు నాకు భయం వేయలేదు తెలుసా! మా నాన్నకు జంతువుల భాష తెలుసని నేను ముందే అనుకున్నాను. అలా తెలియడం తప్పా తాతా? అలా తెలిసినవాళ్లని విడ్డూరంగా చూస్తారా?"

"తప్పేమీ కాదమ్మా"

జంతువులంటే అమితప్రేమ చూపే మాయా తాత హామీతో ఊరడిల్లింది. తన మనస్సులోని బాధ తాతదగ్గిర వెళ్లబోసుకుంది - "మా నాన్నకు నేనంటే ఇష్టం లేదనుకుంటా తాతా.." అంది.

పక్కగదిలో టై కట్టుకుంటున్న జాన్ చెవిన ఈ మాటలు పడ్డాయి. "లేదమ్మా, మీ నాన్నకు నువ్వంటే ఎంత ప్రేమో తెలుసా" అంటున్నాడు అతని తండ్రి. కూతురు దానికి జవాబు చెబుతోంది - "నేనంటే ప్రేమే తాతా, కానీ ఇష్టం లేదనుకుంటా..". ఈ వ్యాఖ్యకు కారణం చెబుతుందేమో విందామనుకుని జాన్ తలుపుకు కాస్త దగ్గరగా జరిగాడు.



"...మా నాన్నకు నేనంటే ఇష్టం కలగాలని నేను ప్రయత్నిస్తున్నాను తాతా, తనలాగే నేనూ బుద్ధిగా ఉంటాను. ఈ పిచ్చిపిచ్చి ప్రయోగాలు మానేస్తాను. మంచిదానిగా మారిపోతాను. ఏం?" అంటూ మాయా తన హంసగుడ్డు పొదగడానికి వేసి పెట్టిన టేబుల్ ల్యాంప్ ఆర్పేసింది.

ఆ చిన్నపిల్ల బాధ ఆర్చర్‌కు అర్థమయింది. తన కుమారుడు జాన్ కూడా చిన్నప్పుడు జంతువులంటే పడిచచ్చేవాడు. మనుష్యులను తప్ప సృష్టిలో తక్కిన జంతుజాలాన్ని హీనంగా చూసే లోకంలో పెరిగిన తను అది అర్థం చేసుకోలేకపోయాడు. పిల్లవాడు ఏడుస్తున్నా పెంపుడుకుక్కను తరిమేశాడు. భూతవైద్యులను రప్పించాడు, హడలగొట్టాడు, జంతువులతో మాట్లాడితే చంపేస్తానని హెచ్చరించాడు.

జాన్ పోలికే మాయాకు వచ్చినట్టుంది. ఈ పిల్లకూ జంతువులంటే ఇష్టం. వాటితో అనుబంధం పెంచుకోవాలన్న తాపత్రయం. అప్పటి తన స్థానంలో ఈనాడు జాన్ ఉన్నాడు. ఇలాటివన్నీ పిచ్చివేషాలని పిల్లలను దండించే స్టేజిలో ఉన్నాడు. జంతువులతో మాట్లాడి, వ్యవహరించి తను తెచ్చుకున్న ఇక్కట్లు తనతో ఆగితే మంచిదని భావిస్తున్నాడు. మొదట్లోనే త్రుంచివేయకపోతే తన పిల్లలూ తన లాగ అవస్తలు పడతారని ఆందోళన పడుతున్నాడు.

కొడుకుభయం, మనుమరాలి బాధ రెండూ అర్థం చేసుకున్న ఆర్చర్ మాయా ఆర్పివేసిన లైటు మళ్లీ వేశాడు. - "కొన్ని సందర్భాల్లో మారాల్సింది తండ్రులేనమ్మా" అన్నాడు గాఢంగా నిట్టూరుస్తూ. ఆ పాటికి జాన్ ఇంచుమించు ఈ గదిలోకి వచ్చి తండ్రికేసి చూస్తున్నాడు. తండ్రి కూడా తలెత్తి కొడుకు కేసి దీర్ఘంగా, గాఢంగా చూశాడు. ఆ చూపుల్లో తండ్రి వ్యథ, తన కర్తవ్యం బోధపడ్డాయి జాన్‌కు.



* * *

భార్యా పిల్లలతో సహా జాన్ క్లినిక్‌కు చేరాడు. అక్కడే వేరే అంతస్తులో ప్రెస్ కాన్ఫరెన్స్ జరుగుతుంది. 'నాన్న కారు పార్క్ చేసి వస్తారు, మీరు దిగండి' అని లిసా కారు దిగబోతూండగా 'నువ్వు కాస్త ఆగు మాయా' అని చిన్నకూతుర్ని మాత్రం ఆపాడు జాన్.

పార్కులో దొరికిన పెద్దగుడ్డు పట్టుకొచ్చి అది హంసగుడ్డని, గుడ్డు పగిలి బయటకు వచ్చేవేళ తననే చూడాలనీ మాయా పట్టుబట్టినప్పుడు తను చివాట్లు వేశాడు, గినీ పిగ్ రోనీని పట్టుకొచ్చి పెంచుతున్నప్పుడు 'అబ్‌నార్మల్ చైల్డ్' అని తిట్టిపోశాడు. పాపం పసిదాని మనసు గాయపడింది, తనే సముదాయించాలి అనుకుంటూ -

'అవునూ.. మాయా, తీరిగ్గా కూచుని బాగా ఆలోచిస్తే నీ హంసగుడ్డు ఐడియా ఫర్వాలేదనిపించింది. ముందులో ఇవన్నీ పిచ్చి పిచ్చి పనులని అనుకున్నా గానీ తరువాత అనిపించింది - ఇలా పెంచి చూస్తే బాగానే ఉంటుందని.' అన్నాడు.

చిన్నపిల్ల ముఖం చింకిచేటంత అయింది. "నిజంగానే అంటున్నావా నాన్నా?" అంది నమ్మలేనట్టు.

"నిజంగానే అంటున్నానమ్మా. ఇప్పుడు.. కొంతమందికే ఇలాటి ఆలోచనలు వస్తాయి. చాలామంది వీటిని పట్టించుకోరు. కానీ నువ్వు మాత్రం ఇవన్నీ జాగ్రత్తగా ఆలోచించి.. అందుకేనమ్మా, నువ్వు ఓ స్పెషల్ చైల్డ్‌వి"

ఎన్నడూ లేనిది తండ్రి ఇలా మాట్లాడడంతో మాయా తికమకపడింది - "స్పెషల్ అంటే 'అదోరకం మనిషా' నాన్నా?"

"అదోరకం ఏమిటమ్మా?"

"అదే నాన్నా, వింతగా, విచిత్రంగా, విడ్డూరంగా ఉన్నారంటారు కొందరిని. నేనూ అంతేనంటావా?"

తనకు తెలియకుండానే కూతురిలో ఆత్మన్యూనతను పెంచినందుకు పశ్చాత్తాపపడ్డాడు జాన్ - "భలేదానివే, నేను స్పెషల్ అన్నాను. అదోరకం అనలేదు. అయినా నేనోటి చెప్పనా? 'అదోరకం' అని లోకం అనేవాళ్లు పోనుపోను ఎంత గొప్పవాళ్లయ్యారో తెలుసా? గొప్పవాళ్లకి పేరు వచ్చేముందు వాళ్లనందరూ విడ్డూరంగా చూసినవాళ్లే!"

మాయా ఆశ్చర్యపడింది. "నిజంగానా?"

"నిజమమ్మా, ఉదాహరణకి ఐన్‌స్టీన్ తీసుకో. ఆయన జుట్టూ అదీ చూసి ఈయన అదోరకం తిక్కమనిషిరా అనుకున్నారు జనం. కానీ అతని జుట్టు చూశారు గానీ లోపల ఉన్న బుర్రగురించి వాళ్లకు తెలియదంగా, చూడలేకపోయారు. అప్పటిదాకా వాళ్లకు తెలియని సిద్ధాంతాలు చెబితే విడ్డూరంగా చూశారు. పగలబడి నవ్వారు. కానీ ఐన్‌స్టీన్ పట్టించుకున్నాడా? ఊహూ, లోకం కోసం మారాడా?



ఊహూ... తన పని తాను చేసుకుపోయాడు. కొన్నాళ్లకు అర్థం చేసుకుని ప్రజలు బ్రహ్మరథం పట్టారు. జోన్ ఆఫ్ ఆర్క్ అని వుండేది ఆమెను కూడా వింతమనిషిగానే చూశారు. ఆవిడకు రకరకాల శబ్దాలు వినబడేవి. అది చెప్తే..."

"..నీక్కూడా మాకెవ్వరికీ వినబడని అనేక శబ్దాలు వినబడతాయికదా నాన్నా"

జాన్ చిరునవ్వు నవ్వాడు.

"మాయా, నాన్నంటే నీకిష్టమేగా, నేనో మాట చెప్తాను విను. నిన్ను ఎవరేమన్నా పట్టించుకోవద్దు. నువ్వేమిటో అలాగే ఉండు. అలాగే జీవించు. వింతగా ఉన్నావన్నా, విడ్డూరంగా వున్నావన్నా, డోంట్ కేర్. దీనివల్ల లోకం నవ్వవచ్చు, హింసలు పెట్టవచ్చు. కానీ నీ దారి మార్చుకోవద్దు. నిన్ను నువ్వు ప్రేమించు. చేసే పనిని ప్రేమించు."

నిజానికి ఈ మాటలు జాన్ కూతురికి చెప్పటం లేదు. తనకు తనే చెప్పుకుంటున్నాడు. జంతువులతో మాట్లాడడం వల్లనే లోకం తనను అష్టకష్టాలు పెట్టడంతో తను పిరికివాడిలా ప్రవర్తిస్తున్నాడు. జంతువులకు సహాయపడగలిగే స్థితిలో ఉండి కూడా లోకభీతితో వాటికి దూరమవుతున్నాడు. పర్యవసానాలు ఎలావున్నా ఇప్పటినుండీ తనకు తోచినరీతిలో చేయడమే మంచిదన్న అభిప్రాయానికి వచ్చేశాడు.

తండ్రిమాటలు మాయాకు ధైర్యాన్ని, ప్రోత్సాహాన్ని ఇచ్చాయి. చిరునవ్వు నవ్వింది.

"మరి నాన్నకు ఓ ముద్దు పెట్టు" అన్నాడు జాన్.

బుగ్గమీద ముద్దుపెట్టి, మెడచుట్టూ చేతులు వేసి "నాన్నా, నువ్వు గ్రేట్ నాన్నా" అంది మాయా.

"థాంక్యూ మై డియర్"

"నువ్వు గ్రేట్ మాత్రమే కాదు, అదోరకం కూడా.." అంది నవ్వుతూ.

జాన్ నవ్వుతూ కారుడోరు తెరిచాడు. మాయా కారు దిగింది. జాన్ పార్కింగు వైపు కారు పోనిచ్చాడు. నిజానికి జాన్ ఇప్పుడు చెప్పిన మాటలు క్లినిక్‌లో ఉండగా లక్కీ అతనికి చెప్పిన భైరవగీతలో వాక్యాలే! ఆ విషయం జాన్ గమనించాడో లేదో కానీ కారు డిక్కీలో దాక్కున్న లక్కీమాత్రం గమనించింది. శిష్యుణ్ని అభినందించింది.

"అదీ లెక్క! మనసున్న మనిషిలా మాట్లాడావ్!" అంది.



లక్కీ గొంతు వింటూనే జాన్ ఉలిక్కిపడ్డాడు. "హేయ్ లక్కీ, నువ్వెలా దిగడ్డావ్ ఇక్కడకి?" ఆశ్చర్యంతో అడిగాడు.

డిక్కీలోంచి బ్యాక్‌సీట్‌లోకి దూకి "చెప్తాగానీ, నీ రుమాలెక్కడ ఉంది?" అర్జంటుగా అడిగింది లక్కీ.

"బ్యాక్ పాకెట్‌లో ఉంది తీసుకో."

లక్కీ ముందుకు వంగి తీసుకుని కన్నీళ్లు తుడుచుకోసాగింది. జాన్ కరిగిపోయాడు. "సారీ, ఇంటికి తిరిగి రాగానే నిన్ను పట్టించుకోలేదు. నీ మాట వినబడనట్టు నటించాను." అని క్షమాపణ చెప్పాడు.

ఈ మాటలతో లక్కీ దుఃఖం మరింత పెరిగిపోయింది. కళ్ల వెంబడి, ముక్కు వెంబడి ధారాపాతంగా నీళ్లు కారాయి. ముక్కు చీదుకుని రుమాలు పెట్టి తుడుచుకోసాగింది.

"నిజానికి నువ్వు అవాళ కరక్టుగా చెప్పావ్. మన ధర్మమేమిటో అది మనం నిర్వర్తించాలి. లోకం ఏదో అనుకుంటుందని జంకడం అనవసరం. చాలాఏళ్ల క్రితం నేను జంతువుల మంచీ చెడ్డా ముచ్చటించే కుర్రాణ్ని. అదే నా సహజలక్షణం. క్రమేపీ దానికి దూరంగా జరిగాను. నీ ధర్మమాని బాల్యంతో లింకు కలిసింది నాకు..."

ఏడుపు ఆపుకోలేకపోతోంది లక్కీ. వెక్కిళ్లు పెడుతోంది.

"..కాస్సేపు ఆపుతావా లక్కీ, నీతో ఏదో అందామనుకుంటున్నాను."

లక్కీ ఏడుపు ఆపింది. "అలాగా, నీ మనసులో మాట ఏమిటో చెప్పేయి మరి." అంది.

"ఏమిటీ అంత ఛట్టున ఏడుపు ఆపేశావ్! నేనేమని అందామనుకున్నానో తెలుసేమిటి?"

"ఐ లవ్ యూ' అంటావు కదూ"

"చాల్లే బడాయి, అది కాదు"

"అదే, అదే, బుకాయించకు."

"బుకాయించడానికి నాకేం ఖర్మ?"

"నువ్వు అన్నా అనకపోయినా నా పట్ల నీ మనసులో ఉన్న ఫీలింగు నాకు తెలుసులే డాక్టర్, నేనంటే నీకు వల్లమాలిన అభిమానం, వాత్సల్యం. అది నువ్వు బయటకు చెప్పేశావనుకో, నీ మనసు తేలికపడుతుంది. నువ్వు చెప్పబోయేది నాకెలాగూ తెలుసు కాబట్టి ..."

జాన్ ధైర్యం చేసేశాడు - "ఐ లవ్ యూ లక్కీ, యూ ఆర్ మై బెస్ట్ ఫ్రెండ్!" అనేశాడు.

లక్కీ మళ్లీ ఎమోషనల్ అయిపోయింది. "ఇంకో రుమాలుందా?" అని అడిగింది.

అదే క్షణంలో జాన్ నిశ్చయించుకున్నాడు - తన మీద ఎన్నో ఆశలు పెట్టుకుని ఆత్మహత్యాప్రయత్నాన్ని సైతం విరమించిన మరో ఫ్రెండు పులి నమ్మకాన్ని వమ్ము చేయకూడదని! పులి కంటి ఆపరేషన్ తక్షణమే చేసేయాలి. దాని వల్ల తన కెంత నష్టం కలిగినా ఫర్వాలేదు. పార్కింగుకు వెళ్లబోతున్నవాడు హఠాత్తుగా కారు మళ్లించి రోడ్ వైపుకి వచ్చాడు. లక్కీ ఉలిక్కిపడింది. - "ఇలా ఎక్కడికి?" అని అడిగింది.

"నా కెరియర్ సర్వనాశనం అయ్యేందుకు దగ్గరదారి ఇదే!" అంటూ కారు ఉరికించాడు.

* * *

బోనులో గురకలు పెడుతున్న పులి జాన్ లేపడంతో నిద్ర లేచింది. జాన్‌ని చూస్తూనే "హేయ్, డాక్టర్! మళ్లీ రాననుకున్నాను, వచ్చావే!" అంది సంతోషంగా.



"రా, నిన్ను కొన్ని టెస్టులు చేయాలి." అని జాన్ అనడంతో 'సరే పద' అని బోనులోంచి బయటకు వచ్చేసింది పులి.

కారు వెనకసీటు వాల్చేసి పులిని అక్కడ పడుకోమన్నాడు జాన్. నడుం వాలుస్తూన్న పులికంట ముందుసీటులో కూచున్న లక్కీ పడింది.

"ఏమిటీ, కుక్క ఫ్రంటుసీట్లోనూ, నేను వెనక్కాలానా?" అంది ఫిర్యాదు చేస్తూ.

లక్కీ తక్కువ తిందా? "ఇదిగో ఇందాకటినుంచి చూస్తున్నా. నేనేమైనా ఫలహారం అనుకున్నావా? అలా మిర్రిమిర్రి చూస్తున్నావ్" అంది.ఫలహారం అనుకున్నావా? అలా మిర్రిమిర్రి చూస్తున్నావ్" అంది.

"ఏడిశావ్‌లే, ఫలహారంట ఫలహారం! పంటికిందకు కూడా రావ్."

"ఇదిగో మీ రిద్దరూ కాస్త నోర్మూస్తారా? అసలే సర్కస్ వాళ్ల కంటబడకుండా ఎలా వెళ్లాలా అని నేను తన్నుకుంటూ ఉంటే మధ్యలో మీ గోలేమిటి?" విసుక్కున్నాడు జాన్.

ఇంతలో కాపలా కాసే జెర్రీ పులికంట బడ్డాడు. "హాయ్ జెర్రీ" అని

అరిచింది పులి.



"కాస్త ఊరుకుంటావా? ఇవతల చెబుతూనే ఉంటే నువ్విలా గాండ్రిస్తావేమిటి?"

"అబ్బే, మరోడూ మరోడూ కాడు. జెర్రీ...నా ఫ్యాన్. డ్యూటీ వదలగానే వచ్చి నా బోను దగ్గరే కూచుని నన్ను చూస్తూ ఉంటాడు." అని జాన్‌కు చెప్పి "హాయ్ జెర్రీ, మరేం లేదు, ఏవో కొన్ని టెస్టులంటేనూ.." అని అరిచి చెప్పింది.

పులిగాండ్రింపులు జెర్రీ దృష్టిని ఆకర్షించాయి. ఎవడో కారేసుకుని పులిని అపహరించుకు పోతున్నాడని ఖంగారు పడ్డాడతను. "హేయ్, హేయ్" అంటూ కారు వెనక్కాల పడ్డాడు. అతనితో బాటు సర్కస్‌లో ఇతర ఉద్యోగులు కూడా పరిగెట్టారు. కానీ జాన్ కారు స్పీడు పెంచేసి అందకుండా పోయేడు.

"డాక్టరుగారూవాళ్లు ఈజీగా పారిపోతారని నేను చెప్పానా, నువ్వు విన్నావా? అబ్బే, మొగుడి మాటంటే కొట్టిపారేయడమే నీ కలవాటు." అని దెప్పింది సర్కస్ తీగలపై వాలి భార్యతో ముచ్చట్లాడుతున్న పావురం.

"దీనిలో తమరు చేసిన ఘనకార్యం ఏమిటో.." దెప్పింది భార్య.

"అంటే నేను వెళ్లి ఆ ముగ్గురు సెక్యూరిటీవాళ్లతోనూ పోట్లాడాలనా నీ ఉద్దేశ్యం!?.. నీ బుద్ధి పోనిచ్చుకున్నావు కావు.."

జాన్ ఇంటికి వచ్చి మేరేజి కౌన్సిలింగ్ చేయించుకున్నది పావురాలజంట ఇదే!

* * *

కాన్ఫరెన్సులో అంతా అల్లకల్లోలంగా ఉంది. జాన్ భార్య లిసా మామగారి దగ్గరకి వచ్చింది - "కారు పార్క్ చేసి వస్తానన్న పెద్దమనిషి అయిపూ అజా లేకుండా పోయేరు. సెల్‌చేసినా ఎత్తటం లేదు. నాకేం పాలుపోకుండా ఉంది." అని వాపోయింది.



ఏం జరిగిందో ఆయనకీ అర్థం కాలేదు. అదే చెప్పబోతూ ఉంటే ప్రెప్రీకా గా పేరు మార్చుకున్న జాన్ పెద్దకూతురు వచ్చి "చూడమ్మా మాయా పార్టీకి ఏం వెంటబెట్టుకు తెచ్చిందో, దానితో ఎలా అడుతోందో చూడు" అంటూ ఫిర్యాదు చేసింది. అంతటితో ఆగక టేబుల్ క్లాత్ ఎత్తి కింద దూరుతున్న చెల్లెల్ని చూపించింది.



పెళ్లికి వెళుతూ పిల్లిని చంకబెట్టుకు వెళ్లినట్టు పార్టీకి వస్తూ ఎలకను చంకన బెట్టుకు తెచ్చింది మాయా. అది బల్లల కింద దూరి మాయాతో



దాగుడుమూత లాడుతోంది. మాయాకూడా బల్లకింద దూరి 'రోనీ, రోనీ, వచ్చేయ్" అంటూ పిలుస్తోంది. ఈ గోల చూసి ఏమనాలో లిసాకు అర్థం కాలేదు.

టేకోవర్ చేసుకునే సంస్థ నుండి వచ్చిన పెద్దాయన మార్క్‌ని అడుగుతున్నాడు - "ఏడయ్యా ఆ మహానుభావుడు డూలిటిల్?" అని.

మార్క్ అర్జంటుగా కథలల్లేశాడు - "నేనిప్పుడే మాట్లాడేను సార్. వస్తూ వస్తూ ఓ అనాథాశ్రమం కనబడితే దాంట్లోకి దూరి ఓ రోగిష్టి పిల్లాడికి వైద్యం మొదలెట్టాడు మా జాన్. వాడంతే! వెన్నలాంటి హృదయం!.."



"ఆ వెన్నమాట ఎలావున్నా నా హృదయం మాత్రం కరగదు. అతనక్కడే మకాం పెట్టేటట్టయితే అక్కడే అనాథగా ఉండమను. పదినిమిషాల్లో ఇక్కడకు వస్తేనే మన అగ్రిమెంటు ఉన్నట్టు, లేకపోతే కట్! ప్లగ్‌లోంచి వైరు పీకేసినట్టు నేను మన కనక్షన్ కట్ చేసిపడేస్తాను."

"అబ్బే, మీరు మరీ అంత ఇదవకండి. ఐదంటే ఐదే ఐదు నిమిషాలలో వచ్చేస్తాడు."

"చూద్దాం, నా దగ్గరా గడియారం ఉందిగా" అన్నాడు పెద్దాయన నిర్లిప్తంగా.

అయనకయితే హామీ ఇచ్చేశాడు కానీ తనకు తానే నచ్చచెప్పుకోలేకపోతున్నాడు మార్క్. జాన్‌కు మళ్లీ పిచ్చెక్కి ఏ జంతువుల ను పట్టుకుని వేళ్లాడుతున్నాడో నన్న భయం అతనిది. నిజానికి భాగస్తులైన ముగ్గురు డాక్టర్లలో జీన్‌కి ఈ టేకోవరు సుతరామూ ఇష్టంలేదు. కానీ డబ్బంటే పడిచచ్చే మార్క్ ఎలాగైనా ఈ టేకోవరు జరగాలని చూస్తున్నాడు. జాన్‌ని, జీన్‌ని దబాయించి తననుకున్నట్టు జరగాలని ఆశిస్తున్నాడు. ఏదో ఒక వింత జరిగి ఈ పార్టీలోనే ఆ ప్రయత్నానికి భంగం కలిగితే బాగుండునని జీన్ ఆశ! ఇవేమీ పట్టని జాన్ మాత్రం పులిని వెంటేసుకుని వీరెవరి కంటా పడకుండా ఆపరేషన్ థియేటరుకు చేరుకున్నాడు.

**(సశేషం)**

## చిత్రవిశేషాలు

ఈ సినిమాలో ఆర్చర్ డూలిటిల్‌గా నటించిన 67 యేళ్ల ఒస్సీ డేవిస్ నటుడే కాదు, రచయితా, దర్శకుడు కూడా. విద్యాధికుడయినా చిన్నా, చితకా ఉద్యోగాలు అనేకం చేయవలసివచ్చింది. 1946లో బ్రాడ్వేలో ప్రవేశం దొరికింది.

సిడ్నీపాయిటర్‌కు సహాయకుడిగా 'నో వే ఔట్' (1950) తో సినిమా కెరియర్ ప్రారంభమై అనేక సినిమాలలో నటించాడు. 1970లో 'కాటన్ కమ్స్ టుహేర్లమ్'తో దర్శకుడయ్యాడు. 'బ్లాక్ గర్ల్', 'గార్డన్స్ వార్' వంటి అనేక సినిమాలకు దర్శకత్వం వహించాడు. ఒక నల్లజాతి నాయకుడి అంత్యక్రియల సమయంలో అతను పఠించిన స్తుతిగీతాన్ని 'మాల్కమ్ ఎక్స్' (1992)లో ఉపయోగించుకోవడం జరిగింది.



# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

**రచన** : రావులపర్తి భద్రిరాజు
**గానం, సంగీతం** : పున్నమరాజు సీత, అవసరాల సత్యవతి
**రాగం** : ఖరహర ప్రియ
22వ మేళ కర్త
కాఫి థాట్ ( హిందుస్తాని సం॥)
**తాళం** : ఆది (కర్ణాటక సం॥)
కహరువా(హిందుస్తాని సం॥)
**ఆరోహణ** : సరిగమపదనిస
**అవరోహణ** : సనిదపమగరిస
- షడ్జము, చతుశృతి రిషభం,సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం,పంచమం, చతుశృతి దైవతం, కైశికి నిషాదం యీ రాగంలోని స్వరాలు.

## గోపీలోలుడు రమ్మన్నాడే

ప॥ గోపీలోలుడు రమ్మన్నాడే
గోవులపాలను తెమ్మన్నాడే ॥గోపీలోలుడు॥
చ॥ మామిడి తోపుల మలుపులలోన
మానసమాతడు గైకొన్నాడే
మరచిపోదమని కనులు మూసినా
మరపురాక హృది కలచివైచెనే ॥గోపీలోలుడు॥
చ॥ పున్నమి వెన్నెల పువ్వుల తేనెలు
పొంగుచు పారలే తీయని వేళల
పూలనావలో యమునాతరగల
తేలిపోదమని బాస చేసెనే ॥గోపీలోలుడు॥





ఖరహరప్రియ కర్ణాటక సంగీతంలోని ప్రముఖమైన రాగాలలో ఒకటి. త్యాగరాజ స్వామి విరచిత "ప్రక్కలనిలబడి", "రామ నీ సమాన మెవరు", "చక్కని రాజమార్గము" మొదలగు కీర్తనలు యీ రాగంలో ప్రసిద్ధమైనవి. లలిత సంగీతంలో కూడా యీ రాగాన్ని ఉపయోగించారు చాలా మంది స్వరకర్తలు. 22వ మేళ కర్తయైన యీ రాగం యొక్క జన్యరాగాలు అభేరి, అభోగి, శ్రీరంజని మొదలగు బహుళ ప్రచారంలో వున్నటువంటివి. ఇవన్నీ కూడా లలిత సంగీతంలో వాడబడుతున్న రాగాలే.

రావులపర్తి భద్రిరాజుగారు ఎన్నో లలిత గీతాలు రచించారు. సాలూరు రాజేశ్వరరావు, ఘంటసాల, సుశీల, రావు బాలసరస్వతీదేవి, డా॥మంగళంపల్లి బాలమురళీకృష్ణ మున్నగు వారు వీరి పాటలు గానం చేశారు. ఘంటసాల గానం చేసిన "ఏడుకొండల సామి ఎక్కడున్నావయ్యా", "నమో వేంకటేశా నమో తిరుమలేశా" మొదలగునవి కమర్షియల్ రికార్డులుగా వెలువడగా, 'పాడనా ప్రభూ పాడనా', "జీవితమంతా కలయేనా", 'సింతసిగురు సిన్న దానా' పాటలు ఆకాశవాణి రికార్డులుగా (Transcription Service Records)గా రూపొంది అత్యంత ప్రాచుర్యాన్ని పొందాయి. భద్రిరాజుగారి రచనలు గురించి 1-15, డిసెంబరు 2003 'హాసం'సంచికలో వివరంగా ప్రస్తావించాను.

శ్రీకృష్ణుని ఎడబాటు సహించలేక గోపికలు అనుభవించిన విరహ వేదనను "గోపీలోలుడు రమ్మన్నాడే" అనే గేయంలో రావులపర్తి వారు కడు హృద్యంగా వర్ణించగా, శ్రీమతులు పున్నమరాజు సీత, అవసరాల సత్యవతి ఖరహర ప్రియ రాగంలో చక్కని బాణీని కూర్చుకుని ఎంతో భావయుక్తంగా ఆ పాటను పాడారు. 1950 దశకంలో ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో వారు పాడిన యీ పాట ఎంతో ప్రాచుర్యాన్ని పొందింది.

## పున్నమరాజు సీత
## అవసరాల సత్యవతి

ఆకాశవాణి విజయవాడ కేంద్రం ప్రారంభం నుండి లలిత సంగీత కార్యక్రమాలలో పాల్గొన్న మధురమైన జంట గాయనీమణులు శ్రీమతులు పున్నమరాజు సీత,అవసరాల సత్యవతి. 1936లో మండపేట(తూర్పుగోదావరి జిల్లా)లో పున్నమ రాజు రాఘవరావు దంపతులకు మొదటి బిడ్డగా జన్మించిన సత్యవతి తన 16వ ఏటనే అవసరాల రామచంద్రరావును వివాహమాడి అవసరాల సత్యవతిగా మారినది. రాఘవరావుగారి సోదరులైన దాసయ్య పంతులుగారికి నాల్గవ పుత్రికగా అదే ఏడాది పుట్టిన సీత అవసరాల జగన్నాథరావు ధర్మపత్నియై అవసరాల సీతగా మారినది. అయినా ఈ సోదరీమణులు ఆకాశవాణి ద్వారా పున్నమరాజుసీత, అవసరాల సత్యవతిగానే ప్రసిద్ధిగాంచారు. పున్నమరాజు రాఘవరావుగారికి ఉన్న సంగీత ప్రవేశంతో సీత,సత్యవతి సోదరీమణులు ఒకచోటే పెరిగి సంగీతాన్ని అభ్యసించసాగారు. ద్విభాష్యం నారాయణ శర్మ (పెద్దాపురం), పిడపర్తి వేంకట నారాయణ (కాకినాడ),వింజమూరి సత్య నారాయణ (చోడవరం), యం.యస్.బాల సుబ్రహ్మణ్య శర్మ (రాజమండ్రి),కోటిపల్లి ప్రకాశరావు (పసలపూడి) గార్ల వద్ద శిష్యరికం చేశారు. వీరిద్దరూ ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో ఆడిషన్ టెస్టులో ఉత్తీర్ణులై ఎన్నో లలిత సంగీత కార్యక్రమాలలో పాల్గొని వైవిధ్యం గల ఎన్నో గేయాలను పాడారు. విజయవాడ లో డా॥మంగళంపల్లి బాలమురళీకృష్ణ, రజనీకాంతరావు, యం.వి. రమణమూర్తి, పాలగుమ్మి విశ్వనాథం గార్ల సంగీత సారథ్యంలో ఎన్నో కార్యక్రమాలలో పాడి పలువురి ప్రశంసలు పొందారు. శ్రీరంగం గోపాలరత్నం, వింజమూరి లక్ష్మి మున్నగువారితో కలిసి బృందగీతాల్లో కూడా తమ గళాలను అందించారు. 1962లో చైనా తో యుద్ధం సంభవించినపుడు యీ సోదరీ మణులు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు రచించిన "నాదు జన్మ భూమి కంటె నాక మెక్కుడుంది" అనే దేశభక్తి గీతాన్ని ఆలపించి శ్రోతల మన్ననలు పొందారు. వీరు గానం చేసిన "గోపీలోలుడు రమ్మన్నాడే" అనే గేయం ప్రాచుర్యాన్ని పొందడమే కాక, ఢిల్లీలోని రాష్ట్రపతి నిలయంలో ఆకాశవాణి విజయవాడ కేంద్రం ప్రతినిధి బృందంలో వీరిద్దరూ సభ్యులుగా వెళ్ళి అక్కడ ఆ పాటను పాడే అవకాశం వీరికి లభించింది. కొంత కాలం తరువాత విశాఖపట్టణం కేంద్రంలో కూడా లలిత సంగీత కార్యక్రమాలలో పాల్గొంటూండేవారు. కాలక్రమేణా వారికి సంసార బాధ్యతలు పెరగడంతో కలిసి పాడటానికి అవకాశం తగ్గింది. తమ సంగీత వారసత్వాన్ని తమ పిల్లలకూ, మేనకోడళ్ళకూ పంచి విశ్రాంతి తీసుకున్నారు. ఈ సుమధుర గాయనీమణులు వార్ధక్యం పూర్తిగా రాక మునుపే (1995 లో శ్రీమతి సత్యవతి,1999 లో శ్రీమతి సీత) దివంగతులైనారు. వెనకటి తరం వారిని వీరి గాత్రాలు,పాటలు సదా అలరిస్తూనే వుంటాయి.



సీత సత్యవతి

### ఖరహర ప్రియ రాగం ఆధారంగా
### కొన్ని చిత్రగీతాలు

| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| 1. పాటకుపల్లవి ప్రాణం (పల్లవిమాత్రం) | సంగీత లక్ష్మి | పి. సుశీల | యస్. రాజేశ్వరరావు |
| 2. బాలనురా మదనా | మిస్సమ్మ | పి.సుశీల | యస్. రాజేశ్వరరావు |
| 3. సంగీత సాహిత్య సమలంకృతే | స్వాతికిరణం | ఏసుదాసు | కె.వి. మహదేవన్ |
| 4. మేఘమా దేహమా మెరవకే యీ క్షణం | మంచుపల్లకి | యస్.జానకి | రాజన్ - నాగేంద్ర |




పౌరాణిక పాత్రలకు పెట్టింది పేరుగా కీర్తి గడించిన ఎన్.టి.రామారావుకు మంచి పేరు తీసుకువచ్చిన సాంఘిక చిత్రాలలో శ్రీ సారధీ స్టూడియోస్ వారు నిర్మించిన




చిత్రం ఒకటి. తాపీ చాణక్య దర్శకత్వంలో ఎన్.టి.ఆర్.తో పాటు సావిత్రి,యస్వీ రంగారావు, సూర్యకాంతం, పెరుమాళ్ళు, హేమలత, రేలంగి, హరనాథ్, గిరిజ తదితరులు నటించిన ఈ చిత్రం 1961 లో విడుదలయింది. మాస్టర్ వేణు ఈ చిత్రానికి సంగీత దర్శకత్వ బాధ్యతలను నిర్వహించారు. కొసరాజు,శ్రీశ్రీ , ఆరుద్ర రాసిన 8 పాటలలో మూడు పాటలు ఈ నాటికీ జనం నోట నర్తిస్తూ ఉన్నాయి.

అ : ముద్దబంతి పూలు బెట్టి మొగిలి రేకులు జడను చుట్టి
ఆ : జడను చుట్టి
అ : హంసలా నడిచివచ్చే చిట్టెమ్మా
ఆ : చిట్టెమ్మా
అ : మా ఇంటికేమి తెచ్చావమ్మా చెప్పమ్మా
ఆ : చెప్పమ్మా ॥ముద్ద॥
ఆ : అద్దమంటి మనసు ఉంది అందమైన వయసు ఉంది
అ : వయసు ఉంది
ఆ : ఇంతకన్నా ఉండేదేంది కిట్టయ్యా
అ : కిట్టయ్యా
ఆ : ఈ పేదవాళ్ళు తెచ్చేదేంది చెప్పయ్యా
అ : చెప్పయ్యా ॥అద్ద॥
అ : పుట్టింటి అరణాలూ...
ఘనమైన కట్నాలూ..హోయ్....ఓ ॥పుట్టింటి॥
అత్తవారింటి నిండా వేసినా
అవి అభిమాన మంత విలువ జేసునా
అభిమానమంత విలువ జేసునా ॥ముద్ద॥
ఆ : అభిమానమాభరణం
మరియాదె భూషణం ॥అభి॥
గుణము మంచిదైతే చాలయా
మన గొప్పతనము చెప్పకోను వీలయా
గొప్పతనమూ చెప్పకోను వీలయా ॥అద్ద॥
అ : కాలు చెయ్ లోపమనీ....
కొక్కిరాయ్ రూపమనీ... ॥కాలు చెయ్॥
ఒదినలు నన్ను గేలి చేతురా
పిల్లను దెచ్చి పెళ్ళి చేతురా
పిల్లను దెచ్చి పెళ్ళి చేతురా
ఆ : ఎవరేమి అన్ననేమి
ఎగతాళి చెయ్యనేమి ॥ఎవరేమి॥
నవ్విన నాప చేనే పండదా
నలుగురు మెచ్చురోజు ఉండదా
నలుగురు మెచ్చురోజు ఉండదా ॥అద్ద॥









కొసరాజు రాసిన ఈ పాటను ఘంటసాల,సుశీల పాడగా ఎన్.టి.ఆర్.,సావిత్రి అభినయించారు. 1959లో వచ్చిన 'బాగపిరివినై' తమిళ చిత్రం 'కలసి ఉంటే కలదు సుఖం' చిత్రానికి ఆధారం. తమిళంలో తాను తీసే ప్రతి చిత్రానికి 'ప'అనే అక్షరంతో గానీ,'బ' అనే అక్షరంతో గానీ ముడిపడే పేరుని పెట్టే ఎ.భీమ్ సింగ్ ఈ 'బాగపిరివినై'చిత్రానికి దర్శకుడు. శివాజీ గణేషన్, బి.సరోజాదేవి హీరో, హీరోయిన్లు. విశ్వనాథం - రామ్మూర్తి ద్వయం సంగీత దర్శకులు. వారు సంగీతాన్ని సమకూర్చిన 'తాళయాం పూముడిచ్చు తడం పార్తుం నడై నడందు' పాట సంగీత సాహిత్యాన్ని 'ముద్దబంతి పూలు బెట్టి' పాటకు ఉపయోగించుకున్నారు. తమిళ గీతాన్ని టి.ఎమ్. సౌందర్రాజన్, సుశీల పాడారు. తర్వాతి రోజుల్లో అద్భుతమైన సంగీత దర్శకుడిగా ప్రసిద్ధి కెక్కిన విశ్వనాథం-రామ్మూర్తి జంటలోని ఎమ్మెస్ విశ్వనాథం ఈ పాట మొదట్లో వచ్చే 'తందనాన తానే' అనే సాకీని ఆలపించారు. తెలుగు పాటను ఘంటసాల,సుశీల ఆలపించినా ఎమ్మెస్ విశ్వనాథం పాడిన ఆ సాకీయే పూర్తి జానపద ధోరణిలో అందర్నీ ఆకట్టుకునే రీతిలో ఉండటం చేత ఆ ఒక్క బిట్ కోసం మద్రాసుకి వెళ్ళి ఎమ్మెస్ చేత పాడించి-మిగిలిన పాటను రికార్డు చేసిన సారధి స్టూడియోలో మిక్స్ చేశారు. ఈ పాటకు ఉత్తరాది రాగం పహాడీ దగ్గరగా ఉంటుంది. బిమల్‌రాయ్ దర్శకత్వంలో 1959లో వచ్చిన 'సుజాత'హిందీ చిత్రంలో సంగీత దర్శకుడు యస్.డి బర్మన్ స్వరపరిచి పాడిన 'సున్ మెరె బంధూరే సున్ మేరె మిత్‌వా'పాట సంగీత ప్రియులకు గుర్తుండే ఉంటుంది. ఆ ఛాయ ఎమ్మెస్ విశ్వనాథం ఆలపించిన 'తందనాన తానే'లో స్పష్టంగా కనిపిస్తుంది. ఎమ్మెస్ విశ్వనాథం అత్యంత్య ప్రతిభావంతుడైన సంగీత దర్శకుడే అయినా ఆయన మీద ఎస్.డి. బర్మన్ ప్రభావం అప్పుడప్పుడు పడుతూ ఉంటుందనడానికి ఈ 'సున్ మేరె బంధూరే' పాటే కాకుండా మరో ఉదాహరణ కూడా వుంది. ఆకలిరాజ్యం (1981) సినిమాలో 'కన్నెపిల్లవని కన్నులున్నవని' పాట గుర్తుండే ఉంటుంది. ఆ పాట ఇంటర్లూడ్స్‌లో ఉపయోగించిన సితార్ బిట్స్ నడక గానీ,మొదటి చరణంలో 'స్వరము నీవై' స్వరమున పదము నేనై' అనే వాక్యం ట్యూన్ గానీ,రెండో చరణంలోని 'తనన తన్న అన్నా తానా అన్నా స్వరమే ఒకటే కదా' అనే వాక్యం ట్యూన్ గాని గైడ్' (1965) హిందీ చిత్రంలో ఎస్.డి.బర్మన్ స్వరపరిచి పాడిన 'వహ్ కౌన్ హై తేరా ముసాఫిర్ జాయెగా కహ్' పాటలోని చరణాల పోకడని జ్ఞాపకం చేస్తూ వుంటుంది.

ఇక ఈ 'ముద్దబంతి పూలు బెట్టి' పాట ట్యూన్ తమిళందే అయినా ఈనాటికి ఇది మన పాటేనేమో నన్నంతగా తెలుగు వారి మనసుల్లో ముద్ర పడిపోవడానికి కారణం- తెలుగు తనాన్ని పూర్తిగా ఉట్టిపడే స్థాయిలో కొసరాజు అందించిన సాహిత్యం ఒక ఎత్తు. అందుకు ముద్దబంతి,మొగిలిరేకు, అరణాలు,కొక్కిరాయ్,నవ్విన నాపచేను పండటం వంటివి ఒక ఉదాహరణ అని చెప్పాలి. ఇక ఘంటసాల,సుశీల గానం మరొక ఎత్తు అని చెప్పనక్కర్లేదు.

తరువాత రోజుల్లో రవీంద్ర ఆర్ట్స్ సంస్థను స్థాపించి లక్షాధికారి,జమిందార్,ధర్మదాత వంటి చిత్రాలు తీసిన తమ్మారెడ్డి కృష్ణమూర్తి(నేటి దర్శక నిర్మాత తమ్మారెడ్డి భరద్వాజ తండ్రి)ఈ 'కలసి ఉంటే కలదు సుఖం' చిత్రానికి ప్రొడక్షన్ వ్యవహారాలు చూసేవారు. 'ముద్దబంతి పూలు బెట్టి'పాట చిత్రీకరణ గురించి చెబుతూ, "అక్కడేమో ఎన్టీఆర్ ఓ గేదె మీద కూర్చొని పాడాలి. ఒక చెయ్యి కుంటిగా పెట్టాలి కనుక మిగిలిన చేత్తోనే కంట్రోల్ చేయాలి. ఆయనేమో నల్లటి షర్ట్ వేసుకున్నారు. అది చూసి గేదె బెదిరేది. ఎందుకైనా మంచిదని ప్రొడక్షన్ డ్రైవర్ని ఎక్కించాం. అతన్ని విసిరేసింది ఆ గేదె. ఎలాగైతేనే నెమ్మదిగా ఆ గేదెని మచ్చిక చేసుకుని ఎన్టీఆర్‌ని కూర్చోబెట్టి జాగ్రత్తగా షూటింగ్ చెయ్యటం జరిగింది' అంటూ వివరించారు.

**సాకీ: మందర మాటవిని మౌఢ్యమున కైకేయి**
**రామలక్ష్మణులను అడవికి పంపెగదా**
**శకుని మాయలు నమ్మి జూదమున ఓడించి**
**కౌరవులు పాండవుల కష్టపెట్టిరిగా**
**పరుల బోధకులొంగి**
**పండువంటి సంసారాన్ని**
**భాగాలుగా చీల్చి పంచుచుండిరి గదా....**

**ప : కలిసి ఉంటే కలదు సుఖం వేరుపడితె తీరని దుఃఖం**
**చెడు బోధలు విన్నారంటే**
**ఎవరికైనా తప్పదు కష్టం ॥కలిసి॥**

**చ : చిట్టి చీమలన్ని మూగి**
**పెద్ద పుట్ట పెట్టునురా ॥చిట్టి॥**
**శిల్పులంత కట్టుగ ఉండే తాజమహలు కట్టిరిరా**
**జనులెందరో త్యాగం చేసి స్వారాజ్యము తెచ్చిరిరా**
**తగవులతో తన్నుక ఛస్తే**
**పతనము ప్రాప్తించునురా ॥కలిసి॥**

**చ : పది కట్టెలు ఒకటిగ ఉంటె**
**పట్టి విరువ లేరురా ॥పది॥**
**ఒక కట్టెగ ఉంటేనే వికలము జేసేరురా**
**కర్ణుడొకడు చేరకపోతే భారతమె పూజ్యమురా**
**యాదవులే ఒకటిగా ఉంటే**
**నాశనమై యుండరురా ॥కలిసి॥**



ఈ పాటను కొసరాజు వ్రాయగా ఘంటసాల,సుశీల బృందం ఆలపించారు. చిత్రంలోని ప్రధాన తారాగణంపై ఈ పాటను చిత్రీకరించారు. మాతృక అయిన తమిళ చిత్రం 'బాగపిరివినై' లోని 'ఒట్రుమయామ్ వాళ్ వదాలె విళయం నన్మయే/ వెట్రుమయై వళర్పదినాలే విళయం తీమయే' అనే పాట యొక్క సంగీత సాహిత్యాల్ని ఈ తెలుగు పాటకు వాడుకున్నారు. సాధారణ గాంధారాన్ని అన్యస్వరంగా వేసుకుంటూ రాగేశ్రీ రాగంతో మలచుకున్న ఈ పాట కూడా తెలుగు వారికి మరింత దగ్గర కావటానికి కారణం కొసరాజు సాహిత్యమేనని మరోసారి చెప్పక తప్పదు. ఈ పాట ట్యూన్‌కి సంబంధించి ఒక తమాషా ఉంది. మొదటి చరణంలోని 'జనులందరూ త్యాగం చేసి స్వారాజ్యము తెచ్చిరిరా' అనే వాక్యం యొక్క ట్యూన్స్‌ని,రెండో చరణంలోని 'కర్ణుడొకడు చేరకపోతే భారతమే పూజ్యము రా' అనే వ్యాక్యాన్ని మననం చేసుకుంటూ 1965 లో వచ్చిన 'సుమంగళి' చిత్రంలో కె.వి.మహదేవన్ స్వరపరిచిన 'సిగలోకి విరులిచ్చి' పాటలోని చరణాలలో గల 'తనువు చిక్కి శల్యంబైన తలపులణగి పోయేనా','కోరినది చేతికి చిక్కి ఆరుతున్న దొక దీపం' అనే వాక్యాల ట్యూన్‌తో పోల్చి చూసుకుంటే ఒక్కలాగే ఉన్నట్టనిపిస్తుంది. ఇది కాపీ కాదు. ఎమ్మెస్ విశ్వనాథం తన తొలిరోజుల్లో కొన్నాళ్ళు పాటు కె.వి.మహదేవన్ వద్ద సహాయకునిగా పనిచేసేవారు. కొన్ని పాటల్ని ట్యూన్ చేసేటప్పుడు జరిగే రాగసాధనలో ఇద్దరి మస్తిష్కాల్లోనూ కామన్‌గా కొన్ని ప్రయోగాలు ముద్ర పడి అవి ఇలా ఈ రూపంలో వచ్చి ఉండవచ్చు. కొన్ని కొన్ని పరిశీలనలు ఆత్మాశ్రయం గానూ,

నిరూపణకు బలం లేనివిగాను ఉంటాయని గతంలో చెప్పుకున్నట్లుగా ఈ ప్రయోగాన్ని కూడా అలాగే పేర్కొనాలి. ఇదిలా ఉండగా చిత్రం టైటిల్‌ని 'కలసి ఉంటె కలదు సుఖం' అని చూపిస్తూ పాటలో మాత్రం 'కలిసి ఉంటె కలదు సుఖం' అని పాడించటం గమనార్హం.

మేలిమి  బంగరు మెలిక తిరిగినా విలువ తరిగేనా
మీ దేహములో చిరులోపములున్నా ప్రేమ కరువగునా ॥మేలిమి॥
సింహము కాళ్ళు చిక్కుపడినను
శౌర్యము కొరవడునా ॥సింహము॥
చేతలు మాటలు ఒకటే అయితే
త్యాగము కరువగునా
త్యాగము కరువగునా ॥మేలిమి॥
కాళ్ళేలేని కమ్మని చంద్రుడు నిరతము పయనించునే ॥కాళ్ళే॥
కరములు చాపే కలువను చేరి
ముదము కలిగించునే
ముదము కలిగించునే ॥మేలిమి॥
పతి పద సేవా భాగ్యము నేనే సతతము నోచితినీ ॥పతి॥
మీ చల్లని మదిలో సౌఖ్యము నొసగే
స్వర్గము చూచితినీ
స్వర్గము చూచితిని ॥మేలిమి॥



ఈ పాటను ఆరుద్ర వ్రాయగా సుశీల ఆలపించారు. సావిత్రి,ఎన్‌టిఆర్ అభినయించారు. ఈ పాట ట్యూన్ కూడా తమిళ మాతృకలోని 'తంగత్తిలె ఒరుకురై ఇరందాలుమ్' పాట నుంచి యథాతథంగా తీసుకోవటం జరిగింది. చిత్రంలో గల పాటలన్నిటిలోనూ సాహిత్యపరంగా ఈ పాటనే గొప్పపాటగా పేర్కొనాలి. దురదృష్టవశాత్తూ ఎలక్ట్రిక్ షాక్ తగిలి కాలూ, చెయ్యి వంకర పోయిన ఓ వ్యక్తిని,మంచి మనసుతో పెళ్ళి చేసుకున్న ఓయువతి తొలినాటి రాత్రి అతనితో 'మీ పట్ల నాకేమీ తక్కువ భావం లేదు' అనే రీతిలో చెప్పడానికి వాడుకున్న ఉదాహరణలన్నీ కవి యొక్క సృజనాత్మకతకు, భావసంపదకు తార్కాణాలు. అందుకు తమిళ రచయిత కణ్ణదాసన్‌ని వేనోళ్ళ కీర్తించాలి. ఆయన ఉదాహరణలే తెలుగులో వాడుకున్నారనడానికి తమిళ గీతంలోని 'సింగత్తిన్ కాల్గళ్ పళదు పటాలం సీఱ్ఱం కురైవదుండో'అనే వ్యాక్యానికి తెలుగు సేతగా 'సింహము కాళ్ళు చిక్కుపడినను శౌర్యము కొరవడునా' అనే వాక్యం సాక్ష్యంగా నిలుస్తుంది. ఈ పాట రాగ ప్రాధాన్యమైంది కాదు. తరచి తరచి చూస్తే శంకరాభరణ స్వరాలు,హరికాంభోజీ స్వరాలు,ఆరభి,దేశ్,తిలక్ కామీద్ నడకలు కనిపిస్తాయి. ఇంకా బాగా అవలోకించుకుంటే 'బైజూబావ్‌రా(1952)హిందీ చిత్రంలో నౌషాద్ స్వరపరచగా లత పాడిన 'బచ్‌పన్‌కి మొహబ్బత్ కో దిల్ సే న జుదాకర్‌నా' పాట నడక గుర్తొస్తుంది.

ఈ 'కలసి ఉంటే కలదు సుఖం' చిత్రంలో కాలూ,చెయ్యి వంకర పోయిన వ్యక్తిగా ఎన్.టి.ఆర్.నటించారు. చిత్రం అంతా ఆయన అలా నటించడానికి షాట్‌కి ముందు ఇంజక్షన్లు తీసుకునే వారని ఆ రోజుల్లో తెగ చెప్పుకొనేవారు. నిజానికి అవన్నీ పుకార్లే. ఎన్‌టిఆర్ తొలి చిత్రం 'మనదేశం'కి ముందు-సారధీ స్టుడియోస్ నిర్మించే 'శ్రీమతి'అనే చిత్రం కోసం దర్శకుడు యల్వీ ప్రసాద్ ఆయన స్టిల్స్‌నీ తీసుకోవడం జరిగింది. ఆ చిత్రం కొన్ని కారణాల వల్ల తీయడం జరగలేదు. అలా సారధీ వారి చిత్రంలో నటించే ఛాన్సు తప్పిపోయి,మ్యానేజ్‌మెంట్ మారి శ్రీసారధి స్టూడియోస్‌గా రూపొందిన తరువాత 'కలసి ఉంటే కలదు సుఖం' రూపంలో ఎన్.టి .ఆర్ కి కలిసొచ్చింది. నిజానికది కలిసొచ్చినట్టే లెక్క.

ఎందుకంటే సారధీ వారు తమిళ చిత్రం 'బాగపిరివినై' హక్కుల్ని కొని ఎవరితో తీద్దామా అనే చర్చల్లో ఉండగా రామకృష్ణ 70ఎమ్ఎమ్ థియేటర్ నిర్మాణం విషయంలో ఎన్.టి.ఆర్ తరచూ హైద్రాబాద్ రావటం వారి దృష్టి నాకర్షించింది. అప్పుడు ఎన్.టి.ఆర్‌ని సారధీ స్టూడియోస్‌కి చెందిన సివిఆర్.ప్రసాద్ కలిస్తే ఆయన ఓకే అన్నారు. ఒకవైపు థియేటర్‌కి సంబంధించిన విషయాలు అల్లాడి పెంటయ్య ( రాజకీయ నాయకులు అల్లాడి రాజ్‌కుమార్ తండ్రి), పి.యస్.ప్రసాద్ చూసుకుంటూ ఉంటే ఎన్టీఆర్ ఇటు షూటింగ్‌లో పాల్గొంటూ వారితో అవసరం వచ్చినప్పుడు సంప్రదించేవారు. అంతే కాదు ఎన్టీఆర్ కోసం రిట్జ్ హోటల్‌ని బుక్ చేస్తే- 'ఎందుకు బ్రదర్ అనవసరంగా డబ్బు వేస్ట్ చేస్తారు!? అంటూ సారధీ స్టూడియోస్‌లో నిర్మించిన ఓ గదిలోకి తన సామన్లను ఉన్న ఫళంగా తెప్పించుకుని షూటింగ్ జరిగినన్నాళ్ళు అక్కడే బస చేశారు. ఎన్ ఎటి బ్యానర్‌పై తాను తీయబోయే చిత్రం స్క్రిప్ట్ వ్యవహారాన్ని ఆ రూమ్‌లోనే తెల్లవారు ఝామున లేచి పరిశీలించే వారాయన. ఒక్కక్షణం కూడ వృధా కాకుండా కాలాన్ని ఎన్టీఆర్ పూర్తిగా వినియోగించుకునే వారనడానికి ఇదొక ఉదాహరణ.

తమిళంలో 'బాగపిరివినై' చిత్రాన్ని తీసిన ఎ.భీమ్‌సింగ్ అదే కథతో 1965లో సునీల్‌దత్,నూతన్ హీరో, హీరోయిన్లుగా 'ఖాన్‌దాన్' చిత్రాన్ని తీయటం జరిగింది.

సిరులొలికే పల్లెటూరు అది. కళలకు కూడా నిలయం ఆ గ్రామం. సంగీత సరస్వతి తాండవమాడే యింట పుట్టాడు రుద్రయ్య. ఇపుడతను రోగిష్టి అయినాడు. పక్షవాతంతో బాధపడుతున్నాడు. అతనికి మొదటి భార్య కూతురు హైమ అంటే పంచప్రాణాలు. రెండో భార్య-హైమ పట్ల కథల్లో చెప్పుకునే నిజమైన సవతి తల్లిలాగే వ్యవహరిస్తూ ఉంటుంది. హైమ చిన్నప్పట్నుంచీ సంగీతమంటే చెవి కోసుకుంటూ వుంటుంది.

ఆ ఊళ్లో శ్రీరామనవమి ఉత్సవాలు వచ్చాయి. దేవుడు రథమెక్కి ఊరేగుతున్నాడు. వీధులన్నీ జనంతో సంబరాలతో కిట కిట లాడుతున్నాయి. వారాలు చేసుకు బతికే యువకుడు సాంబయ్య డప్పువాయిద్యంలో ప్రవీణుడు. ఆ ఊరేగింపులో సాంబయ్య డప్పువాయిస్తూ పాడుతున్నాడు.

**రచన : వేటూరి సుందరరామమూర్తి**
**గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పట్టాభి & కోరస్**

ఊరేగినా వాడే ఊరేలినా వాడే
ఊరూ పేరున్న వాడు,ఉన్నవాడూ వాడే
మా వూరి దేవుడమ్మా
చల్లంగ మమ్మేలు రాముడమ్మా ॥మా వూరి॥
మా వాడ వెలసినాడు
మా వారి గాంచినాడు ॥మా వాడ॥
మహి లోపల దేముడై
మహిమలెన్నో చూపినాడు ॥మా వూరి॥
మహాప్రభో నీ మహిమ తెలియగా
మానవు లెంతటివారు
పరమాత్మ నీ భజనకు
పిలచితే బద్ధకమని పలికేరు
చర్మపు తిత్తులే శాశ్వత మనుకొని
చంచల మతులయ్యేరు
హరి... హరిలో రంగ హరి... వైకుంఠ వాసా హరి...
హరిలో రంగ హరి హరి హరి హరి హరి
ఒక మాట ఒక బాణం అన్నాడు
ఒక సీతమ్మనే ఏలుకున్నాడు ॥ఒక మాట॥
మడేలోడి మాటైనా మన్నించాడూ
మడేలోడి మాటైనా మన్నించాడూ
అడవికంపి సీతమ్మను ఆదర్శం నిలిపాడు ॥మా వూరి॥
ఓ హోయ్ రాములు
సా హోయ్ సాములు ॥ఓ హోయ్॥
పడతా పడతా నేను
పప్పుదాకలో పడతా
పడతా పడతా నేను
పాతర గోతిలో పడతా
సీతమ్మప్పో...హనుమంతప్పా
హనుమంతప్పో...సీతమ్మప్పా
ఓ హోయ్ రాములు
సా హోయ్ సాములు
మా ఆడపడుచులు మా తల్లులు సీతమ్మలు
మగసిరిగల దొరలంతా మా తండ్రులు రామయ్యలు॥మా ఆడ॥
లేదూ రావణబాధ రాదు మాకు ఏ కొరత ॥2॥
రాముడే దేముడైన
రామాయణమే మా కథ ॥మా వూరి॥

రథోత్సవంలో సాంబడి నైపుణ్యాన్ని హైమ గమనించింది. ఆ మర్నాడు వాళ్ళింటికి భోజనానికి వచ్చినపుడు అతనితో "నిన్న ఊరేగింపులో డప్పు గొప్పగా వాయించావు. నాకెంతో నచ్చింది" అన్నది మూగాభినయం చేస్తూ. ఏవరితో ఏమాట చెప్పుకోవాలన్నా సంజ్ఞలే ఆమెకు ఆధారం. రెండో ఏట మాట పడిపోయింది.

"మీకు నచ్చిందా అమ్మాయిగారూ?" అడిగాడు సాంబడు.

"ఔను" అంటూ నవ్వింది.

సాంబడు వూరిచివర కొండమీద గుడిలో వుంటున్నాడు. అతనికెవరూ లేరు.

హైమకు పిచేగాలిలోను,కదిలే ఆకుల్లోను సంగీతం వినిపిస్తోంది. ఒళ్ళు పులకరిస్తోంది. మువ్వలు తెచ్చుకొని దొడ్లో ఎవరూ చూడకుండా కాళ్ళకు కట్టుకొని ఆడుతూ ఊహాలోకాల్లో తేలిపోతోంది.

**రచన : వేటూరి సుందర రామమూర్తి**
**గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పి.సుశీల**

ఝుమ్మంది నాదం
సై యంది పాదం
తను వూగింది ఈ వేళ
చెలరేగింది ఒక రాసలీల ॥ఝుమ్మంది॥
ఎదలోని సొదలా ఎలదేటి రొదలా
కదిలేటి నదిలా కలల వరదలా
ఎదలోని సొదలా ఎలదేటి రొదలా
కదిలేటి నదిలా కలల వరదలా
చలిత లలిత పద కలిత కవిత లెద
సరిగమ పలికించగా స్వర మధురిమ లొలికించగా
సిరిసిరి మువ్వలు పులకించగా ॥ఝుమ్మంది॥
నటరాజ ప్రేయసి నటనాల ఊర్వశి
నటియించు నీవని తెలిసి
నటరాజ ప్రేయసి నటనాల ఊర్వశి
నటియించు నీవని తెలిసి
ఆకాశమై పొంగె ఆవేశం
కైలాసమే వంగె నీకోసం ॥ఝుమ్మంది॥
మెరుపుంది నాలో
అది నీ మేని విరుపు
ఉరుముంది నాలో
అది నీ మువ్వ పిలుపు
చినుకు చినుకులో చిందు లయలతో
కురిసింది తొలకరి జల్లు
విరిసింది అందాల హరివిల్లు
ఈ పొంగులే ఏడు రంగులుగా
ఝుమ్మంది నాదం
సై యంది పాదం
తను వూగింది ఈ వేళ
చెలరేగింది ఒక రాసలీల

పాట అయిపోయినా, దొడ్లో కొబ్బరి మొక్కల కింద యింకా ఆడుతూనే వుంది. హైమ పినతల్లి మువ్వల సవ్వడి విని దొడ్లోకి వచ్చి పరవశించి ఆడుతున్న హైమను చూసింది. పళ్ళు బిగించింది. కళ్ళు పెద్దవి చేసింది. కొరివి కంచు తీసుకొచ్చి కాలిమీద వాత వేసింది. పాపం-నిర్భాగ్యురాలు, హైమ ఎవరితో చెప్పుకుంటుంది తన మూగవేదన.

హైమకు పెళ్ళి సంబంధం చూశారు. సాంబడికి తెలిసింది. "అమ్మాయి గారూ, పెళ్ళి చేసుకుంటున్నారా?" అని అడిగాడు.

సిగ్గుతో ఆమె తల వంగిపోయింది. మౌనంగా ఔనంటూ తల వూపింది.

"మీ పెళ్ళికి వెండి మువ్వలు కానుకగా యిస్తాను అమ్మాయిగారు. పట్నం వెళ్ళి తెస్తాను. అంతవరకూ పెళ్ళి చేసుకోకండి?" అన్నాడు.

సాంబడి మంచి మనసుకు, ప్రేమాదరాలకు హైమ హృదయం కదిలింది. అతనెవరు? తానెవరు?తనంటే అతనికి ఎందుకింత యిష్టం? సాంబడు పట్నం వెళ్ళాడు. ఆడి,పాడి డబ్బు సేకరించాడు. వెండి మువ్వలు కొన్నాడు. తను వెళ్ళేసరికి అమ్మాయిగారు పల్లకిలో వుంది. ఆనందంగా,తృప్తి తీరా ఆ పల్లకీ వెంట వెడుతూ పాడుతున్నాడు.

రచన : వేటూరి సుందర రామమూర్తి
గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం

అందానికి అందం ఈ పుత్తడి బొమ్మ
అందరికీ అందనిదీ పూచిన కొమ్మ
పుత్తడిబొమ్మా... పూచినకొమ్మా ॥అందానికి॥
పలకమన్న పలకదీ పంచదార చిలక
కులుకే సింగారమైన కొలసిగ్గుల మొలక
ఎదకన్నా లోతుగా పదిలంగా దాచుకో
నిదురించే పెదవిలో పదముందీ పాడుకో
పుత్తడి బొమ్మా... పూచిన కొమ్మా... ॥అందానికి॥
ఆ రాణీ పాదాల పారాణి జిలుగులో
నీ రాజభోగాలు పాడనీ తెలుగులో
ముడి వేసిన కొంగునే గుడివుంది తెలుసుకో
గుడిలోని దేవతని గుండెలో కలుసుకో
పుత్తడి బొమ్మా... పూచిన కొమ్మా ॥అందానికి॥
సాకీ: ఈ జన్మకింతే ఇలా పాడుకుంటాను
ముందు జన్మవుంటే ఆ కాలి మువ్వనై పుడతాను
పుత్తడి బొమ్మా... పూచినకొమ్మా ॥అందానికి॥

అది నిజంగాదు. తను కలగన్నాడు. నవ్వుకుంటూ వచ్చాడు. ఊళ్లో అమ్మాయిగారి పెళ్ళి గుళ్ళో తను వచ్చే సరికి జరుగబోతున్నది నిజంగానే. పెళ్ళి కొడుకుని చూశాడు. వాడెవడో ఎంతటి తుచ్ఛుడో సాంబడు అంతకు ముందు జరిగిన ఒక సంఘటనలో చూశాడు. ఆ మాటే అక్కడున్న వారందరితోను,రుద్రయ్యతోను చెప్పాడు. అతని మాటల్లో రుద్రయ్యకు సత్యం ధ్వనించినా,ఆయన్నీ,సాంబయ్యనీ ఎవరూ లెక్కచెయ్యలేదు. పెళ్ళికొడుకు తరపువాళ్ళు, రుద్రయ్య మేనల్లుడు సాంబడిని భరించలేక ఆ మండపంలోంచి బయటికి గెంటేశారు.

అతడు వెళ్ళి నటరాజ విగ్రహం ముందు పడ్డాడు. ఆవేశం చిందులు తొక్కింది. ఉడుకు రక్తం ఉరకలెత్తింది. విధిలేక నమ్మిన దైవాన్ని పిలుస్తున్నాడు-ఆవేదనతో, ఆవేశంతో...

రచన : వేటూరి సుందర రామమూర్తి
గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం

రా దిగిరా దివినుంచి భువికి దిగిరా ॥రా దిగిరా॥
రామ హరే శ్రీరామ హరే ॥2॥
రాతి బొమ్మకు రవ్వలు పొదిగి రామ హరే శ్రీరామ హరే
రాతి బొమ్మకు రవ్వలు పొదిగి రామ హరే శ్రీరామ హరే అని
పట్టిన హారతి చూస్తూ ఏమీ పట్టనట్టు కూర్చుంటే చాలదు ॥రా దిగిరా॥
అలనాటి ఆ సీత ఈనాటి దేవత
శతకోటి సీతల కలబోత ఈ దేవత
రామచంద్రుడా కదలిరా రామబాణమే వదలరా
ఈ ఘోర కలిని మాపరా ఈ క్రూర బలిని ఆపరా ॥రా దిగిరా॥
నటరాజా శత సహస్ర రవితేజా
నటగాయక వైతాళిక మునిజన భోజా ॥నటరాజా॥
దీనావన భవ్యకళాదివ్య పదాంభోజా
చెరిసగమై రసజగమై
చెలగిన నీ చెలి ప్రాణము బలిపశువై యజ్ఞవాటి
వెలి బూడిద అయిన క్షణము
సతీ వియోగము సహించక
దుర్మతియౌ దక్షుని మదమడంచగ
ధమ ధమ ధమ ధమ డమరుక ధ్వనుల
నమక చమక యమగమక లయంకర
సకలలోక జర్జరిత భయంకర
వికట నటత్పద విస్ఫు లింగముల
విలయ తాండవము సలిపిన నీవే
శిలవే అయితే పగిలిపో
శివుడే అయితే రగిలిపో

నానా గొడవ జరిగి పోలీసులు రావడంతో పెళ్ళి ఆగిపోయింది. మోసం చేసిన వ్యక్తిగా పెళ్ళికొడుకుని పోలీసులు పట్టుకెళ్ళారు.

జరిగిన అవమానం రుద్రయ్యను మంచ మెక్కించింది. హీనస్థితిలో వున్నాడు. భార్య,మేనల్లుడు పట్నం వెళ్ళారు. రుద్రయ్య తనచెంత వుండి ఉపచర్యలు చేస్తున్న ముద్దుల కూతురు హైమనూ, సాంబడ్నీ చూశాడు. ఏదో చెప్పాలనుకున్నాడు. నోటిలో మాట నోట్లోనే వుండి పోయింది. కన్ను మూశాడు. రుద్రయ్యకు దహన సంస్కారాలు చెయ్యడానికీ, హైమకూ ఇపుడు సాంబడే దిక్కు అయినాడు.

రచన : వేటూరి సుందర రామమూర్తి
గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం & కోరస్

ఎవరికెవరు ఈ లోకంలో ఎవరికి ఎరుక
ఏ దారెటు పోతుందో ఎవరినీ అడగక ॥ఎవరి॥
జోరుసెయ్ బార్‌సెయ్ కోరంగి రేవుకెయ్ కోటిపల్లి రేవుకై
వాగు వంక కలిసేది నదిలో- ॥వాగు॥
కదిలి కదిలి నదులన్నీ కలిసేది కడలిలో ॥2॥
కానీ ఆ కడలి కలిసేది ఎందులో ॥ఎవరి॥
జోరుసెయ్ బార్‌సెయ్ కోరంగి రేవుకెయ్ కోటిపల్లి రేవుకై ॥ఎవరి॥

ఆ ఊరి నుంచి రేవు దాటి హైమతో పట్నం వచ్చాడు సాంబడు. ఉండటానికి అద్దె యింటికోసం తిరిగాడు. ఒక యింటి యజమాని వేసిన చచ్చు ప్రశ్నలకు తన్నబోయాడు కూడా. "మనం వూళ్ళోనే ఉండద్దు" అన్నది ఆమె. "ప్రకృతి మధ్య ఏ చెట్టునీడనో బతుకుదాం" అన్నది.

నది వొడ్డున-నీళ్ళ గలగల,ఆకుల సవ్వడి,కోకిల గానం ఆమెకు ఆనందం కలిగించాయి. వాటి పిలుపులోని అంతర్యం ఏమిటని సాంబడ్ని అడిగింది.

రచన : వేటూరి సుందరరామమూర్తి
గానం : పి. సుశీల ,యస్.పి.బాలసుబ్రహ్మణ్యం

ఒడుపున్న పిలుపు
ఒదిగున్న పులుపు
ఒక గొంతులోనే పలికింది-అది
ఏ రాగమని నన్నడిగింది ॥ఒడు॥
అది మనవూరి కోకిలమ్మా
నిన్నడిగింది కుశలమమ్మా-
నిజమేమొ తెలుపు
నీ మనసు తెలుపు
ఎగిరేను మన వూరివైపు-అది
పదిమంది కామాట తెలుపు ॥నిజమేమొ॥
గోదారల్లే-ఎన్నెల్లో
గోదారల్లే, ఎల్లువ
గోదారల్లే, వెన్నెట్లో గోదారల్లె ఎదలో ఏదోమాట
రొదలో ఏదో పాట ॥గోదా॥
అలలా ఎన్నెల గువ్వా
ఎగిరెగిరి పడుతుంటే
గట్టుమీన రెల్లు పువ్వా
బిట్టులికి పడుతుంటే ॥అలలా॥
ఏటివార లంకలోనా
ఏటవాలు డొంకలోనా ॥ఏటి॥
వల్లంకి పిట్టా పల్లకిలోనా
సల్లంగ మెల్లంగ ఊగుతు ఉంటే ॥గోదా॥

చివరికి జనార్ధనస్వామి గుడి మండపంలో యిద్దరూ కలిసి మకాం పెట్టారు. సాంబడి ఆరోగ్యం అస్తవ్యస్తంగా ఉంది. హైమ కనిపెట్టి డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళింది. ఆయన అతనికి టి.బి.అని చెప్పిన విషయం ఆమెకు తెలియనివ్వలేదు. తీరా మకాంకు వచ్చాక ఆమె కనిపెట్టింది. మందులు కొందామంటే డబ్బులేదు. ఒకరోజు తనను థియేటర్లో నృత్యం చెయ్యమని

అడగటానికి వచ్చిన రాంబాబుని కలుసుకుంది. ఉదార హృదయుడయిన ఆ యువకుడు ఆమె నృత్య ప్రదర్శన ఏర్పాటు చేశాడు. ఆమెకు తెలీకుండా సాంబడుకూడా ప్రదర్శన యివ్వటానికి అక్కడికే వచ్చాడు.

రచన : వేటూరి సుందర రామమూర్తి
గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం

ఝణన ఝణన నాదంలో ఝుళిపించిన పాదంలో
జగము జలదరిస్తుంది పెదవి పలకరిస్తుంది
గజ్జె ఘల్లు మంటుంటే
గుండె ఝల్లు మంటుంది ॥గజ్జె॥
గుండె ఝల్లు మంటుంటే
కవిత వెల్లువవుతుంది ॥గుండె॥గజ్జె॥
అమరావతి శిల్పంలో
అందమైన కళలున్నాయి
అవి-నీలో-మిల మిల మెరిసే
అరకన్నుల కలలైనాయి ॥అమ॥
నాగార్జున కొండ కోనలో
నాట్యరాణి కృష్ణవేణి ॥నాగా॥
నీ విరుపుల మెరుపులలో
నీ పాదాల పారాణి ॥గజ్జె॥
తుంగభద్ర తరంగాలలో
సంగీతం-నీలో-వుంది
రంగ రంగ వైభవంగా
పొంగి పదం పాడిస్తుంది ॥తుంగ॥
అచ్చ తెలుగు నుడికారంలా
మచ్చలేని మమకారంలా ॥అచ్చ॥
వచ్చినదీ కవితా గానం
నీ విచ్చిన -ఆరవ ప్రాణం ॥గజ్జె॥

సాంబడి పాట,ఆమె ఆట అంతా మెచ్చుకున్నారు. వచ్చిన డబ్బుతో మందులు కొంది. మంచి డాక్టరుకి సాంబడ్ని చూపించింది. అతని ఆరోగ్యం కోలుకుంది. 'ఇంత మంచి అమ్మాయిగార్కి అన్ని విధాలా తగిన వరుడు రాంబాబుగారే' అని నిర్ధారణ చేసుకొని హైమనిచ్చి పెళ్ళి చేస్తానని అతనికి వాగ్దానం చేశాడు సాంబడు.

ఆమె విన్నది. ఏమీ మాట్లాడలేదు. ఆ రాత్రి మండపంలో...పడుకుందామె. దూరంగా కింద సాంబడు పడుకున్నాడు. మండపం గోడకు మువ్వలు వేళ్లాడుతున్నాయి. కింద డప్పు ఉంది. గాలికి మువ్వలు వచ్చి డప్పు మీద పడ్డాయి. ఆ సవ్వడికి ఏదో ఆలోచిస్తున్న హైమ అది చూసింది. నాదం,లయల కలయిక ఆమెలో చక్కటి ఆలోచన తెచ్చింది. అవును...తనకు తగిన వరుడు సాంబడే! తనని అర్థం చేసుకున్నవాడు, ఆదరించినవాడు,తన జీవితాన్ని మూడు పువ్వులు ఆరు కాయలుగా చేయగలిగేవాడు అతనే! అతనే తన భర్త.

రచన : వేటూరి సుందర రామమూర్తి
గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం

రారా స్వామి రారా
యదువంశ సుధాంబుధి చంద్ర... స్వామి రారా
శతకోటి మన్మధాకారా
స్వరరాగ సుధారస వీరా
స్వామి రారా
నా పాలి దిక్కు నీవేరా
నీ పదములంటి మ్రొక్కేరా
నీ దానరా రావేలరా నన్నేలరా
భరత శాస్త్ర సంభరిత పదద్వయ
చరిత నిరత సుమధుర మంగళ గళ రారా
స్వామీ రారా ॥రారా॥
రాగాలెన్నో పండిన గారాల నీ మెడలో
అనురాగ మాలికలే వేయాలని
నీ చల్లని చరణాలు చల్లిన కిరణాలలో
రేపటి కోసం చీకటి రెప్పల తెర తీయాలని
పిలిచాను ఎదుట నిలిచాను
కోరి కోరి నిన్నే వలచాను ॥పిలి॥
గంగ కదిలి వస్తే కడలి ఎలా పొంగిందో
యమున సాగివస్తే ఆ గంగ ఏమి పాడిందో
ఆమని వచ్చిన వేళ అవని ఎంత మురిసిందో
మోహన వేణువు తాకిన మోవి ఎలా మెరిసిందో
ఊగింది తనువు అలాగే
పొంగింది మనసు నీలాగే
శ్రుతి కలిపిందెన్నడో సిరిసిరిమువ్వల సవ్వడిలో
జత కలిసిందిప్పుడే ఆ గుడిలో నీ ఒడిలో ॥శ్రుతి॥
మువ్వనై పుట్టాలని అనుకున్నా నొకనాడు ॥2॥
దివ్వెనై నీ వెలుగులు రువ్వనీ యీ నాడు ॥పిలి॥

జైలు నుంచి తప్పించుకు వచ్చిన పెళ్ళికొడుకు సాంబడిపై పగబట్టాడు. పూజారిని బెదిరించి సాంబడు ఎక్కడున్నాడో తెలుసుకోవడానికి ప్రయత్నం చేశాడు. రుద్రయ్య మేనల్లుడు నాతో రా... నేను చూపిస్తానని అతన్ని తీసుకువెళ్ళాడు. హైమ తన మనసును సాంబడికి వివరించింది. ఈలోగా ఆ ఇద్దరు కలిసి సాంబడిని బంధించారు. హైమని తమతో తీసుకువెళ్ళాలని ప్రయత్నించారు. కానీ భగవంతుడు చెడుకు అనుకూలించడని మరొకసారి రుజువైంది. పెళ్ళికొడుకు కోసం వెతుకుతున్న పోలీసులకి తామెక్కడ బంధించబడ్డామో తెలిసేలా గుడిలోని గంటలని తన తలతో రక్తం ధారలు కారేలా మోదాడు. పోలీసులకు ఆచూకీ తెలిసింది. పెళ్ళికొడుకుని, రుద్రయ్య మేనల్లుడిని బంధించారు. సాంబడు, హైమ పెద్దల ఆశీర్వాదంతో ఒకటయ్యారు.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| సంగీతం | : కె.వి. మహదేవన్ |
| పాటలు | : వేటూరి సుందరరామమూర్తి |
| పాడినవారు | : పి.సుశీల, యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పట్టాభి |
| సంభాషణలు | : వేటూరి, జంధ్యాల |
| కళ | : తోట |
| నృత్యం | : పసుమర్తి |
| రూపకల్పన | : జయకృష్ణ |
| కాస్ట్యూమ్స్ | : కె. సూర్యారావు |
| కూర్పు | : కె.బాబూరావు |
| స్టిల్స్ | : డి. రాధాకృష్ణమూర్తి |
| ప్రొడక్షన్ | : వి. పట్టాభి,యం.రామారావు |
| పబ్లిసిటీ ఇన్‌ఛార్జి | : మోహన్ కుమార్ |
| పబ్లిసిటీ డిజైన్స్ | : గంగాధర్ |
| సహకార దర్శకుడు | : యం. భీమేశ్వరరావు |
| నిర్మాణ పర్యవేక్షణ | : ఏడిద నాగేశ్వరరావు,B.A. |
| ఫోటోగ్రఫీ | : వి.యస్.ఆర్.స్వామి,W.I.C.A. |
| సమర్పణ | : చింతా రామకృష్ణారెడ్డి |
| నిర్మాతలు | : కర్రి లచ్చారెడ్డి, యన్.భాస్కరరెడ్డి, యు. చినవీర్రాజు |
| కథ,స్క్రీన్‌ప్లే,దర్శకత్వం | : కె. విశ్వనాథ్ B.Sc. |

